రాధాస్వామీ దయాల్ కీ దయా

రాధాస్వామీ సహాయ్

# అమృతబచన్

పరమగురు మహారాజ్ సాహబ్ వారు రచించిన

డిస్కోర్సెస్ ఆవ్ రాధాస్వామీ ఫేత్

అను ఆంగ్ల గ్రంథమునకు

పరమగురు సాహబ్జీమహారాజువారి హిందీ భాషాంతరీకరణమైన

అమృతబచన్ అను గ్రంథమునకు తెలుగు తర్జుమా





ప్రకాశకులు

రాధాస్వామీ సత్సంగసభ

దయాల్బాగ్, ఆగ్రా

మొదటి కూర్పు ] 1971 [ 1000 ప్రతులు

రాధాస్వామీ దయాల్ కీ దయా
రాధాస్వామీ సహాయ్

# అమృతబచన్

పరమగురు మహారాజ్ సాహబ్ వారు రచించిన
డిస్కోర్సెస్ ఆన్ రాధాస్వామీ ఫేత్
అను ఆంగ్ల గ్రంథమునకు

పరమగురు సాహబ్జీమహారాజు వారి హిందీ భాషాంతరీకరణమైన
అమృతబచన్ అను గ్రంథమునకు తెలుగు తర్జుమా



ప్రకాశకులు
రాధాస్వామీ సత్సంగసభ
దయాల్బాగ్, ఆగ్రా

మొదటి కూర్పు ] 1971 [ 1000 ప్రతులు

# తొలిపలుకు

రాధాస్వామీమతమునకు పరమపూజ్యతృతీయ సద్గురువైన మహారాజ్ ...బ్ వారు వాస్తవపారమార్థికమార్గమునకు యోగ్యమైన మూలసిద్ధాంత ...ను గుఱించి విజ్ఞానశాస్త్రపద్ధతులననుసరించి అతిమధురమనోహర శైలిని ...్యచేయుచు, రాధాస్వామీమతసిద్ధాంతము లావిధముగనే యున్నవనియు ...నశాస్త్రసమ్మతమైన విధమున నవి పరిశోధనార్హములనియు, రుజువు ...ుచు, ఆంగ్లభాషలో "డిస్కోర్సెస్ ఆన్ రాధాస్వామీ ఫేత్" ...courses on Radhasoami Faith) అను గ్రంథమును వ్రాసిరి. పరమపూజ్య ...మసద్గురువైన హుజూర్ సాహబ్జీమహారాజ్ వారు ఈగ్రంథమును "అమృత ...్" అను నామాంతరముతో ఉర్దూ హిందీ భాషలలోని కనువదించిరి. ...హబ్జీమహారాజ్ వారు ఆయనువాదములో, అచ్చటచ్చట, కొన్నిక్లిష్టభాగ ...ను, సామాన్యపాఠకులకెక్కువ సులువుగా అవగాహనయగునట్లు మహా ...తో విస్తరించికూడ వ్రాసిరి.

ఉర్దూ హిందీ ఆంగ్లభాషలెవ్వియు తెలియని ఆంధ్రదేశములోని ప్రజల ..., సత్సంగీ సోదరీసోదరులకును ఆమూలగ్రంథమునుగాని, దాని ఉర్దూ ...దీ అనువాదములనుగాని స్వయముగాచదివి అందలిబోధలను అవగాహన ...కొనుటకు వీలులేనందున అట్టివారి నిమిత్తము, రాధాస్వామీ సత్సంగసభ ... శ్రీ వు॥ సత్యనారాయణ, శ్రీ దే॥ సుబ్బారావుగార్లచే ఆగ్రంథమును ...భాషలోనికి తర్జుమాచేయించిరి. ఈతర్జుమాకు హిందీ అనువాదము ...మృతబచన్" మూలగ్రంథముగా స్వీకరించబడినది. వారిద్దరునుతీసికొనిన ...కు వారికి సభవారు ఎంతయును కృతజ్ఞులు. ఆంధ్రదేశ ప్రజలకును, సత్సంగీ ...రీ సోదరులకును, ఈయుత్తేజకమూలగ్రంథములోని జ్ఞానోద్దీపకవిషయము ... అవగాహనచేసికొని లాభమునొందుటలో ఈయనువాదము సహాయ ...ముగా నుండగలదని ఆశించుచున్నాము. ఆంధ్ర సోదరీ సోదరులందఱు ...నువాదగ్రంథమును చదివి పరిపూర్ణలాభము నొందెదరనికూడ ఆశించు ...న్నాము.

గురుసరన్‌దాస్ సహగల్,

అధ్యక్షులు,

రాధాస్వామీ సత్సంగసభ.

## చ తు ర్థ భా గ ము

మానవులుచేయు కర్మలనుగురించియు, ఆ కర్మలమూలమున మానవులపై గలిగెడి ప్రభావమునుగురించియు వర్ణనము. (162-165 పుటలు)

# అమృత బచన్

## (తెనుఁగు తర్జుమా)

రాధాస్వామీ దయాల్ కీ దయా
రాధాస్వామీ సహాయ్

## భూమిక



(హిందీ అనువాదములోని భూమికకు అనువాదము)

ఈ పొత్తము పరమగురు మహారాజ్ సాహబ్ వారిచే రచింపబడిన "డిస్కోర్సెస్ ఆన్ రాధాస్వామీ ఫేత్" అను ఆంగ్ల గ్రంథమునకు హిందీ అనువాదము. ఆంగ్ల భాషా జ్ఞానము గల సోదరులకు "డిస్కోర్సెస్" మూల గ్రంథము నవగాహన చేసికొనుటలో సౌకర్యము కలిగించుటయును, జనసామాన్యమంతటికిని సావధానతగ గ్రంథమును పఠింపనాసక్తి జనింపజేయుటయునే ఈ భాషాంతరీకరణము యొక్క ముఖ్యోద్దేశ్యము. ఈ యనువాదము ఆంగ్ల మూలమునకు పూర్తిగ ననుకూలించి యుండవలయుననియే మా ప్రధానోద్దేశ్యమై యున్నను అందలి విషయ మందరికిని సులువుగ బోధపడునట్లు స్పష్టీకరించుటకై యక్కడక్కడ మూలము పెంపు చేయబడినది, ఆంగ్ల (మూల) గ్రంథములోని యుత్తమలక్షణము లీయనువాదములో లేవనియు, నందలి పెక్కు విషయములకీ యనువాదములో కేవలము సంక్షిప్తముగనే వివరణము చేయబడినదనియు చెప్పుటలో సందేహము లేదు. ఈ లోపములుండినను, భక్తుల కీ యనువాదమును చదివినందువలన నాంగ్ల గ్రంథములోని విషయముల నవగాహన చేసికొనుటలో నెక్కుడు సౌకర్యము తప్పక కలుగగలదని యాశించుచున్నాము.

పరమగురు మహారాజ్ సాహబ్ వారికి "డిస్కోర్సెస్" వ్రాయనారంభించు దివ్యేచ్ఛ 1906 సం॥ము చివరి భాగములో కలిగెను. ఆపై సంవత్సరములో వారి యారోగ్య మెక్కువగ చెడిపోవుచుండినను, భగవత్కృపచే వారు గ్రంథ లేఖన మెప్పటియట్ల జరిపించుచునే యుండిరి, కాని యింతలో వారికి, నిజధామము వేంచేయు దివ్యేచ్ఛ కలుగుటచే నీ యమూల్య గ్రంథము అసంపూర్ణముగ నుండిపోవుట శోచనీయము, మహారాజ్ సాహబ్ వారు గుప్తమైన సిద్ధ

ని వారిత్రతి తమ యధీనమునగల యొకరిద్దఱు సోదరులు దానిలోని పద బను కొన్నిటిని మార్చియు, నందలి విషయములకు భిన్నభిన్న శీర్షికల నేర్పా చేసియు, దాని నచ్చొత్తించిరి. మహారాజ్ సాహబ్ వారు గుప్తమగు సీ పవిత్రగ్రంథ మసంపూర్ణముగనుండి, తప్పులు సవరణగాకుండగనే ము తము కావలసివచ్చుట సకలజనశోచనీయమేగాని "డిస్కోర్సెస్" గ్రంథ 1909 సం॥రములోనే ముద్రితమై, యందఱకును లభ్యమగునట్లుచే నిమిత్తమై శ్రీమతిసికొనిన ప్రేమిసోదరులకును పూజనీయ మాతాజీసాహ వారికిని సత్సంగమండలియందఱును హార్ద్రకృతజ్ఞతాపూర్ణులైయున్నారు.

రాధాస్వామిమతముయొక్క ప్రథమపూజ్య సద్గురువును వారి చ సేవకులు "స్వామిజీమహరాజ్" అను నామముతో సంబోధించెడివా వారు ఆగ్రాపట్టణములో పన్నిగల్లీ యను పేటలో నొకగౌరవనీయ కుటుంబమున 1818 సం॥రము ఆగస్టునెలలో జన్మించిరి. వారు 1861 సం ములో సత్సంగమును ప్రజాసామాన్యమందఱకును తెఱచివేయు మహాన హాముచేసి 1878 సం॥రము జూన్ నెల వరకును తమయాధిపత్యమ సత్సంగము జరిపించిరి. వారిసమాధి ఆగ్రా పట్టణమునకు బయట స్వా బాగులో నిర్మింపబడెను. వారికి తల్లితండ్రులిడినపేరు "లాలాశివదయ సింహసేఠ్." వారి యనంతరము పరమగురు రాయ్ సాలిగ్రామ్ సాహబ్ బహా వారు రాధాస్వామిమతముయొక్క ద్వితీయపూజ్యసద్గురువైరి. భక్త వారిని "హుజూర్ మహరాజ్" అను నామముచే సంబోధించెడివారు. క్రీ. శ. 1878 సం॥రము మొదలు 1898 సం॥రము డిశంబరు నెలవఱకు స గమును సాగించిరి. వారి యనంతర మీసేవ పరమగురు మహరాజ్ సాహ వారి కొప్పజెప్పబడెను. వారు 28-3-1861 తేదీన వారణాశిలో నొక సు బ్రాహ్మణకుటుంబమున జన్మించిరి. వారికి తల్లిదండ్రులిడిన నామము బ్ర శంకరమిశ్రగారు. వారు యమ్. ఎ. వఱకు చదువుకొని పిమ్మట 1885 సం॥ నవంబరు నెలలో పరమగురు హుజూర్ మహరాజువారి చరణశరణ్యము రించిరి. వారు హుజూర్ మహరాజువారు గుప్తమైనది మొదలు 1907 సం॥ అక్టోబరు నెలవఱకును సత్సంగము జరిపించు మహానుగ్రహము చేసిరి. యనంతరము సర్కార్ సాహబ్ వారు నాల్గవసద్గురువుగా విరాజిల్లిరి. సత్సంగమును కొంతకాలము ఘాజీపురములోను మిగత కాలము ము జిల్లా శాహాబాదులోను, మసూరీపర్వతము వగైరా స్థలములలోను సం॥రము డిసెంబరు నెలవఱకు జరిపించిరి.

గురించియు దాని విస్తృతినిగురించియు వర్ణించి యే చైతన్యమండలమునందు ప్రవేశించినచో పరమార్థాదర్శము సిద్ధించగలదో అట్టి మండల మీసృష్టిలో నెచ్చటగలదు అనువిషయము విశదపఱచబడినది. నాల్గవభాగములో తాను చేయుకర్మలమూలమునను, ప్రాపంచికజీవుల సహవాసము మూలమునను జీవుని పైగలిగెడిప్రభావమును వర్ణించి పారమార్థికాదర్శమును సులభముగ సాధించు కొనగల్గుటకై సాధకుడెట్టిప్రవర్తన నవలంబించి యెట్టిసహవాసముచేయవలయు ననువిషయమును విశదీకరింపనుద్దేశించిరి.

ప్రథమభాగము ప్రారంభములో, సహజముగ నవలంబించవలసిన పద్ధతి ననుసరించి, మొదట పరమార్థముయొక్క యుద్దేశ్యమును విమర్శచేయుచు సకలప్రాణులు చేయు కృత్యములన్నిటికిని సుఖప్రాప్తి దుఃఖనివృత్తులవాంఛయే అంతర్గతకారణమని స్థిరపఱచి, ఆనిర్ధారణ నాధారముగాతీసికొని దుఃఖసంక్షోభము లెంతమాత్రము లేనట్టి సంపూర్ణానందముతోకూడినగతి నొందుటయే పరమార్థోద్దేశ్యమని నిర్ణయముచేసిరి. అటుపిమ్మట సుఖదుఃఖములస్వరూపమును వైజ్ఞానికశాస్త్రరీతి ననుసరించి నిర్ధారణచేసి, శరీరమనస్సులు నామమాత్రమున కైనను లేకుండా కేవలము చైతన్యశక్తియొక్క నిర్మలతత్త్వమొక్కటే ప్రకాశించునట్టి పరిస్థితిలోనే అట్టిగతిని పొందుట సాధ్యముకాగలదని విశదీకరించిరి. ఈపర్యవసానము తెలిసినపిదప నాపరమానందమయావస్థ సాధ్యమైనవిషయమేనా, అయ్యెనచో నీసృష్టిలో నట్టిస్థాన మెచ్చటనైనయున్నదా యను ప్రశ్నలు సహజముగ పొడముటచే, అందుచే ప్రకృతిశక్తులు పనిచేయుపద్ధతులను దృష్టాంతముగ దీసికొని, అన్నిటికిని ఆదిమైన పరమశక్తియగు చైతన్యశక్తికిగూడ నొకనిజ భండారముండునదనియు, నదియే పరమపురుషునిధామమని పేర్కొనబడుచున్న దనియు, నచ్చట చైతన్యశక్తియొక్క నిజలక్షణములు సంపూర్ణరూపమున ప్రకటితమైయుండును కావున నచ్చట పరమశక్తి, పరమానంద, పరమసుఖముల రాజ్యము ఒప్పారుచుండుననియు, నచ్చట మార్పు, నాశము, క్షీణత్వములు పేరునకైనను లేకుండవనియు విశదీకరించి పరమార్థముయొక్కఆదర్శ మట్టి ధామము నందు ప్రవేశించిననే లభ్యముకాగలదని నిరూపించిరి. చైతన్యశక్తియొక్క భండార మొకటియున్నట్లు నిరూపించినపిమ్మట, నీసృష్టిలో అట్టిభండార మెచ్చట నున్నదో తెలిసికొనుట యావశ్యకమైయున్నది. ఏలనన నీవిషయము తెలియనిచో నచ్చట ప్రవేశముపొందుటకు కెట్టిమార్గమును ప్రయత్నమును అవలంబించవలసియుండునో నిర్ణయించుట శక్యముకాదు. ఈసమస్యను పరిష్కరించు

టకై యీసృష్టినంతను చర్మేంద్రియముల సహాయముతోను, విజ్ఞానశాస్త్రజ్ఞులచే నిర్మించబడిన యంత్రములసహాయముతోను అన్వేషణచేయపూనుకొనుట నిరుపయోగము. సూర్యునివిషయమై తెలిసికొనుటకై సూర్యకిరణములను పరిశీలించుట యెట్లవసరమో అట్లే యీసృష్టిరహస్యమును తెలిసికొనవలయునన్నచో చైతన్యభాండారమునుండివచ్చిన కిరణరూపమైన యాత్మాంశయొక్క పరిస్థితిని బరిశీలించవలసియున్నది. కావున ఆత్మాంశచే నిర్మించబడిన మానవ శరీరమును దృష్టాంతముగదీసికొని ఈ శరీరములో స్థూలశరీరమునకు పైన మనస్సును, మనస్సునకుపైన ఆత్మవస్తువును యెట్లున్నవో అటులనే యీ సృష్టిలో మలినమాయా దేశమునకుపైన బ్రహ్మాండిమనస్సుయొక్క దేశమును, దానిపైన నిర్మలచైతన్యదేశమును ఉన్నవనియు మానవశరీరమునందు ఆజ్ఞాచక్రమెట్లు మనుష్యునియాత్మకు నివాసస్థానమో, అటులనే నిర్మలచైతన్య దేశముయొక్క ఆజ్ఞాస్థానము సమస్తసృష్టికిని పరమాత్మయైన చైతన్యభాండారముయొక్క నిజధామమనియు నిరూపించబడినది. చైతన్యభాండారము ఈ సృష్టిలో నెచ్చోటనున్నదో గోచరమయినపిదప మానవుడీశరీరములో నుండుచు ఆ చైతన్యభాండారముతో సంబంధమెట్లేర్పఱచుకొనగలడను ప్రశ్న పొడముచున్నది. ఈప్రశ్నకు సమాధానముగ, మానవుని మెదడులో కొన్ని రంధ్రములున్నవనియు నారంధ్రములలోని గుప్తశక్తులనుపయోగించుటచే, నేత్ర రంధ్రములద్వారా సూర్యునితో సంబంధమేర్పఱచుకొన్న విధముననే, యీ యఖండసృష్టిలోని సమస్తస్థానములతో సంబంధమేర్పఱచుకొన సాధ్యమగునని వివరించబడినది.

ప్రథమభాగములో, సూక్ష్మజగత్తని పేర్కొనబడిన యీమానవ శరీరము సకలసృష్టికిని అనగా అఖండజగత్తునకు కొలనమూనాయనియు, నీరెండింటికిని మానవశరీరములోని రంధ్రములద్వారా సంబంధమేర్పడియున్నదనియు తెలియజెప్పి, పిమ్మట జీవుని నివాసస్థానము ప్రస్తుత మేస్థానముననున్నది సదాస్థాయియైన పరమానందముయొక్క స్థానమెచ్చోటనున్నది అనువిషయములను వివరించిరి. ద్వితీయభాగములో - క్రమప్రకారము చేయవలసినవిధము ననుసరించి - జీవుని మేల్కొలిపి మధ్యమండలములను దాటించి నిర్మలచైతన్య ధామమునం దారోహణము జేయుటకవసరమైన మూడు అభ్యాససాధనలను వర్ణించిరి. 55 వ ప్రసంగమును చదివినచో నాంతర్యసాధనల నభ్యాసముచేయుటకు సమకాలికసద్గురుని శరణ్యము ముఖ్యావసరమని తేటపడగలదు. ఏలనన,

సాధకుడు తనకుబొత్తిగ తెలియని యాంతర్యస్థానములయందు, ఆయభ్యాస ప్రక్రియలను జరిపించవలసియుండుటచే నాస్థానములను మేల్కొల్పుటకై సద్గురువుయొక్క యాంతర్యసహాయ మడుగడుగునకు నవసరమై యున్నది. ఇంతియు గాక ప్రతిమానవుని హృదయమునను, అసంఖ్యాకలోపములు, దోషములు నంతర్గతమైయుండి అవి మాటిమాటికి నతనిమీద తమప్రభావముచూపి యతనిని కేవలము నిరుత్సాహపరచుటయేగాక యుపమార్గమునగూడ గొనిపో వుచుండును. సమకాలికసద్గురుని సత్సంగములోనుండుటచే నీ దోషలోపము లన్నియు క్రమక్రమముగనశించి సాధకునిహృదయము నిర్మలమై యతనిచిత్తము నకు కొంతస్థిరత్వము చేకూరును. సమకాలికసద్గురుని యావశ్యకత బోధపడిన మీదట, సద్గురు విశ్వాలమున నుండిరా కేరా, అట్లైనచో వారి నెచ్చట నన్వేషించవలయు ననెడిప్రశ్నలు ప్రతిమానవునికిని స్వాభావికముగా పొడము చుండును. కావున నీభాగములో రాధాస్వామిదయాళుని అవతారమును వారిచ్చటస్థాయిగ నుండిపోవుటనుగుఱించిన యుత్తమసిద్ధాంతములను వివరించి యాసమస్యను పరిష్కరించిరి. 61 వ ప్రసంగమును చదివినయెడల సాధనలు లెక్కకు మూడైనను, వానిఅన్నిటిముఖ్యోద్దేశ్యము ఒక్కటేయనియు, కాని ప్రారంభములో నభ్యాసికి కొంతచిత్తైకాగ్రత గలుగజేసి చైతన్యశబ్దమును శ్రవణముచేయగలయోగ్యత గలిగించునిమిత్తమై యతనిచే చైతన్యనామ స్మరణము, చైతన్య స్వరూపధ్యానము అనెడి ప్రారంభిక సాధనలు రెండును అభ్యాసము చేయించబడుననియు తేటపడగలదు. వాస్తవపరమార్థలాభము సంపూర్ణముగ చేకూరు నిమిత్తము స్మరణచేయవలసిన చైతన్యనామము రాధాస్వామినామమేయని జిజ్ఞాసువుల కెట్టి సందేహమునకు తావులేకుండు నంత స్పష్టముగ వివరించి తృప్తికరమయిన యాంతర్యాభివృద్ధి నిమిత్తము ధ్యానము చేయవలసిన చైతన్య స్వరూపము సద్గురు స్వరూపమేయని గూడ విశదపరచిరి. అభ్యాసియొక్క ప్రాపంచిక పరిస్థితులకును అతని మానసికవాసన లకు,అభిరుచులకును, అతని యభ్యాసముమీద నధికప్రభావముండును కాబట్టియు జీవుల ప్రాపంచిక పరిస్థితులు మనోవాసనలు మున్నగువానిమీద సృష్టినియ మముల ప్రభావము చాల యధికముగనుండును కావునను, మూడవ భాగ ములో సృష్టిలోని రచనాక్రమమును గుఱించియు, దాని మహోద్దేశ్యమును గుఱించియు, నందలి వ్యవస్థను గుఱించియు సృష్టియొక్క అవిచలనియమము లను గుఱించియు విపులముగ వివరించిరి.

కాని సృష్టికి పూర్వముండిన పరిస్థితిని తెలుపకుండగనే, యీ సృష్టి యొక్క ఆవిర్భావవిధమును వర్ణించుట అయుక్తముగానుండును కావున సృష్టిక్రమమును వివరించుటకు ముందు సృష్టికాక ముందెట్టి పరిస్థితి యుండెనో వర్ణించిరి. అటుపైన చైతన్యశక్తి ఋణ ధనాత్మక ధ్రువరూపమున నుండునని తెలియజెప్పి పరమ సర్వేశ్వరుని యొక్కయు, ఆత్మాంశల యొక్కయు, ఆదిదశ యెట్లుండెనో వర్ణించి, పిమ్మట చైతన్యశక్తి ప్రకటమైన విధము బోధపఱచు నిమిత్తమై చుంబకశక్తి లోహపునూదుల నెట్లు చుంబకములుగ మార్చునో ఆ విషయమును సమగ్రముగ వివరించిరి. ఏలనన, చుంబకశక్తి కూడ చైతన్యశక్తివలె నొక ఆకర్షణశక్తియే యగుటచే దాని క్రియావిధానము అవగాహనమైనచో చైతన్యశక్తియొక్క ప్రకటన విధానముగూడ గొంతవఱకవగాహన కాగలదు. ఇంతియగాక చుంబకశక్తిక్షేత్రమందు ఆశక్తిధారలు వ్యాపించుటయు నా క్షేత్రములోని బిందువులు చుంబకమువైపున కాకర్షింపబడుటయు ననెడి ద్వివిధక్రియలమూలమునను చుంబకశక్తి ప్రకటితమైనట్లే చైతన్యశక్తి కూడ సురతధార శబ్దధార యనెడి రెండంగముల ద్వారా ప్రకటమాయెను. ఈ రెండంగములవలననే నిర్మల చైతన్యదేశము యొక్క ఆఱు స్థానములును గూడ ప్రకటమయినవి. నిర్మల చైతన్యదేశము యొక్క షట్స్థానములయుత్పత్తిని గుఱించియు, అచ్చటి నివాసస్థుల దేహముల విషయమును గుఱించియు గూడ వర్ణించి 'కాలుడు' 'ఆద్యా' యనెడి ధారల ప్రకటనమును గుఱించియు బ్రహ్మాండములోని స్థానముల సృష్టిని గుఱించియు సమగ్రముగ వివరించిరి. మఱియు పురుషుడు, ప్రకృతి, బ్రహ్మ, మాయ, నిరంజనుడు, జ్యోతి వగైరాల యుత్పత్తిని గుఱించియు, త్రిగుణములు, పంచతత్త్వములు, 25 ప్రకృతులను గుఱించియు గూడ వర్ణించిరి. బ్రహ్మాండదేశమును గుఱించి వర్ణించిన పిమ్మట పిండదేశము యొక్క సృష్టిని గుఱించియు, నీ దేశము యొక్క సృష్టి నియమములను గుఱించియు వివరించి పునర్జన్మ, ప్రళయ, మహాప్రళయములకు సంబంధించిన విషయములను తెలియజెప్పి మానవశరీరముయొక్క మహత్త్వమును సంపూర్ణముగ విశదపరచి, బ్రహ్మపురుషుడు, పరమపురుషుడును ఈ శరీరములోనే యవతరించుటకు కారణమును విశదపఱచిరి. చిట్టచివరకు నాలుగు యుగములలోని భిన్నావస్థలను మానవజీవితముయొక్క నాలుగవస్థలతో బోల్చి కలియుగము జీవులకు పెక్కు ఆపత్కష్టములుగల్గించుసమయమేయైనను జగదుద్ధారమనెడి మహోదయను చూపుట కీయుగమునందే సావకాశమున్నదని

బోధించిరి. సామాన్య మానవులు ప్రపంచములోగల అవ్యక్తపరిస్థితులను హెచ్చుతగ్గులను చూచి వానిని సృష్టికర్తయొక్క లోపములుగ నెంచుటకు కారణము వారికి సృష్టికార్యముయొక్క దయామయ మహోద్దేశ్యము అవగాహన చేసికొనగల శక్తి లేకపోవుటయే కాని మరేమియు కాదని వివరపరిచిరి. ఆపైన 123వ ప్రసంగములో నీరచనలో భిన్నత్వపరిస్థితి యెట్లేర్పడినదియు సృష్టిలో ప్రస్తుతమున్నదంతయు కేవలము చైతన్యములో హెచ్చుతగ్గుల తరహాలు వ్యక్తమగుటయే అనియు, అనగా, ఈ సృష్టి రూపము దాల్చినపుడు చైతన్యములో నంతకుముందు లేనట్టి అనేకమైన తరహాలు వెవ్వేరుగ నేర్పడినవేకాని, మరొక క్రొత్త విషయమెద్దియు ప్రకటముకాలేదనియు సత్యమ వైజ్ఞానికశాస్త్ర పద్ధతిని నిరూపించిరి. పిమ్మట 124వ ప్రసంగములో ఈసృష్టిలో నంతర్గతముగనున్న దయాభరితమహోద్దేశ్యము నతిమనోహరరూపమున వర్ణించిరి.

ఈ భూమిక ప్రారంభములో జెప్పినట్లు ఈ గ్రంథము యొక్క చతుర్థ భాగము అసంపూర్ణముగ నుండిపోయెను. ఆ భాగములో 4 ప్రసంగములు మాత్రమే గలవు. మన మనోఆకాశముపైన పడిన సంస్కారములు స్థాయిగ నుండి తిరిగి తిరిగి ప్రకటమగుచు మనచే కర్మలను చేయించుచుండునని మాత్రమే యీ నాల్గు ప్రసంగములలో వర్ణించబడినది.

పరమగురు మహారాజ్ సాహబ్ వారు "డిస్కోర్సెస్" గ్రంథముగాక 3,4 శబ్దములను (అనగా కవిత్వములను) హిందీభాషలో రచించిరి. "డిస్కోర్సెస్" గ్రంథముతో నా శబ్దముల కెట్టిసంబంధము లేకపోయినను, వాని నీయనువాదము చివర అనుబంధ రూపమున భక్తజనుల లాభార్థమై ముద్రింపించితిమి.

దయాల్బాగ్
1-6-1924

ఆ. స్వా.

రాధాస్వామి దయాల్ కీ దయా

రాధాస్వామి సహాయ్

# అమృత బచన్

## ( తెనుఁగు తర్జుమా )

## ప్రథమ భాగము

<u>సత్యపరమార్థము, దానియుద్దేశ్యము, ఆయుద్దేశ్యసిద్ధి కవసరమైన పరిస్థితులును— ఈ విషయముల వివరణము.</u>

<u>1. పరమార్థ విషయములను విమర్శించు సందర్భములో విజ్ఞానశాస్త్ర పద్ధతుల నవలంబించుట ఆవశ్యకము.</u>

ప్రస్తుతకాలపు పెద్దపెద్ద మేధావులకు, అందులో ప్రధానముగ వైజ్ఞానిక శాస్త్రాభిమానులకు, పరమార్థమును గురించి శ్రద్ధ చాల తక్కువగా యుండుట మనము చూచుచున్నాము. నిజమునకు వీరు ప్రపంచములోని వివిధవస్తువులు, విద్యలు, పనుల విషయములో శ్రద్ధ వహించి నవీనావిష్కరణములుచేసి జీవులకు క్రొత్త క్రొత్త సుఖసామగ్రి నెట్లు అందజేయుచున్నారో, అట్లే పరమార్థ విషయములోగూడ వీరు శ్రద్ధవహించి క్రొత్త క్రొత్త గూఢరహస్యములను కనిపెట్టి ఉత్తమసుఖము ను జీవులందఱకును లభింపజేయు రాజమార్గము నుద్ఘాటించవలసి యున్నది. కాని పైన చెప్పినట్లు, పరిస్థితులు ఇందుకు పూర్తిగ ప్రతికూలముగ నున్నవి. దీనికి కారణమేమి? ఇందుకు కారణము పారమార్థిక విషయములన్నియు నుత్సాహావేశములతోను, నిగూఢరహస్యవిషయములు నిగూఢసూచనలతోను, అంధవిశ్వాస విషయములతోను నిండియుండుటయు, పారమార్థికవిషయములను విమర్శించుటలో ప్రస్తుతకాలపు వైజ్ఞానిక విమర్శలకు ప్రాణభూతమైన ప్రయోగాత్మక పరిశీలనగాని యథార్థవిచారణవిమర్శలుగాని లేకపోవుటయే. విద్యావిజ్ఞానముగలవారి మనస్సునకు పరమార్థవిషయములో గూడ, ఇతర విషయముల సందర్భములో నెట్టి విమర్శవిచారణ పద్ధతులుపయోగించబడుచున్నవో, అట్టి పద్ధతులే అవలంబించవలయునని సహజముగా ఉండును. అట్లు చేయుట కేర్పాట్లేమియు లేకుండుటయే పరమార్థ

విషయములో వీరు అంత యెక్కువ అశ్రద్ధ చూపుటకు కారణము. ఈ లోపమును తొలగించు నిమిత్తమై, అనగా పరమార్థ విషయములోగూడ నవీన నిర్ణయవిమర్శల పద్ధతియొక్క స్వారస్యమును పుట్టించవలెనన్నచో పరమార్థ విమర్శను ప్రస్తుతకాలపు వైజ్ఞానిక శాస్త్రరీతినే జరిపించుట యావశ్యకము. అనగా మొట్టమొదట పరమార్థముయొక్క ఉద్దేశ్యమును విస్పష్టముగ వివరించి పిమ్మట నాయుద్దేశ్యము సిద్ధించుటకై అభ్యసించవలసిన, యుక్తమైన సాధనలను నిర్ణయించవలసియుండును. అందుచే మేమీ గ్రంథములో పారమార్థిక సిద్ధాంతములను, సాధనలను, విజ్ఞానశాస్త్ర పద్ధతిని ప్రతివిషయమును విమర్శించగా నిలబడినవానినే వివరించుచున్నాము.

## 2. పరమార్థము యొక్క యుద్దేశ్యవివరణము.

కొంచెము శ్రద్ధగా ఆలోచించిచూచినచో, ఈ ప్రపంచమునగల ప్రతి ప్రాణిమాత్రుని కృత్యములకును, సంకల్పములకును మూలకారణము ఏదో యొక సుఖమును పొందవలెనని గాని, లేదా, ఒకానొక దుఃఖము నుండి తప్పించుకొనవలెననిగాని కోరికయే అయియుండుచున్నదని తెలియగలదు. ఇంతియగాక మనలో తలవని తలంపుగ జనించు సంకల్పములకును, మనచే నెట్టిపూర్వాలోచన లేకుండగనే చేయబడుకృత్యములకునుగూడ పైన జెప్పిన వాసన యేలేశ మాత్రమో కొంతవరకు తప్పక అంతర్గతమై యుండుచున్నది. కావుననే మనము స్వలాభసుఖములను గలిగించు పరిస్థితులవిషయములో నంగీకార సహకారములను అనగా ఆనుకూల్యమును, తద్విరుద్ధ పరిస్థితులలో ఆటంకమును ప్రాతికూల్యమును ప్రకటించుచుందుము. ఉదాహరణార్థము మనము తినునాహారములోని శరీరపోషకపదార్థములు మనకు తెలియకనే తమంతట తాము జీర్ణమై మనశరీరములో కలసిపోవుచున్నవి. అట్లుగాక మన మేదైన హానికరపదార్థమును లోనికి తీసికొన్నచో శరీరభాగములన్నియు దానిని వెలువరించు ప్రయత్నము చేయుచుండును. సుఖము, దుఃఖము అను పదములు ఈప్రసంగములోను, ఈగ్రంథములో ఇకముందునుగూడ అతి విశాలార్థములో ప్రయోగించబడును. ఎట్లన సుఖమనగా మనము ఏదైన పని చేసినపుడు, ఆపని వలన మనకు వెంటనే సుఖము కలుగవలసినదని కాని లేదా ప్రత్యేకముగా మనకొక్కరికే సుఖదాయకముగ నుండవలెనని గాని, యర్థము కాదు. ఉదాహరణార్థము ఒకమనుష్యుడు లోహపు మేకులమీద పరుండినపుడు గాని, మండుటెండకాలములో భూమిని దున్నుచుండినపుడుకాని వానికి

తత్కాలమున సుఖమేమిగలుగుచున్నదనుప్రశ్న పొడమును. మేకులమీద పరుండినను, యెండలో భూమి మున్నుచున్నప్పుడును, తత్కాలమున నెవ్విధమైన సుఖము నుండదనుటలో సందియము లేదు. కాని యీ రెండు వనులలోను అంతర్గతముగా సుఖమును పొందవలెననెడి వాసన తప్పకుండా యున్నది. మేకులమీద పరుండినమనిషి తాను వడుచున్నబాధ లోకులు చూచి జాలిపడి ధనమిచ్చెదరనియు, నట్టి ద్రవ్యముతో తన ఇచ్ఛ వచ్చినట్లు సుఖపడగలననియు ఆశించుచుండును. పొలములలో పాటుపడునట్టి పై రెండవ యుదాహరణలో చెప్పిన మానవుడు తానింకొక 5,6 మాసముల పిదప పంటవచ్చినపుడాయాదాయముతో పూర్తిగ సుఖపడవచ్చునని యోచించుచుండును. కావున సుఖప్రాప్తి దుఃఖనివృత్తులవాసన యనగా తత్క్షణమే కలుగునట్టిగాని, లేక స్వయముగ తన కొఱకే కలుగునట్టిగాని సుఖదుఃఖములను గుఱించిన వాంఛయొక్కటే యని మా యభిప్రాయము కాదు. భూతభావికాలములలో నెప్పుడైనగూడ తనకైనను, ఇతరులకైననుగాని గల్గు సుఖదుఃఖములను గుఱించిన వాంఛ గూడ నా వాసనలో జేరియున్నవి. ఇట్టి వాసనయొక్క సంపూర్ణతృప్తి, యెవ్విధమైన దుఃఖముగాని ప్రతికూల పరిస్థితిగాని లేకుండా పరమానందపూరితమైన పరిస్థితి జీవునికి చేకూరినప్పుడే లభించగలదని తేటతెల్లమే. పరమార్థముయొక్క ముఖ్యోద్దేశ్యము మానవుల కట్టి "పరమ అర్థము" సిద్ధించుటయే అని తెలియవగును. చైతన్యశక్తి లేక జీవాత్మయనగ నేమి? నిజమైన సర్వేశ్వరుడు లేక సత్యకర్త యెవరు? సృష్టి యెవ్విధమున చేయబడెను, యెందు నిమిత్తమై చేయబడినది? జీవుడు ఈ ప్రపంచములో ఉండుచున్నప్పుడు చేయవలసిన కర్తవ్యము లెవ్వి? సత్య పరమార్థమును గుఱించి చేయు విమర్శసందర్భములో ఈ పై విషయములను కూడ విమర్శించుట యావశ్యకము.

## 3. సుఖదుఃఖముల వివరణము

పరమార్థముయొక్క ప్రధానోద్దేశ్యము, పరమానందప్రాప్తియు సకల విధదుఃఖములనుండి సంపూర్ణనివృత్తియునని తెలిసినపుడు సుఖదుఃఖావస్థలను సమగ్రముగ పరిశీలనచేయుట యత్యావసరమగుచున్నది. ఏలననగా, అట్లు చేయునిచో సుఖదుఃఖముల యథార్థతత్త్వమే మనకు బోధపడనందున పరమార్థము సిద్ధించుటకై యెట్టి సాధనల నభ్యసించవలసియుండునో నిర్ణయించుటకూడ సాధ్యము కాదు.

*

## 4. జీవచైతన్యము, అనగా, జ్ఞానేంద్రియధార

జీవునికి సుఖదుఃఖములయనుభవము ముఖ్యముగా జాగ్రదవస్థయందే కలుగుచున్నదని మనము ప్రతిదినము చూచుచున్నాము. జీవుడు స్వప్నావస్థలోను, సుషుప్తి లేక సమాధ్యవస్థలోను ప్రవేశించినపుడును, క్లోరోఫారమ్ (Chloroform) అను మత్తుమందు వాసన చూచియందున స్మృతితప్పిపోయినపుడును, అతనికి సుఖదుఃఖముల జ్ఞాన మేయుండుటలేదు. దీనిని బట్టి మనము జాగ్రదవస్థ నుండి స్వప్నసుషుప్తులు మొదలగు నవస్థలలోనికి మాఱినపుడు ఒకానొకకళ మనలో ముకుళితమైపోవుచున్నట్లు, లేక, క్రియావిహీనమైపోవుచున్నట్లును, ఆకళయే జీవునకు సుఖదుఃఖానుభవముకలిగించుటకు ప్రధానకారణమగుచున్నట్లును స్పష్టపడుచున్నది. ఈ కళనే విద్యావంతులు "జ్ఞానేంద్రియధార" (Sensory current) లేక "జీవ చైతన్యము" అని పేర్కొనిరి ఈ ధారయొక్క ఉనికి సహకారములతోనే సుఖ దుఃఖముల అనుభవము కల్గుచున్నదని తెలినపుడు, సుఖ దుఃఖావస్థల రహస్యము బోధపఱచుకొనగోరినచో, మును ముందు, ఈ ధారయొక్క యథార్థతత్త్వమును దాని ప్రకటనవిధమును అవగాహనచేసికొనుట యావశ్యకము అని స్థిరపడుచున్నది. ఎట్లనగా నిప్పు, యెప్పుడును గాలి యుండినచో మండుచుండునుకదా. కావున నిప్పుమండుటలోని రహస్యమును దెలిసికొనగోరువారు వాయువుయొక్క యథార్థతత్త్వమును, అనగా దాని స్వరూపము నవగాహన చేసికొనవలసియుండును. వాయువు ఏవిధముగ నేర్పడెనో, యే గాసెస్ (gases) కలయిక వలన నేర్పడెనో, తెలిసిననాడే నిప్పు యేల మండుచున్నదో బోధపడగలము.

మేమిచ్చట జీవచైతన్యధారయొక్క వాస్తవస్వరూపమును తెలియజేసి, దాని విషయములో జనులలోగల యపభ్రమలను నివరించునిమిత్తమై ఒక సామాన్యానుభవవిషయము నుదహరించెదము. దానిని బట్టి తేలెడి పర్యవసానము జాగ్రత్తగ గమనించవలసియున్నది. ఒక మనిషి గణితశాస్త్రములోనేదో కఠినప్రశ్నకు సమాధాన మాలోచించుచుండె ననుకొనుడు. అతడు అట్లు ఆలోచించుచుండగా కొన్ని గంటలకాలము వెళ్ళిపోయి గడియారము గంటలు కొట్టుచుండినను అతనికి ఆగంటలధ్వని వినపడనే వినపడదు. అతనికి అట్లు తెలియకుండుటకు కారణమేమి ? కారణమేమనగా అతని శ్రద్ధ లేక చిత్త

వృత్తి ఆ ప్రశ్నకు సమాధానము కనుగొనుటలోనే పూర్తిగా మగ్నమైపోవుటచే నది మిగిలిన విషయములన్నిటినుండియు ముకుళితమైపోయెను. అట్లతని శ్రద్ధ అనగా చిత్తవృత్తి నలువైపులనుండి ముకుళితమైపోవుటచే నతనికి ఇతర విషయముల జ్ఞానము కలుగలేదు. అతని శ్రద్ధ ఆ ప్రశ్నపరిష్కారములో నేకాగ్రతతో లగ్నముకాకుండినయెడల అతనికి పరిసరవిషయములు చాల వఱకు తప్పకుండ గోచరమైయుండెడివి. అనగా మనశ్రద్ధ పూర్తిగ నేదోయొకవైపున లగ్నమైయున్నప్పుడు దాని కాదిక్కునతప్ప మఱియొకవైపుననున్న విషయముల జ్ఞానమెంతమాత్రము ఉండనేరదు. అది అట్లేకాగ్రతతో నేదేనియొక విషయముమీద లగ్నము కానిచో చుట్టుప్రక్కల జరుగుచున్న వివిధవిషయములనుగుఱించిన జ్ఞానము దానికి కలుగుచునే యుండును. మా యీ సమాధానమున కాధారభూతమైన మహాసిద్ధాంతమును నియమములను ఇంతవఱకెవఱును చక్కగా పరిశోధనచేసి నిర్ణయించనులేదు, వానిని ఇతరావస్థలమీద నప్పించి పరిశీలించనులేదు, శాస్త్రజ్ఞులెవ్వరునుగూడ ఆనియమములను, సిద్ధాంతమును ఆధారముచేసికొని మఱియొక నియమములను వేనిని గూడ స్థాపించనులేదు. అయినను ఇంద్రియములకు జ్ఞానము ఎప్పుడును శ్రద్ధారూపముననే కలుగుచున్నదను విషయము, అనగా, మన కింద్రియజ్ఞానము ఏమాత్రము కలిగినను అదంతయు మన శ్రద్ధ ఏకాగ్రమగుటమూలముననే లభించుచున్నదనియు, నాశ్రద్ధ యెక్కువ తక్కువలను బట్టి మనకా యింద్రియజ్ఞానములో నాధిక్యన్యూనతలు కలుగుచున్నవనియు, మన చిత్తవృత్తి పూర్తిగ ముకుళితమైపోయినపుడింద్రియజ్ఞానముకూడ పూర్తిగ శూన్యమైపోవుననియు తప్పక తేటపడుచున్నది. చిత్తైకాగ్రతయొక్క అనగా శ్రద్ధయొక్క న్యూనతాధిక్యములలో తరహాలు అనంతముగనుండుటచే మనకు గలిగెడి యింద్రియజ్ఞానముయొక్క తైక్ష్ణ్యమాంద్యములలోగూడ అనంతమైన తరగతులున్నవి. పైన జెప్పిన నియమ మొక ప్రత్యేకేంద్రియముద్వారా లభించు జ్ఞానమునకేగాక సకలవిధములైన ఇంద్రియజ్ఞానములకును వర్తించును. అనగా పంచజ్ఞానేంద్రియములద్వారా గలిగెడి ప్రతిజ్ఞానము శ్రద్ధద్వారానే మనకు కలుగుచున్నది. ఇంద్రియజ్ఞానము స్థూలదృష్ట్యా రెండు విధములుగ నున్నది. అందు ఒకటి సుఖమునకు రెండవది దుఃఖమునకును సంబంధించినదై యున్నది. ఇంద్రియజ్ఞానమంతయు మనకెట్లులభించుచున్నదో, శ్రద్ధలో హెచ్చుతగ్గులను బట్టి ఇంద్రియ జ్ఞానములో నెట్లు హెచ్చుతగ్గులు కలుగుచున్నవో, ఇంద్రియ జ్ఞానము స్థూలదృష్ట్యా ఎన్నివిధములుగ నున్నదో అను నీ విషయములన్నియు వివరించిన పిమ్మట సుఖదుఃఖముల

యథార్థతత్త్వము అనగా వాని ముఖ్యలక్షణములు సంపూర్ణముగ అవగాహన చేసికొనుట సులభముకాగలదు. కావున దుఃఖము యొక్క నిజతత్త్వమును గుఱించి వర్ణించబోవుచున్నాము.

## ౫. దుఃఖము యొక్క నిర్వచనము

దుఃఖములు ద్వివిధములు : శరీరమునకు సంబంధించినవి, మనస్సునకు సంబంధించినవియును. ముందు శారీరకదుఃఖముయొక్క స్వరూపమును పరిశీలించునిమిత్తమై శరీరదుఃఖముయొక్క దృష్టాంతమొకదానిని తీసికొందము. ఒక మనిషికి జాగ్రదవస్థయందుండగా, శరీరమున కొక కత్తిపేటుగాని, మఱొక విధమైన దెబ్బగాని తగిలినదనుకొనుడు. అందుచే నతని శరీరమున నొకభాగము చితికిపోవుటయో లేక తెగి వేఱైపోవుటయో తటస్థించి, ఆ భాగములో జ్ఞానేంద్రియధార ప్రవహించుటకు సాధనములైన నరములు (Conductors of sensory current) గాయపడిపోవును, లేదా, తెగిపోవును. బాగుగ నాలోచించినచో నతని నరములు తెగుటచే లేక దెబ్బతినుటచే నతనిశరీరములో వ్యాపించి యున్న జ్ఞానేంద్రియధార కొంతభాగము, విచ్ఛిన్నమైపోయినట్టిగాని లేదా దెబ్బతిన్నట్టిగాని శరీరభాగము నుండి, బలాత్కారముగా బహిష్కరింపబడి, చుట్టుప్రక్కల వ్యాపించియున్న జ్ఞానేంద్రియధార లీబలాత్కృత బహిష్కరణము లేక ముకుళీభావము యొక్క వృత్తాంతమును జ్ఞాతకు (అనగా జీవునికి = Sentient entity) అందజేయుగా అతనికి శారీరికదుఃఖానుభవము కలుగుచున్నదని మనకు తేటపడగలదు. హిప్నాటిజమ్ (Hypnotism) ప్రయోగించుట మూలమునగాని, లేదా క్లోరోఫారమ్ (Chloroform) అను మత్తుమందు వాసన చూపించికాని, యెవనికైనను జ్ఞానేంద్రియధారను పనిచెయ్యకుండ కట్టిపెట్టినచో, అతనికి శరీరస్మృతి తప్పిపోవును, అనగా అతని శ్రద్ధాధార శరీరము నుండి సంపూర్ణముగా ముడుచుకొనిపోవును. అందుచే ఆ సమయములో అతని జీవునకు, గాయము తగిలినట్టి వార్తయే చేరదు, దుఃఖానుభవము యొక్క జ్ఞానము కూడా యెంతమాత్రము కలుగనేరదు.

మానసిక దుఃఖము యొక్క జ్ఞానము కూడా జీవునకు ఇదే విధముగ జ్ఞానేంద్రియధార ద్వారానే కలుగుచున్నది. అయితే ఈ సందర్భములో దెబ్బ నరములకు బదులుగా మానసిక బంధనములకు తగులుచున్నది. కాని

యీబంధనములకు దెబ్బతగిలినపుడు, శారీరకదుఃఖజ్ఞానమువలెనే మానసిక దుఃఖానుభవము గూడ జ్ఞానేంద్రియధారద్వారానే గలుగుచున్నది.

జాగ్రదవస్థలో జ్ఞానేంద్రియ ధార శ్రద్ధారూపమున వ్యక్తమై సుఖదుఃఖముల అనుభవము యొక్క జ్ఞానమును కలుగజేయునని యిదివరలో చెప్పియుంటిమి. స్వప్నావస్థలో దృశ్యములు అతిత్వరితముగ మాఱిపోవుచు నొక్క క్షణకాలములో ననేకదృశ్యములు కన్పట్టుచుండును. అట్టి స్వప్నావస్థలో గలిగెడి యనుభవములుగూడ శ్రద్ధయొక్క కృత్యమే. ఏలనన, నా సమయమున మానవుని శ్రద్ధ యాతని మెదడునకు అత్తుకొనియున్న వివిధసంస్కారముల వైపున కభిముఖమగుటమూలముననే స్వప్నమం దావిషయముల యనుభవము గలుగుచున్నది. అప్పుడప్పుడు నిద్రలోనున్న మనిషియొక్క శ్రద్ధ బయటి శబ్దములు మొదలగువాని ప్రభావము వలన హఠాత్తుగ మఱల్చబడి క్రొత్త విధమైనట్టి స్వప్నములును ఒక్కొకపుడు అతి భీకరములు, విచిత్రములును అయినట్టి స్వప్నములును కానవచ్చుచుండును.

కాబట్టి జాగ్రత్స్వప్నావస్థల యనుభవములను జాగ్రత్తగ పరిశీలించిన యెడల శ్రద్ధాసహాయములేనిదే మనస్సునకెట్టి జ్ఞానము కలుగనేరదని నిస్సందేహముగ సిద్ధము కాగలదు. శారీరకదుఃఖమువిషయములో ఆ జ్ఞానమును జ్ఞాతకందిచ్చునవి నరములును, మనోబంధనములకు దెబ్బ తగులుటచే కలుగు మానసిక దుఃఖము విషయములో ఆ జ్ఞానము నందజేయునవి మన యాలోచనలును. (మనకు ఇంద్రియముల ద్వారా గలిగెడి పదార్థజ్ఞానము మన మెదడులో సంస్కారములు లేక ఛాయలరూపమున ప్రవేశించును. ఈ సంస్కారములు లేక ఛాయలకు సంబంధించి, మన చిత్తవృత్తి అనగా శ్రద్ధ ధరించిన రూపములనే ఆలోచనలు లేక ఊహలు అని చెప్పుదురు.) శారీరిక దుఃఖ వ్యాప్తి తీగెద్వారా పంపబడు వార్తాప్రసరణమువంటిదియును, మానసికదుఃఖవ్యాప్తి తీగె లేకనే వార్తను ప్రసరించు క్రియవంటిదియును అని చెప్పుట అయుక్తముకాదు. మనమనస్సునకు ఏదైన నొక బాధ గల్గినపుడు గాని దెబ్బతగిలినపుడుగాని, మన మెక్కువ ఆశపెట్టుకొన్న కార్యము ఏదైన పూర్తికాకపోవుటయో, లేక మనకు సంబంధించిన పదార్థముతోగాని వ్యక్తితోగాని వియోగము గలుగుటయో, లేక నట్టి వ్యక్తికిగాని పదార్థమునకుగాని హాని నష్టములు సంభవించుటయో అవశ్యము జరుగుచుండును. ఈ పరిస్థితులన్నిటిలోను మన మానసిక

బంధనమునకు బలాత్కారమైన విచ్ఛిత్తి గలుగుటయో దెబ్బ తగులుటయో జరిగి, అందు మూలమున మన శ్రద్ధాధార తన మామూలు ప్రవాహ మార్గము నుండి బలాత్కారముగ బహిష్కరింపబడిపోవును, అనగా తప్పించివేయబడును. మనోఘట్టమున నవ్విధముగ శ్రద్ధాధారకు గల్గిన బలాత్కారమైన బహిష్కరణముచే అనగా త్రోపుడుచే గలిగెడి అనుభవమే మానసిక దుఃఖము.

శారీరకమానసికదుఃఖములు రెండింటివిషయములోను శ్రద్ధ లేక చిత్తవృత్తియొక్క బలాత్కారబహిష్కరణమే ప్రధానకారణమని తెలిసినది కావున, దుఃఖము నీక్రిందివిధముగ నిర్వచించవచ్చును:- శరీరఘట్టము, లేక మనోఘట్టమునుండి జ్ఞానేంద్రియధారలు బలాత్కారముగా బహిష్కరింపబడినను, లేదా ముకుళితమైపోయినను, ఆ జ్ఞానేంద్రియధారయొక్క బహిష్కరణమును గుఱించి కాని, ముకుళీభావమునుగుఱించికాని జీవునికి కలుగునట్టి జ్ఞానమే దుఃఖ మని చెప్పబడును.

## సుఖముయొక్క నిర్వచనము

సుఖమనునది దుఃఖావస్థకు ప్రతికూలావస్థయని అందఱికును తెలిసిన విషయమే. కావున దుఃఖావస్థలో జ్ఞానేంద్రియధారలకు బలాత్కారమైన సంకోచనముజరిగినపుడు, సుఖానుభవములో అట్టిసంకోచనమునకుబదులు జ్ఞానేంద్రియధారయొక్క ఏకత్రీకరణము లేక కేంద్రీకరణము గలుగుచుండవలె నని చెప్పుట యయుక్తముకానేరదు. ఈయభిప్రాయ మెంతవఱకు సమంజసమో తెలిసికొనుటకై సుఖముయొక్క ఒకటిరెండు ఉదాహరణలను తీసికొని పరిశీలించుదము.

ఏదైననొకచోట నతిమనోహర సంగీతవాద్యములు జరుగుచున్న వనుకొనుడు. అచ్చటనున్నసభాసదులందఱు నా గానానందములో మగ్నతచెంది మైమఱచియుండి రనుకొనుడు. ఆసమయమున వారిలో నొకరికి, తనదగ్గరచుట్ట మునకో స్నేహితునకో హఠాత్తుగ నేదోజబ్బుచేసినట్లు కబురువచ్చినను, లేదా అతనికి చిత్తవిభ్రాంతిగలుగ జేయు అసాధారణసంఘటన యేదేని జరిగినను అతనికా గానములోగల యానందమంతయు నొక్కసారిగ మాయమైపోవును. ఇంతియగాక, ఆవార్తవిన్న వెంటనే, దానికితగినచర్య తీసికొనుట కతనికి వీలుపడనచో, నంతకుపూర్వసేపటిక్రితమే తనకత్యానందదాయకమైన యాగానమ్మే

అతనికి మహాదుఃఖదాయకముగ పరిణమించును. సుఖావస్థలో నెల్లప్పుడును శ్రద్ధ యేకాగ్రతవగుటచేతనే సుఖానుభవముగలుగుచున్నదని విస్పష్టముగ తెలుపుటకై ఇట్టిదృష్టాంతములను ఇంకనెన్నిటినో ఉదహరించవచ్చును. ఇటులనే మఱియొకదృష్టాంతమునుగూడ పరిశీలించిచూడుడు. పసిపిల్లలమనస్సు, వారలనుభవహీనులును మాయామర్మములు తెలియనివారునగుటచే వయోవృద్ధులమనస్సువలె సాంసారికబంధనములలో నెక్కువగా చిక్కువడక లౌకికహానిలాభములనుగుఱించికూడ యెక్కువచింతవడదు. వారలమనస్సందుచే బహుసామాన్యవిషయములలోగూడ మగ్నమైపోవుచు నిరుపయోగమైన కొయ్యసామానులు, ఆటసామానులతోనే సంతోషపరవశమైపోవుచుండును. దీనినిబట్టి, బాలుల అమాయకసంతుష్టికి పరవశత్వమునకు కారణము కేవలము వారలచిత్తైకాగ్రతయే అని తేటపడుచున్నది. ఇదిగాక చీట్లపేక, పచీసుఆట (గంజఫా) మొదలుచీట్లాట మున్నగునెన్నియో మనోరంజకములైనఆటలలో ప్రత్యేకముగ మనోహరవిషయమెద్దియులేకపోయినను జనులకు, ఆయాటలాడు సమయములో గలిగెడి యేకాగ్రతానుభవమువలననే గొప్పఆనందము కలుగుచున్నది. దీనినిబట్టికూడా సుఖానుభవము శ్రద్ధైకాగ్రతవలననే గలుగుచున్నట్లు నిశ్చితమగుచున్నది. శ్రద్ధ యేకాగ్రతనొందుటచే మానవునకు సామాన్యసుఖ హర్షములేగాక, ఒక్కొకవు డతనికి సహజజ్ఞానము(Intuition)కూడాఉదయించి విచిత్రానుభవములుగూడ గలుగుచుండును. అట్టిపరిస్థితిలో మానవుని యంతరంగమున ననేకనూతనవిషయములు స్ఫురించుచుండును. పైనచెప్పిన సుఖావస్థలదృష్టాంతములవలన, శరీరసంబంధమైనట్టియు మనస్సంబంధమైనట్టియు సుఖములన్నియు శ్రద్ధ యేకాగ్రమగుటమూలముననే గలుగుచున్నవని తేటపడుచున్నది. కాని యీసుఖస్వరూపనిర్ణయమువలనను, 5వ ప్రసంగములో నిర్ణయించిన దుఃఖస్వరూపనిర్ణయమువలనను, జ్ఞానేంద్రియధారలన్నియు నెచ్చటనుండిప్రసరించుచున్నవో ఆభండారము లేక కేంద్రముయొక్క తత్వమును గుణములనుగుఱించి యథార్థజ్ఞానమేమియు గోచరింపజాలదు. ఈవిషయమునుగుఱించి మునుముందు సవిస్తరముగ చర్చించెదము. ప్రస్తుతములో చైతన్యశక్తి అనగా జీవాత్మ సత్ చిత్ ఆనందరూపమనియు, చైతన్యశక్తియొక్క కిరణములే జ్ఞానేంద్రియధారలనియు, స్థూలప్రకృతితోను మనస్సుతోను చైతన్యశక్తిధారకు సంయోగముగలుగుటవలననే ప్రపంచములో సుఖదుఃఖములయనుభవము గలుగుచున్నదనియు మాత్ర మిచ్చట చెప్పిన

సరిపోవును. గతప్రసంగములో దుఃఖమునకు సంక్షేపముగ నిర్వచనము చెప్పినట్లే సుఖమునకుకూడ నిచ్చట నిర్వచనము చెప్పెదము:—

జ్ఞానేంద్రియధారలు శరీరఘట్టముపైనగాని, మనోఘట్టముపైనగాని కేంద్రీకృతమగుటవలన జీవునికి కలిగెడి యనుభవమే ప్రాపంచిక సుఖము.

## 7. పరమానందము

పై 5,6 ప్రసంగములలో నిర్ణయించిన సుఖదుఃఖముల నిర్వచనములను పరిశీలించగా, జీవుని కీశరీరమనస్సులతో సంబంధమున్నంతకాలము ప్రాపంచిక సుఖదుఃఖముల యనుభవము తప్పదని స్పష్టపడగలదు. కావున దుఃఖక్లేశముల యొక్క సంపూర్ణాభావమును పరమానంద ప్రాప్తియు చేకూరుట, శరీర మనస్సులు లేశమాత్రముగూడ లేకుండ చైతన్యశక్తియొక్క నిర్మలతత్త్వము యొక్కటే విరాజిల్లునట్టి యవస్థలో ప్రవేశించినపుడే సాధ్యమగునని తేటపడు చున్నది.

"పరమానంద పరిస్థితి సాధ్యమైన విషయమేనా ? అట్టి పరిస్థితి వాస్తవముగ నున్నదా ? అట్టిది నిజముగ నున్నచో దాని నెవ్విధమున, ననగా, ఏ యుపాయముచే లేక యేసాధన నభ్యసించుటచే పొందుటకు శక్యమగును?" అనెడి యీ ప్రశ్నలకు సరియైన సమాధానములను దెలిసికొనగోరిన యెడల చైతన్యశక్తియొక్క నిజతత్త్వమునుగురించియు, దాని నియమములను గురించియు దెలిసికొనవలసియుండును.

## 8. భౌతికశరీర మనస్సులయొక్క సామాన్య క్రియలను పరిశీలించుటచే చైతన్యశక్తియొక్క తత్త్వము బోధపడనేరదు.

సమస్త జంతువృక్షములకును ప్రాణభూతమైన ఆత్మను లేక జీవుని అనగా చైతన్యశక్తిని శరీరములో నేభాగమందైనను, నియమప్రకారము తలుచు ప్రసరింపజేసినచో నాభాగము బలిష్ఠమగుచుండుట మనము చూచు చున్న విషయమే. ఎట్లనగా ప్రతిదినము పసిబిడ్డలను పాలుపోసి శయ్యయందు పరుండబెట్టగా వారు చాలసేపటి వఱకు తమ చేతులుకాళ్ళు నెగవైచుకొను చుందురు. చేతులు కాళ్ళు నెగవైచుటలో వారు తమ ఆత్మశక్తి నాయవయవ ములలోనికి మాటిమాటికి ప్రసరింపజేయుచుందురు కావున, దానికి పరిణామ

రూపకముగ, వారలకు కాళ్ళ చేతులలో శక్తి చక్కగ వర్ధిల్లును. అట్లుగాక శరీరములోగాని నరములలోగాని యే భాగములోనైనను చైతన్యధార ప్రసరించుట తగ్గిపోయినను లేదా పూర్తిగ కట్టుపడిపోయినను, ఆ శరీర భాగము లేక నరముల భాగము శుష్కించుటయు లేదా చచ్చు అయిపోవుటయు కూడా దెలిసిన విషయమే. ఇవ్విధమున తన శరీరమునకు శక్తినిచ్చుచుండుట ఆత్మయొక్క సహజధర్మమే కాని దానికి మఱొకరు కల్పించిన యస్వాభావిక కార్యముగాని, వెట్టిపనికాని కాదు. ఆత్మ లేక చైతన్యశక్తి యీ ప్రపంచమునకు వచ్చినది మొదలుకొని నిరంతరము నీధర్మమును అనేకరీతులుగా నెఱవేర్చుచున్నది. మానవుని భౌతిక శరీరము, దశేంద్రియములు, మనోబుద్ధిచిత్తాంహాకారములనెడి మనస్సుయొక్క చతుర్విధశక్తులును వ్యాయామము లేకుండా వికాసము నెన్నటికి నొందనేఱవు, అనగా చైతన్యవంతముగానేరవు, ఆరోగ్యస్థితిలోగూడ నుండనేరవు. ఇచ్చట వ్యాయామమనగా పిల్లలచేత వ్యాయామరంగములలోను (Gymnasiums) పాఠశాలలోను చేయించెడి ప్రత్యేకవ్యాయామక్రియలని మాయభిప్రాయము కాదు. ప్రకృతిలోని పదార్థములను చూచినపుడు మనస్సున బయల్వెడలెడి యుత్సాహావేశభావములును, తత్ప్రభావముచే మనము జరిగించెడి కార్యములును, మానసికవిషయవాసనలు శారీరకావశ్యక కృత్యములు మున్నగునవన్నియు నాత్మశక్తికి సహజ వ్యాయామ కార్యములే. అట్టి వ్యాయామ కార్యముల మూలమున మనశరీరము, మనోబుద్ధులు వగైరాలు చైతన్యవంతమగును. ఈ వ్యాయామ కృత్యములఫలితమేమనగా, మన ఆత్మశక్తి మన శరీరమనస్సుల జడసామగ్రితో మిళితమై పోవుచుండును. ఈ తీరున యింద్రియములు మనస్సు మున్నగునవి చైతన్యవంతములగుచున్నందున వానితో పాటు మన ఆత్మతత్త్వములోగూడ చైతన్యవికాసము గలుగుచున్నదని యెంత మాత్రము తలంపరాదు. మన శరీరము, ఇంద్రియములు, మనోబుద్ధ్యాదులును చైతన్యవంతమగుట అనగా వికాసనొందుట ఒక విషయము, ఆత్మతత్త్వము చైతన్యవంతమగుట మఱొక విషయమును. మానవునకు సామాన్యముగా లభించెడి జ్ఞానముమూలమునను, మానవునిచే చేయబడు కార్యకలాపమువలనను మనలోనున్న చైతన్యశక్తియొక్క అనగా జీవునియొక్క యథార్థతత్త్వమును గుఱించి కాని మన శరీరమందలి జీవునియొక్క నివాసస్థానమును గుఱించికాని, ఆశక్తి మన శారీరకమానసిక ఘట్టములందు ప్రసరించి ప్రకాశించువిధమునుగుఱించికాని తెలిసికొనుటకు సావకాశము లేదని పైన

చెప్పిన దానినిబట్టి తేటపడుచున్నది. ఈ విషయములను తెలిసికొనుటకై మరింత ఎక్కువ గాఢముగా ఆలోచించవలసి యుండును.

## 9. మనస్సు ఆత్మయు భిన్నపదార్థములు

మన శరీరములో ఆలోచనచేయు సాధనమును మనస్సు అందురు. ఇంద్రియములవలెనే మనస్సుకూడ, తన కృత్యములు చేసికొనుటకు, ఆత్మశక్తి పైన ఆధారపడుచున్నది. ఏలనన ఆత్మశక్తియొక్క ధారలు, గాఢనిద్రా మూర్ఛావస్థలలోవలె, అంతర్ముఖముగ ముడుచుకొనిపోయినపుడు మనస్సు కూడ ఇంద్రియములవలెనే నిష్క్రియమైపోవును. దీనిని బట్టి మనస్సు ఆత్మయు వేర్వేరుపదార్థములనియు మనశ్శరీరములకు శక్తిని ధారలరూపముగా పంపునట్టి ప్రాణశక్తి కేంద్రమే ఆత్మయనియు స్పష్టముగా తేటపడును.

## 10. ప్రేత జీవులు

ప్రేతజీవులయవస్థను గురించిన రహస్యములను పరిశీలనచేసినవారు, దేహత్యాగమైన పిమ్మట జీవుడు నాశమును అనగా అభావమును పొందక అవస్థాభేదమును మాత్రమే పొందునని తేటపడునట్టి అనేకమైన అసాధారణానుభవములను వ్రాసిరి. ఆయవస్థలనుగురించి యీ గ్రంథమున ముందు ముందు చెప్పబోయెదము. ఈ యవస్థలు నిజముగనుండినచో నవి చైతన్య శక్తియొక్క సారతత్త్వమును దాని నియమములనుగురించి పరిశీలనచేయు సందర్భములో చాల ఉపయోగకరముగ నుండును. కావున ప్రేతవిద్యావేత్తలు వ్రాసిన అసాధారణ విషయములను వైజ్ఞానిక శాస్త్రరీతిని పరిశీలనగావించి, ప్రేతయోని ఉన్నదని ఒప్పుకొనుటయో, లేదా, లేదని నిషేధించుటయో శాశ్వతముగ తేల్చివేయవలయునని మా అభిప్రాయము. ప్రేత జీవులను గురించి చెప్పునదంతయు నిజమని స్థిరపడిన యెడల, ఆ విషయములమూలమున చైతన్యశక్తియొక్క తత్త్వమునుగురించియు, దాని నియమములను గురించియు మనకు యెక్కువ ప్రకాశము గల్గుటయేగాక, దాని రహస్యము నవగాహన చేసికొనుటలో కూడా గొప్ప సహాయము గలుగును. ప్రేతవిద్యా ప్రవీణులు ప్రేతజీవులనుగురించి పరిశీలించి తేల్చినవిషయములు మనమిపుడు నిజమని అంగీకరించినచో అందువలన కొన్ని లాభదాయకమైన పర్యవసానములు మనకు లభించగలవు. అనగా యీ స్థూలశరీరమును విడిచి

పుట్టినవెంటనే జీవుడొక ప్రకాశమానమైన సూక్ష్మశరీరమును ధరించుననియు, ఆ సూక్ష్మశరీరములోనున్నసమయములో జీవునికి స్థూలశరీరములోనున్నపుడతనికిగల రాగద్వేషభావము లించుమించుదివరలోవలెనే యుండుననియు, పైగా ఆ సూక్ష్మశరీరముయొక్క వర్ణము రూపమును స్థూలశరీరముయొక్క వర్ణరూపములనే పోలియుండుననియు తేటపడును. ఈ తేలిన విషయములను బట్టి స్థూలశరీరము పోయినపిమ్మటగూడ జీవాత్మకు, దుఃఖక్లేశములకు హేతుభూతమైన మనస్సంయోగము (mental association) నుండి విముక్తిగలుగ నేరదని తేటపడుచున్నది, అనగా స్థూలశరీరము పోయిన పిమ్మట కూడా, మానసిక బంధనములను కల్పించుటకును, పిమ్మట కొంతకాలమునకు స్థూలశరీరము ధరింపవలసివచ్చునట్లు చేయుటకును, హేతుభూతమైన విషయములన్నియు నష్టే యుండిపోవునని స్పష్టపడును. జీవునకు, కామక్రోధలోభమోహాదులును ప్రాపంచికవాసనలును అనెడి యీ బంధనములమూలముననే స్థూలమండలములకు దిగిపోయి ఇచ్చట స్థూలశరీరము ధరించవలసిన యగత్యము గలుగుచున్నదని యీ గ్రంథమున మునుముందు,విమర్శపూర్వకముగ వివరించబోయెదము. అందుచే నీ కారణములు సంపూర్ణముగ నశింపుచేయబడి, వానికి బదులుగా ఉత్తమలోకముల చైతన్యకేంద్రములతో జీవునికి సంబంధము స్థాపించబడునంతవఱకును అతనికి మనస్సుతోను జడప్రకృతితోను సంబంధము స్థిరపడియుండి, ఆ కారణముచే నతడు సాంసారిక సుఖదుఃఖముల ననుభవింపవలసివచ్చుచుండును. ఈ ప్రసంగములో చెప్పినదానినిబట్టి రెండు ముఖ్యాంశములు తేలుచున్నవి. అవేవియనగా, ఒకటి, ప్రేతజీవులకు స్థూలశరీరము వదలిపోయినను వారు స్థూలశరీర ధారులవలెనే సుఖదుఃఖముల నెప్పటియట్ల అనుభవింపవలసియుండుననియు, రెండవది, స్థూలశరీరము నశించినను జీవుడు నశించిపోడనియు.

## 11. చైతన్యశక్తికిని ప్రకృతిలోని స్థూల శక్తులకును గల భేదము.

చైతన్యశక్తి ప్రకృతిలోని స్థూలశక్తుల సమ్మేళనముచే నేర్పడినదికాదని తెలిసికొనవలెను. ఎవరైనను ఆత్మ ప్రకృతిశక్తులకలయికవలననే యేర్పడినదని వాదించినట్లైతే, ప్రాకృతికశక్తుల ప్రస్తుతావస్థను వారు పరిశీలించినయెడల తమపొరపాటు తెలిసికొనగలరు. ఈజగమున వివిధసుప్రసిద్ధరూపములను ధరించియున్న స్థూలశక్తులన్నిటిలో దేనికిగూడ నొకగుప్తభండార మీసృష్టిలో

లేకుండ లేదు. ఈవిషయము సరియైనచో చైతన్యశక్తికిగూడ నేదోయొకచోటున భండార ముండితీరవలయును. స్థూలశక్తులన్నిటికిని వేఱువేఱు గుప్తభండారములుండుచున్నట్లు రుజువుచేయుటకు ఒకదృష్టాంతముచెప్పెదము. ఒకకొవ్వువత్తిని అగ్గిపుల్లతో వెలిగించితిమనుకొనుడు. ఆవత్తి ప్రకాశించుటకు కారణమేమియని ప్రశ్నించవచ్చును. జలనక్రియయందుమాత్రమే మనముదృష్టినుంచినచో వత్తిమండుటచే ప్రకాశముకలిగినదని సమాధానము వచ్చును. కాని ఆసమాధానము సరికాదు. వాస్తవమేమనగా జ్వలించుచున్న పదార్థములోని పరమాణువులలోనున్న విశిష్టతాపము (specific heat) అనగా స్వాభావికగుప్తాగ్ని తనకుతాను నతివేగముగ ప్రకాశించుటచే నావత్తి ప్రజ్వలించుచున్నది. ఈస్వాభావికగుప్తాగ్ని లేక ప్రాకృతికాగ్నియే ప్రకటాగ్నియొక్క గుప్తభండారము. ఆగుప్తభండారము లేనిచో అగ్నిప్రకాశమునకు బొత్తిగ నావకాశము లేదు. ప్రకృతిలోనియితరశక్తులకుగూడ సరిగ నిదేవిధమైన యేర్పాటున్నదని తెలిసికొనవలెను. ఈసిద్ధాంతమును చైతన్యశక్తికిగూడ వర్తింపజేసినచో చైతన్యశక్తికిగూడ నీసృష్టిలో నెచ్చోటనో గుప్తభండారము తప్పకయుండితీరవలయునని పర్యవసానము తేలును. ఇచ్చట మేము దృష్టాంత సహాయముతో చైతన్యశక్తికి గుప్తభండార ముండవచ్చునని నిశ్చయించితిమి కాని, యీరుజువు చాలదు. ఏలనన, దృష్టాంతముచే నిరూపించినయూహాలొక్కొకపుడు ప్రామాణికముగనుండజాలవు. వైజ్ఞానికపద్ధతిని నిర్ణయించుటయే మనకు అభిమతము కావున నీవిషయమునుస్థిరపఱచుటకు మనయనుభవములలోని యథార్థవిషయములను ప్రమాణముగనిచ్చుట యుక్తముగనుండును.

10 వ ప్రసంగములో మేము ప్రేతవిద్యాప్రవీణులు వివరించినట్టి యద్భుతవిషయములను వైజ్ఞానికులు తగినవిధమునపరిశీలించి వానిని శాశ్వతముగనంగీకరించుటయో, నిషేధించుటయో, తేల్చుటయత్యావశ్యకమని తెల్పియుంటిమి. ప్రేతవిద్యావిశారదులు ప్రేతజీవులయస్తిత్వములోనెట్టిసందేహము లేదని వక్కాణించుచున్నారు. ఈవిషయమును విజ్ఞానశాస్త్రమంగీకరించిననాడు చైతన్యశక్తి తనయునికికై స్థూలదేహముపై నాధారపడదని, అనగా స్థూలదేహమక్కఱలేకుండగనే చైతన్యశక్తియుండగలదని, సిద్ధపఱుచుటకై ఒకనిరాక్షేపణీయమైన దృఢప్రమాణము మనకుచిక్కినదని చెప్పవచ్చును. అదియునుగాక, పొడవు వెడల్పు, యెత్తు అనెడిమూడుపరిమాణములలో ప్రవర్తించు స్థూలశరీరధాతులు చోరలేనిచోట్లకు భూతప్రేతములు

సులువుగపోగలవనువిషయముగూడ సంగీకరించినచో, ప్రేతజీవులకుఆకాశతత్వముయొక్క ధర్మములవంటిధర్మములు గలవని గూడ స్థాపితమగును, మఱియు స్థూలశరీరముపైన ప్రభావముచూపునట్టి శీతోష్ణములు ప్రేతజీవులను ఈషణ్మాత్రముకూడా బాధింపజాలవని తెల్పుట కెన్నియోసంఘటనలుగూడ ప్రేతవిద్యావిశారదులు చెప్పుచున్నారు. ఈవిషయము సరియనియంగీకరించినచో ప్రేతజీవునిశరీరము ఆకాశతత్వముతో నేర్పడినట్లు సిద్ధమైనదని చెప్పవచ్చును. ఏలనన, విజ్ఞానశాస్త్రము తాపకిరణప్రసారముచే ఆకాశతత్వముపైన నెక్కువమార్పేమియు గలుగనేరదని యంగీకరించుచున్నది, ఒకహద్దును దాటిపోయినయుష్ణములో కీటాణువులేమియు నుండనేరవని నిష్కర్షగాపాటుచున్న కీటాణుసిద్ధాంతములో, ఆకాశతత్వముతో నేర్పడినశరీరములు (అనగా ఆకాశికశరీరములు) ఉన్నవనియొప్పుకొనిననాడు, కొంతమార్పుచేయవలసి యుండును. ఏలనన ఉష్ణమునకు ఆకాశతత్వముపైన ఎక్కువప్రభావము లేనపుడు ఉష్ణతాప మెంత యెక్కువైననుకూడ ఆకాశిక దేహధారులు సులువుగనే జీవించగలుగుదురు. అందుచే కొంతపరిమాణమునకు మించినయుష్ణములో జీవితముఅసాధ్యమని, అనగా, కీటాణువులు ఉండనేరవనివాదించుట పొరపాటయిపోవును. అందుచే కొంతనియమితపరిమాణమునతిక్రమించిన ఉష్ణతాపములో స్థూలదేహముగలకీటాణువులుమాత్రమే జీవించనేరవని చెప్పునంతమట్టుకే కీటాణుసిద్ధాంతముసరిగాని ఆకాశతత్వమునకును ఇతరసూక్ష్మతత్వములకునుసంబంధించినట్టి శరీరములుగల కీటాణువులవిషయములో నీసిద్ధాంతమెంతమాత్రముచెల్లదు. పైనుదహరించినవిషయములనుబట్టి మఱొకవిషయముగూడ మనమూహించుకొనుట అయుక్తముకానేరదు. అదేమనగా, ఈపృథివిలో మనకుకనబడుచున్న స్థూలశ్రేణికిచెందినఅనేకజీవరాసులు ఈ పృథివిలోవలెనేజీవితమున్నట్టియు అనేకజీవరాసులతో నిండినట్టియు మనజ్ఞానేంద్రియములకగోచరమైన సూక్ష్మమండలమునుండి దిగివచ్చినవని. ఈవిషయముగూడ సరియని ఒప్పుకొనినచో ప్రస్తుతమున్నకీటాణువాదము సమూలముగా ఖండింపబడిపోవును. ఏలనన, నీ పరిస్థితిలో నుత్తమతరగతిశరీరములు ప్రప్రథమములో స్థూలకీటాణువులనుండియే ప్రారంభించి క్రమేణ అభివృద్ధి నొందిప్రకటమైనవని చెప్పుటకు నవకాశమే యుండదు. పైగా, అందుకుప్రతికూలముగ, స్థూలకీటాణువులు ఉత్తమచైతన్యమండలములనుండియు భండారములనుండియు క్రిందకుపడినట్టి దుర్బలమైన స్థూలబిందువులని అంగీకరించవలసియుండును.

ప్రకృతిశక్తులకు సంబంధించిన అనుభవవిషయములు గూడ నీ యభిప్రాయమును సమర్థించును. ఏలనన, ఈ భూమండలములోని తాపము కాంతి మొదలగు ప్రకృతి శక్తులు ఉన్నతతరగతిభండారములనుండియే వచ్చుచున్నట్లు మనకు తెలిసిన విషయమే.

యోగసమునకు సమాధ్యవస్థలో స్థూలదేహక్రియలన్నియు కట్టుపడిపోయిన పుడు అతని యాధ్యాత్మిక శక్తులును, మానసిక శక్తులును, మిక్కిలి వృద్ధియై యతడు భవిష్యద్విషయములను, దూరస్థలములందు జరిగెడి విషయములను సరిగ చెప్పగలుగుచున్నాడను విషయము మనకు అనేకవాస్తవవృత్తాంతముల వలన తెలియును. దీనిని బట్టి అతడింకను ముందుకుపోయినట్లైతే, అనగా, అతని జీవాత్మపైనున్న ఇతర సూక్ష్మకోశములుగూడ వరుసగ తీసివేయబడినచో అతనికి ఇంకనెక్కువఉత్తమతరగతి శక్తులు మేల్కొంచుట మొదలిడి, చిట్టచివరకు కేవలము నిర్మలమైన ఆత్మతత్త్వముయొక్క ప్రకాశము మాత్రమే మిగిలియుండగలదని యూహింపవగును. అనగా సమాధ్యవస్థలో జీవుడు స్థూల దేహము నుండి కొద్దిగనే వేరైనపుడే మానవునిలో నుత్తమ శక్తులు ప్రకట మైనచో, స్థూలదేహముకంటెపైనున్న సూక్ష్మకోశములనుండికూడ అతనికి విడుదలగల్గినపు డతనిలో నంతకన్న నెక్కువ ఉత్తమశక్తులు మేల్కొం చుననియు, సమస్తకోశములును పూర్తిగ తీసివేయబడినపుడు ఆత్మ తన నిరా చ్ఛాదిత స్వస్వరూపములో ప్రకాశించుననియు, స్పష్టమగుచున్నది. ఆత్మ అట్టి నిరాచ్ఛాదితావస్థలో నున్నప్పుడు అది ఆనందము, జ్ఞానము, సత్యములయొక్క భండారము అనగా కేంద్రముగా కన్పట్టును.

మనము కొంతసేపు చైతన్యశక్తిని విడిచిపెట్టి, ప్రకృతి శక్తుల విష యమై పరిశీలించినచో, అవన్నియు నేయేకోశములద్వారా ప్రకటమగు చున్నవో, ఆ కోశములమీదనే వాని స్థితి ఆధారపడియున్నదని తేటపడగలదు. ఏలననగా, యేశక్తియొక్క కోశమునైనను తొలగించివేసినయెడల ఆశక్తి నాశనము పొందకపోయినను, దానియొక్క ఆకోశముద్వారాప్రకటమైన స్వరూపము వెంటనే మాయమైపోవుచున్నది. ఉదాహరణార్థము రాసాయనిక క్రియ దృష్టాంతముగ దీసికొందము. రాసాయనిక క్రియ పరమాణువుల పరి వర్తనముచే జరుగుచుండునని యందఱకు తెలిసినదే. ఈ సృష్టిలో పరమాణు వులుగల మండలములకు పైన, పరమాణువులు లేనట్టి మండలమొకటి యుండి

నచో, నా మండలములో రాసాయనికక్రియ పరమాణువులున్న మండలములో సాగుచున్నవిధమున సాగుటకెంతమాత్రము సావకాశముండదు. ఏలనన, నచ్చట, పరమాణువులే లేనపుడు వాని పరివర్తన మేలగలుగు ? పరమాణువుల పరివర్తనము లేనపుడు ఆ పరివర్తనయొక్క పరిణామమైన రాసాయనికక్రియ యేల సాధ్యమగును ? ఇప్పుడు మఱొక దృష్టాంతముగా విద్యుచ్ఛక్తిని తీసికొనుడు. విద్యుచ్ఛక్తి ఏదో యొక కోశముద్వారా ప్రకటితమగుచున్నదను మాట నిజమైనచో, ఆశక్తి యెచ్చటినుండి దిగివచ్చుచున్నదో అట్టి ఘట్టమొకటియు, నెచ్చటికి దిగి అది క్రియాశీలమగుచున్నదో అట్టి ఘట్టము మఱొకటియు వేఱువేఱుగ రెండు ఘట్టములున్నవని యొప్పుకొనవలసియున్నది. ఎవరైనను అట్లు రెండు ఘట్టములులేవనియు నారెండు నొకే ఘట్టమనియు నన్నచో నదిపొరపాటు. ఏలనన, నీరెండుఘట్టములు వేఱువేఱుగనుండని యెడల, విద్యుచ్ఛక్తి తన నివాసఘట్టముపైన నిరంతరము ప్రకటమై యుండవలయునుకావున దానికి అచ్చట గుప్తావస్థయే యుండనేరదు. కాని యిది యనుభవమునకు పూర్తిగా విరుద్ధము. ఏలనన, విద్యుచ్ఛక్తికి గుప్తప్రకటావస్థలు రెండును మనము చూచునేయున్నాము. కావున, విద్యుచ్ఛక్తియొక్క యీ రెండు ఘట్టములును వేఱువేఱుగనే ఉన్నట్లు ఒప్పుకొనవలసి యున్నది. పొడుగు, వెడల్పు, ఎత్తు అనెడి మూడు పరిమాణముల కెట్టి పరస్పరసంబంధమున్నదో అట్టి పరస్పరసంబంధమే యీ రెండు ఘట్టములకును గూడ యుండగలదని యొప్పుకొనవలసియున్నది. ఈ మూడు పరిమాణములును పరస్పరము వేఱువేఱుగనేయున్నను, ఒకదానితో మఱొకపరిమాణపురేఖ యెట్లు (ఒకస్థలములో) కలియుచున్నదో, అటులనే విద్యుచ్ఛక్తి యొక్క యీ ఘట్టములు రెండును భిన్నములై యుండినను, అవి యెచ్చటనో కలిసిగూడ యున్నవి. ఈ రెండింటిలో నొకటి యున్నతఘట్టము రెండవది నిమ్నఘట్టమునని చెప్పవచ్చును. విద్యుచ్ఛక్తి ఉన్నతఘట్టమునుండి నిమ్నఘట్టమునకు దిగినపుడు ఆ నిమ్నఘట్టము చైతన్యవంతమై అనగా క్రియాశీలమై, అచ్చటనుండి ఆశక్తి తిరిగి వెనుకకు పోయినపుడు, ఆ ఘట్టము చైతన్యహీనము లేక క్రియాశూన్యమైపోవును. విద్యుచ్ఛక్తి విషయములో నీ నిమ్నఘట్టము ఆకాశతత్త్వమని (Ether) యంగీకరించినచో, విద్యుచ్ఛక్తి సర్వత్రవ్యాపించకుండ తన నివాసఘట్టములోమాత్రమే వ్యాపించియున్నట్లు సహజముగ నిర్ణయించవలసివచ్చును. ఈ సమస్తసృష్టియు ప్రసిద్ధపరిమాణత్రయముయొక్క హద్దులలోనే యిమిడిపోలేదని యిచ్చట చెప్పుట యవసరము. మానవునియొక్క దృష్టికిని బుద్ధికిని

యీమూడు ప్రసిద్ధపరిమాణములుమాత్రమే గోచరమగుచున్నవి. రేఖాగణితములో రేఖకు, అనగా గీతకు ఒకేపరిమాణమున్నదనియు, చతుష్కోణమునకు రెండుపరిమాణములున్నవనియు, ఘనపదార్థములన్నియు మూడుపరిమాణములుగల వస్తువులనియు బోధింపబడుచున్నది. కాని గీతలు, చతుష్కోణములను, కేవలము ఊహాకల్పితములేగాని ప్రత్యేకవస్తువులుగావు, అనగా యీ మూడుపరిమాణములలో నొకటిగాని రెండుగాని పరిమాణములనూహించుకొని ఆయాకారములను కల్పించుకొనవలసియున్నది. రెండుకొలతలుగలవస్తువులను మాత్రమే తెలిసికొనశక్తిగలజీవు లెవరైన నుండినచో, నట్టిజీవులకు పరిమాణత్రియములోనున్న ఘనపదార్థములజ్ఞాన మిన్నటికిని గలుగజాలదు. సరిగ నట్లే, మూడుకొలతలుగల ఘనపదార్థములను తెలిసికొను శక్తిమాత్రమేగల్గిన బుద్ధియు దృష్టియునుగల మానవులకు ఈ పరిమాణత్రియమును మించియున్న దేదియు గోచరముకానేరదు. కాని యీ ప్రసిద్ధ పరిమాణత్రియముగాకుండ నెన్నియో యితరపరిమాణములుగూడ గలవు. కావున, ప్రస్తుతము మనబుద్ధియొక్కయు దృష్టియొక్కయు సహాయముతో మనమున్న యీసృష్టినిగుఱించి యేర్పడిన యూహాలను మనము మార్చుకొని మనకు గోచరమైన లోకములకన్న నెక్కువ వ్యాప్తిగలిగినట్టియు, నెక్కుడు సూక్ష్మతరమైనట్టియులోకములింకను ఈసృష్టిలోగలవనియు, అవి మనకగుపడునట్టి ప్రతిపదార్థమును పరివేష్టించియు దానిలోపలపైనకూడా వ్యాపించియు నున్నవనియు అంగీకరించవలసియున్నది. వాని యునికిని గుఱించి మనకీషణ్మాత్రజ్ఞానముగూడ లేనట్లుకూడా అంగీకరించవలయును. ఇంతియగాక కొన్నిపనులు ఈమూడుకొలతల ఆవరణకు పైనుండి జరిగించబడుచున్నట్లు స్పష్టముగ రుజువుచేయునట్టి సంఘటనలెన్నియో మానవునకు అనుభవసిద్ధమైయున్నవి. ఈ విషయమును గుఱించి ఈ గ్రంథము యొక్క మూడవభాగమైన రచనాభాగములో నింక నెక్కువ వివరముగా వర్ణించెదము.

ప్రకృతిలోని యితరశక్తులను కూడ పరికించిచూచినచో వానికోశములు మారినప్పుడు వాని ప్రకృతరూపములుగూడ మార్పుచెందుచున్నవని సులువుగ బోధపడును. అందుకు మూడవ ఉదాహరణగా అగ్నితాపమును గుఱించి పరికింపుడు. ఉష్ణము లేక తాపము ఆకాశతత్త్వములో ప్రసరించినందువలన ఆకాశతత్త్వము వేడియెక్కదని ఇంచుమించు అందఱు నంగీకరించుచున్నారు. కావున తాపావస్థగలుగజేయు పదార్థము ఆకాశతత్త్వముకంటె వేఱైనదనియు, నట్టి

పదార్థములకును, ఆకాశతత్త్వమునకును, తాపావస్థవిషయములో పరస్పర సంబంధము ఎక్కువలేదనియు చెప్పుట యుక్తముగాను కాదేమో. వీనికి అట్టి పరస్పర సంబంధమే యుండినయెడల తాపప్రభావము ఉష్ణమునందు గలుగవలసినదే. కావున వీనికట్టి తాపావస్థ ఆకాశతత్త్వమునకు సంబంధించినది యనుకొనరాదనియు, ఆకాశతత్త్వముయొక్క పరమాణువులు తాపమును వహించుటలో పాల్గొనుటలేదనియు స్పష్టపడుచున్నది. తాపము స్థూలప్రకృతియొక్క ఇతరరూపములైన జలపృథివ్యాదులపైనమాత్రము ప్రభావము తప్పకచూపుచున్నది. తాపావస్థ యనగా జడపదార్థముయొక్క పరమాణువుల విభక్తదశ (వేరువేరుగ నుండుట) యని మాయభిప్రాయము. ఈ విభక్తావస్థ ప్రకృతియొక్క స్థూలావస్థను (అనగా పృథివి, జలవాయుతత్త్వముల యవస్థను, పరమాణురూపమైన (అయాన్సు, ions) అవస్థకును మధ్యనున్న అవస్థ. కాబట్టి స్థూలప్రకృతియొక్క పరమాణువులను విభజనచేసి సూక్ష్మపరమాణువుల (అనగా అయాన్స్ ions) అవస్థలోనికి మార్పు చేయుటకు యేది కారణభూతమో అదియే తాపావస్థను కలుగచేయుచున్నది. అట్టి విభక్తావస్థను కలుగజేయుటకు తాపమే కారణభూతము కానక్కరలేదు. శక్తి యేరూపములోనున్నను, దానికి పరమాణువులను విభజింపగల సామర్థ్యమున్నది. కావున శక్తిభాగాలు పరమాణువుల మండలముగుండా ప్రసరించినపుడనే తాపము తనంతటతానే ప్రకటమగును. కావుననే విద్యుచ్ఛక్తి చాలబలవత్తరమైన శక్తి అయినను, ఆ విద్యుచ్ఛక్తిలో తాపమెంతమాత్రము నుండకుండా, అది పరమాణువు మండలములోనికి ప్రవేశించినపుడే వెంటనే తాపము పుట్టుచున్నది. దీనిని బట్టి పరమాణువులయొక్క ప్రత్యేక విధమైన విభక్తదశయే తాపావస్థకు కారణభూతమనియు, పరమాణువుల యీ విభక్తదశను ఏవిధముననైన నంతరింపజేసిననో తాపావస్థ తనంతటతానే పోవుననియు స్పష్టపడుచున్నది. కాబట్టి పైకారణములవలన ప్రకృతిలోని శక్తులన్నింటియొక్క ప్రస్తుతరూపములు యేయే కోశములద్వారా ప్రకటమగుచున్నవో, ఆ కోశములున్నంతవరకే నిలచియుండుననియు, నాకోశములు నశించినప్పుడు ఆ కోశములద్వారా శక్తికి ప్రకటమైన రూపములుగూడ నంతరించిపోవుననియు తేలుచున్నది.

## 12. ప్రాచీనుల పంచమహాభూతములు

పూర్వకాలములో మనపెద్దలు, క్రిందటి ప్రసంగములో వర్ణించిన పరమాణువులవిభక్తదశను పొందినప్రకృతినే అగ్నితత్త్వమని పేర్కొనుచుండిరి

పోయె. అటులనే మిగిలిన నాలుగుతత్వములుగూడ (పృథివి, జల, వాయు, ఆకాశతత్వములు) ప్రకృతియొక్క మరి నాలుగు విధములైన అవస్థలపేర్లే (అనగా కఠిన, ద్రవ, వాయవ్య, ఆకాశీయ, అవస్థలు). మన పెద్దలు సామాన్యమైన మట్టి, త్రాగెడినీరు, వగైరాలనే యిట్లు పేర్కొనుచుండిరనెడి సామాన్యాభిప్రాయము పొరపాటు. అట్లుగాక పైనచెప్పినట్లుగా, ప్రకృతి అనగా జడపదార్థముయొక్క ఘనద్రవాద్యవస్థలే మూలతత్వములని చెప్పబడుచుండెడివి. అనగా, మన ప్రాచీనులు పంచమూలతత్వములని చెప్పుటలో అత్యుత్తమ వైజ్ఞానిక శాస్త్రపద్ధతిని వరుసగా యేర్పడియున్నట్టి యీ అయిదు అవస్థలలోనున్నప్రకృతి అనియే వారి అభిప్రాయము.

## 13. ఆత్మ (సురత్) అనగా చైతన్యశక్తియే ఆదిశక్తి.

ఇపుడు మనము చైతన్యశక్తినిగురించి తిరిగి పరిశీలనప్రారంభించుదము. ప్రకృతిశక్తులవిషయములో, వానిపై కోశములను తీసివేసినపు డేమగునని చూచినట్లుగానే చైతన్యశక్తివిషయములోగూడ ఆపద్ధతినిచూచినచో చైతన్యశక్తి కెట్టియవస్థగల్గునో ఆలోచించుదము. అందులకై మరణము, మూర్ఛ, సమాధి మొదలైనఅవస్థలను పరిశీలించుట యుక్తము. ఏలననగా, స్థూలశరీరమనెడికోశము మొదట పేర్కొనబడినమరణావస్థలో పూర్తిగ తొలగిపోవుటయు, మిగిలినయవస్థలలో నది నిష్క్రియమైపోవుటయు సంభవించును. మానవునిలో ఆత్మశక్తి సామాన్యముగ నిక్రిందవివరించిన చతుర్విధధర్మములను నెరవేర్చుచున్నట్లు మన అనుభవములో చూచుచుంటిమి: 1. జ్ఞానసంపాదనము. 2. సుఖదుఃఖానుభవము. 3. సంకల్పవికల్పములు అనగా ఆలోచనలు, తలంపులును చేయుట 4. శక్తి లేక ప్రాణము నిచ్చుట. ఈప్రాణ శక్తిమూలముననే ఆహారముజీర్ణమై స్థూలశరీరము తయారగుచున్నది. అయితే యీనాల్గుధర్మములును ప్రేతజీవులలోను కనబడుచున్నవి, సమాధ్యవస్థలోగూడ కనబడుచున్నవి. మానవునకి స్థూల దేహక్రియలు నశించినపుడు లేక కట్టువడినపుడు పైనాల్గుధర్మములుండుటయేగాక, అతనిలో నున్నతతరగతిజ్ఞానగ్రహణ శక్తులును భవిష్యద్విషయములను తెలిసికొనగల్గుటయు మానవులకందరాని ఘట్టముల నారోహించగల్గుటయు మొదలగు శక్తులుగూడ మేల్కాంచుచున్నవి. దీనిబట్టి చైతన్యశక్తిపైనుండి కోశములు తొలగించబడినపుడు ప్రకృతిశక్తుల పద్ధతిప్రకారముగనే దానిశక్తులన్నియు ముఖ్యావకాశము గాంచుచుపోవుచున్నవని

సహజముగ సిద్ధించు చున్నది. మేమీ ప్రసంగములో వ్రాసిన విషయములనుబట్టి దేహపాతమైనపు డందఱు ప్రేతత్వమునొందుదురని భావించరాదు. మేమీ గ్రంథముయొక్క మూడవభాగములో 114వ ప్రసంగములో దేహపాతానంతరము జీవునికిగలిగెడి యవస్థనుగుఱించియు, మరణానంతరము సృష్టిలోని వివిధతరగతులజీవులకు ఏయేపద్ధతులననుసరించి ఏర్పాట్లుచేయబడునో ఆవిషయమునుగుఱించియు వివరించెదము. మేమిచ్చట ప్రేతజీవులప్రశంస తెచ్చినది ఆత్మకు స్థూలకోశములనుండి వియోగముగలిగినమీదట దానిశక్తులు యథాప్రకారము నిలచియుండుటయేగాక పూర్వముకన్న నెక్కువతీవ్రముగ ప్రకటముకాగలవని ప్రత్యక్షనిదర్శనమును చూపుటకుమాత్రమే.

జీవునికి వివిధమానసిక క్రియలను నెఱవేర్చునిమిత్తము మనస్సు ఒక సాధనమని యింతకుపూర్వము 9వ ప్రసంగములో చెప్పియుంటిమి. మానసిక క్రియలను వ్యక్తపఱచుటకు మనస్సు ఒక సాధనమని చెప్పినపుడు, మనస్సుకూడా మానసికక్రియలను ప్రకటముచేయుటకై యేర్పడిన ఒక తెరయే అని తేలుచున్నది. మనస్సహాయము లేకుండగనే చైతన్యశక్తి తన సహజధర్మముల నెట్లు నెఱవేర్చగలదో ముందు 21వ ప్రసంగములో చెప్పెదము. ప్రస్తుతము ఆత్మవస్తువుపైనుండి స్థూలకోశములు వరుసగ తొలగిపోయినకొలది, దాని నిజధర్మములు అధికాధికముగ ప్రకాశించుచుండుననిమాత్రము తెలియజేయుట చాలును. ఆత్మమీదనుండి స్థూల, సూక్ష్మకోశములన్నియు పూర్తిగ తొలగింపబడినపుడు అది తనశుద్ధస్వరూపములో విరాజమానమగును. ఆపరిస్థితిలో ఆత్మ, అనగా, చైతన్యశక్తి, ఆదిశక్తియొక్కయు, జ్ఞానానందములయొక్కయు భండారము లేక మూలకేంద్రముగా గోచరమగును.

పై హేతువాదములన్నియు సరియైనచో, ప్రకృతిశక్తులన్నిటియొక్క స్థితియు చైతన్యశక్తిపైన నాధారపడియున్నదను వ్యవసానము తేలును. సృష్టిలో పశువులయొక్కయు, ఓషధులయొక్కయు, మొలకలెత్తి వృద్ధినొందువిధానమును పరిశీలించినచో, నీహేతువాదముయొక్క నిర్దుష్టత స్థిరపడగలదు. ఏదేహమునందైనను చైతన్యశక్తియున్నసమయములో ప్రకృతిలోని సర్వశక్తులు, తత్త్వములును పరస్పరైకమత్యముతో నాదేహముయొక్క వృద్ధిపోషణలు జరుపుటలో తోడ్పడును. ఆదేహమునుండి చైతన్యశక్తి తొలగిపోయినవెంటనే అందుకు ప్రతికూలపరిస్థితి ఏర్పడి, అవే శక్తులు, తత్త్వములును ఆశరీరమును

స్వాధీనము చేయుట ప్రారంభించి, తుదకు అవి తిరిగి తమ తమ స్వస్థానములకు వెడలిపోవును. స్థూలశరీరముయొక్క సంసర్గస్థితులు జీవాత్మపై నాధారపడియున్నవను సిద్ధాంతము పరమాత్మయొక్క అంశమైన జీవాత్మవిషయములో సరియైన యెడల, ఈ జీవాత్మకు అంశియైన (అనగా భండారమైన) పరమాత్మవిషయములో అనగా ఆత్మభండారమైన సత్యసృష్టికర్త విషయములో నీ సిద్ధాంతము ఇంకనెక్కువ బలవత్తరముగా వర్తించునని తెలియుచున్నది. దీనిని బట్టి ఆ సత్యసృష్టికర్తయొక్క చైతన్యాధారప్రభావమువలననే ఈ సమస్తసృష్టియు రూపవంతమయ్యెననియు, ఆ ఆదికారణమగు సత్యకర్త చేతనే ఈసృష్టియొక్క పాలనపోషణల నిమిత్తమై సంపూర్ణబుద్ధిమత్త్వముతో కూడిన శాశ్వతనియమములు ఏర్పాటుచేయబడినవనియు సిద్ధమగుచున్నది.

## 14. ఆత్మశక్తియొక్క నిజభండారము

ఆత్మ సచ్చిదానందస్వరూపమని యింతకుముందే చెప్పియుంటిమి. ఇప్పుడు ఈప్రపంచములో జీవుడనుభవించగల అధికాధికసుఖముయొక్క పరమావధిస్థితిని, అనగా ఈలోకములో నెంతయెక్కువసుఖమనుభవింప సాధ్యమగునో ఆయత్యంతసుఖావస్థను ఊహారూపమున నిచ్చుట తెలుపదల్చుకొన్నాము. ఏలనన నట్టిభావనమూలమున మన మా యాదికారణము నిజభండారమునైన పరమసమర్థసత్యకర్తయొక్క యథార్థస్థితినిగురించి కొంతవఱకు ఊహింపశక్యమగును (నిజమునకట్టియూహ బహుతుచ్ఛమై స్థూలదృష్టిపైన నాధారపడినదే యగును.) పరమసుఖావహ [illegible]ములను తలంచినపుడును, బహుతీక్ష్ణమును మహాప్రకాశవంతమునైన బుద్ధివికాసము గలిగినపుడును, బహుమధురమనోహర రాగముల యాలాపనలు వినినపుడును, పరమసుందరరూపదర్శనమైనపుడును, మఱియు నితరేంద్రియములకు సంబంధించిన (మానవునికి పరమానందపరవశత్వముగల్గించు) యుత్తమానందములు లభించినపుడును మనపరిస్థితియెట్లైపోవునో మనమూహించుకొనవచ్చును. చైతన్యశక్తియొక్క అత్యల్పకిరణమైనట్టియు, అంశియైన మహాచైతన్యభండారముతో పోల్చిచూచినచో కేవలము శూన్యప్రాయమైనట్టియు, మానవశరీరములోనున్న ఆత్మాంశకే, యింత ఆనందమగ్నత నొందగల సమర్థత యుండినపుడు, అంశియైన చైతన్యభండారముయొక్క పరమానంద, పరమజ్ఞాన, పరమసత్తల వైభవమునకు (పరమసచ్చిదానందస్థితికి) అంతుపొంతు లేలయుండును? ఆచైతన్యభండారమే పరమపితయొక్క ధామము. అచ్చట పరమశక్తి పరమానంద, పరమసుఖములే రాజరికము సేయుచుండును,

అమరము, అవినాశియునైన ఆధామమునందు క్షయనాశము లెంతమాత్రము లేవు. పరమపితకు వారిధామమునకును, సృష్టిలోని యితరమండలములతోను అందలినివాసులతోను గలసంబంధము నీగ్రంథమున మునుముందు సవిస్తరముగ వివరించెదము. ప్రస్తుతము ఆపరమసర్వేశ్వరునికిరణములు సర్వత్ర వ్యాపించి యున్నను, వారినిజధామము వేఱుగనున్నదనియు, మనోమండల మాయామండలముల కతీతమైయున్నదనియుమాత్రము ఇచ్చట తెలుపగోరుచున్నాము. మనోమాయామండలములు పరమపితధామముకంటె భిన్నముగనున్నవని చెప్పినందున పరమసర్వేశ్వరుని యనంతాపారత్వములకు భంగము వాటిల్లునని యెవరైనను పూర్వపక్షము చేసినయెడల మేమందుకు సమాధానముగ నొక యెదురుప్రశ్న వేయుదుము. ఆకాశమున నొక మేఘఖండముండినందువలన నాకాశముయొక్క అనంతాపారతలకు భంగము గలుగుచున్నదా? (ఈవిషయమునుగుఱించి ౩వ భాగములో 79వ ప్రసంగమును చూడుడు.)

## 15. పరమార్థముయొక్క ఉద్దేశ్యప్రాప్తి

ఈ గ్రంథారంభములో పరమార్థముయొక్క యుద్దేశ్యమని చెప్పబడిన గతి యెప్పుడు యెచ్చట చేరుకొన్నమీదట, సిద్ధించగలదో పై ప్రసంగములోని విషయముల వలన గోచరించగలదు. ఏలననగా, జీవుడు పరమసర్వేశ్వరుని నిర్మల చైతన్యధామమునందు ప్రవేశించినపుడే అజరామరుడై, సకలవిధదుఃఖ, క్లేశములనుండియు విముక్తినొంది పరమసర్వేశ్వరునిదర్శనమొందుచు శాశ్వత పరమానందసాగరమున నిమగ్నుడై యుండిపోవునని విశదము చేసియుంటిమి.

## 16. ఆత్మ, దాని భండారము

జీవుని కేగతి లభించినందున, అనగా, యేధామమున ప్రవేశించుటచే, పరమార్థోద్దేశ్యప్రాప్తి సాధ్యమగునో బోధపడినపిమ్మట, పరమసర్వేశ్వరునిధామ మెచ్చటనున్నది, వారియంశకు అనగా, ఆధామమునకు ప్రయాణము చేయునట్టి జీవునికి, ప్రస్తుతనివాసస్థాన మెక్కడనున్నది, అను విషయములను దెలిసికొనుట అవశ్యకమగును. ఏలనన, నీవిషయములు నిర్ణయముకానిదే, ఈయాత్ర నెరవేర్చుటకై చెప్పినసాధనలు సరియైనవో కావో అను విషయమును తేల్చుకొనుటకుగాని, ఆసాధనలు అభ్యాసము చేయుటకు సాధ్యమైనవా కావా అను విషయమును నిశ్చయించుకొనుటకుగాని సాధ్యమవదు. అందుచే గమ్యస్థాన మెచ్చట

దుర్గతి, ప్రయాణమెచ్చటనుండి ప్రారంభించవలయు ననునీరెండువిషయములను సంగ్రహించి విమర్శ చేయుదుము;

ఈసృష్టిలో ఆదిశక్తియొక్క భండారము లేక కేంద్రము చైతన్యశక్తియే అనియు, ప్రకృతిశక్తులన్నియు దానిమీదనే ఆధారపడియున్నవనియు, ఇదివరలో నిరూపించితిమి. కావున ప్రకృతిశక్తులకును, చైతన్యశక్తికిని చాలవఱకు సమానధర్మములుండవచ్చుననుట నిరాక్షేపణీయమనవచ్చును. మఱియు ప్రకృతిశక్తులలోవలె చైతన్యశక్తిలోకూడ తన నిజభండారముయొక్క ధర్మముల ప్రభావము వ్యాపించియుండుననియు, చైతన్యశక్తిధార యేస్థానమునన్నైన ఏకీభవమై కేంద్రమును స్థాపించుకొన్నయెడల ఆకేంద్రస్థానములోని పరిస్థితులకును ఆదిభండారముయొక్క పరిస్థితులకును కొంతపోలిక యుండవలసియున్నదనియు, చైతన్యశక్తిని ఏకత్రీకరణముచేసెడి సాధనమైన అద్దపుబిళ్ళ (lens) గాని మస్తిష్కకోశముగాని అవరోధమేమియు గలుగజేయనియెడల, నాకేంద్రముయొక్క స్థితి ఆదిభండారముయొక్క స్థితితో సంపూర్ణసాదృశ్యము గలిగియుండుననియు, నమ్ముటకూడ పొరపాటుకానేరదు. అనగా సూర్యకిరణములు ఒక భూతదర్పణము (మధ్యోన్నతబింబము లేక convex lense) లోనుండి ప్రసరించి యావలవైపున నొక కేంద్రముగ (focus) నేర్పడినపుడు ఆకేంద్రముయొక్క ఆకారము పరిస్థితియు నితరలక్షణములును ఆకిరణభండారమైన సూర్యుని యెట్లు చాలవఱకుపోలియుండునో, ఆదర్పణమెంత యెక్కువ స్వచ్ఛముగానుండిన ఆకిరణకేంద్రముగూడ నంతయెక్కువగా స్వచ్ఛమై సూర్యునితో సంపూర్ణసాదృశ్యముగల్గి యెట్లుండునో, అటులనే చైతన్యశక్తిధారలచే నేర్పడిన కేంద్రముగూడ మధ్యనున్నదర్పణము లేక కోశము శుద్ధస్వచ్ఛముగనున్న పరిస్థితిలో చైతన్యశక్తియొక్క భండారముతో నెక్కుడుసాదృశ్యము గలిగియుండవలయునని యభిప్రాయము. కాని, స్థూలసృష్టిలోని దర్పణములు లేక కోశములు దోషయుక్తములగుటచే నట్టి సంపూర్ణసాదృశ్యము దుర్లభము. అయినను మానవశరీరము ఈపృథ్విలో చైతన్యాంశయొక్క సర్వోత్తమచైత న్యవ్యాప్తియగుటచే చైతన్యభండారముయొక్క సాదృశ్యము చాలవఱకు మానవశరీరములో కనబడుచున్నది. అందుచే, రచనయొక్క అనగా ఈయఖండసృష్టియొక్క పరిస్థితిని దెలిసికొనుటకును దాని వివిధభాగముల విభజన నవగాహన చేసికొనుటకును, పరమానందధామమును నిశ్చయించుటకును, సర్వోత్తమమైన సంకేతస్థలి, మానవశరీర నిర్మాణవిధానమును పరిశీలించుటయే యని సిద్ధమగు

చున్నది. ఎక్కువను పాశ్చాత్యయంత్రసాధనముల సహాయముతో స్థూల సృష్టినంతను పరిశీలించి దాని విషయములను తెలిసికొనుటకై ప్రయత్నించినచో, నది యొంతమాత్రము సాధ్యమైనది కాదు. ఏలనగా సూక్ష్మసృష్టిలోని అధునాతనగతి సూక్ష్మాండములే యెన్నియో మన జ్ఞానేంద్రియములకు గోచరము కాకుండినపుడు, జ్ఞానేంద్రియములకై నారోపించి ఉపయోగించవలసిన యంత్రసాధనములవలన ప్రయోజనమేమి కలుగును? కావున, సృష్టియొక్క గుప్తవిషయములను తెలిసికొనుటకై చైతన్యాధారమునుండి కిరణరూపమున వచ్చిన చైతన్యశక్తియొక్క పరిస్థితిని పరిశీలించుటయే సాఫల్యదాయకమైన పద్ధతి యని తేలుచున్నది.

## 17. మానవశరీరముయొక్క మూడు ముఖ్యవిభాగములు.

మానవశరీరమును దాని మానసిక క్రియలను పరిశీలించినచో, మానవునిలో నీక్రింది మూడు ముఖ్యవిభాగములు కలవని స్పష్టమగుచున్నది:

1. బాహ్యకోశము, అనగా స్థూలశరీరమును, దానిలోనున్న ఇంద్రియములును ఇవన్నియు, పృథివ్యప్తేజోవాయ్వాకాశతత్త్వముల (భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశతత్త్వము) సమ్మేళనమువలనను, చైతన్యశక్తి ఆయా కోశములద్వారా ప్రకటమైనపుడు ఉద్భవించిన, ప్రకృతిలోని జడశక్తుల సహాయముతోను తయారైనవి.

2. మనస్సు:- దీనికి స్థాన మంతఃకరణము. అంతఃకరణమునకు నాలుగు అంగములు గలవు:-

(i) అందులో మొదటిది మనస్సు. దీని మూలమున మనలో ఆలోచనలు తలంపులు పుట్టుచుండును.

(ii) రెండవది చిత్తము, అనగా, శ్రద్ధాధారలు. వీనిద్వారా ఆలోచనలు వివిధవిషయములమీదికి మఱల్పబడి, ఆవిషయములందు లగ్నము చేయబడుచు

(iii) మూడవది బుద్ధి. దీనిద్వారా మానవుడు సమస్తవిషయములను అవగాహనచేసికొనుచుండును. ఇది చిత్తైకాగ్రతవలన నేర్పడిన ప్రకాశము.

(iv) నాల్గవది అహంకారము:- దీనివలన నేను, నీవు అనెడి భేదభావ మేర్పడుచున్నది.

3. ఆత్మ, లేక, చైతన్యశక్తి:- ఇది మొదటి రెండు విభాగములకును అనగా శరీరమనస్సులకు, ప్రాణమునిచ్చును. దీనిసహాయములేనిదే పైరెండును ఏపనిని చేయలేకుండపోవును.

## 18. మానవశరీరమందలి షట్చక్రములు.

పై ప్రసంగములోచెప్పబడిన మూడుముఖ్యవిభాగములను సూక్ష్మ ప్రపంచములో (అనగా మానవశరీరములో) మూడు మహాఖండములని చెప్ప వచ్చును. అవిగాక నందలి మొదటి విభాగములో, అనగా, స్థూలశరీరములో, షట్చక్రములని పేరుగల ఆఱు ఉపభాగములు గలవు. అవి యెవ్వియనగా:—

(i) గుదాచక్రము, లేక, మూలాధారము:- దీనికార్యము మలవిసర్జనము

(ii) ఇంద్రియచక్రము, లేక, స్వాధిష్ఠానము:- దీని కార్యము సంతానోత్పాదనము, అనగా, రేతస్సును తయారుచేయుట. ఈరేతస్సు క్రమేణ వృద్ధినొంది మానవశరీరముగ పరిణమించును.

(iii) నాభిచక్రము, లేక, మణిపూరము:- దీనిపని యాహారమును జీర్ణముచేసి స్థూలశరీరము నంతను పోషించుట.

(iv) హృదయచక్రము, లేక, అనాహతము:- ఇది రొమ్మెముక క్రింది కొనకు దగ్గరగనున్నది. దీనిపని సమస్తశరీరమునకు అవసరమైన యేర్పాట్లు (బందోబస్తు) చేయుట. ఈ స్థానమునందే సంకల్పవికల్పములన్నియు జనించును. విచారము, సంతోషము, ఆశ, భయము, మొదలగువాని ప్రభావము ఈ స్థానముమీదనే గలుగుచుండును. గుండె కొట్టుకొనుటఆగిపోయి, నాడి కట్టువడినపిమ్మటగూడ, నీచక్రము యథాప్రకారము పనిచేయుచునే యుండును. అట్టి పరిస్థితిలో కొద్దిసేపటివఱకు జ్ఞానేంద్రియకర్మేంద్రియములుకూడా తమ ధర్మముల నంతకుపూర్వమువలెనే నెఱవేర్చుచుండుటయు, దుఃఖసుఖములు వగైరాయనుభవములుకల్గుచుండుటయు, తఱచుగా జరుగుచుండును. కాని యీచక్రముపైన నొకగట్టిదెబ్బ తగిలి దానికృత్యములు పూర్తిగ కట్టువడినట్లయితే శారీరికకార్యకలాపమంతయు మానసికక్రియాసమేతముగ పూర్తిగ కట్టువడిపోవును.

(v) కంఠచక్రము (విశుద్ధము). ఇది సూక్ష్మప్రాణమును సక్రమముగ నడిపించుచుండును.

(vi) ఆజ్ఞాచక్రము. ఇది రెండునేత్రముల మధ్యభాగమున నాసికా మూలమునుండి లోపైవునకు రమారమి ముప్పాతికఅంగుళము లేక ఒక అంగుళము లోతున నుండును. ఇది జీవాత్మయుండెడి స్థానము.

క్రింది నాల్గుచక్రములక్రియలును, కొంతవఱకు ప్రకటముగనే జరుగుచున్నవిగాన, వానిని గుఱించి అందఱకును తెలియును. కాని పై రెండు చక్రములుచేయు కార్యములు ఈగ్రంథములో ముందు చెప్పబోవు ఆధ్యాత్మిక సాధనల నభ్యాసముచేసినపుడే తెలిసికొని నిరూపించుటకు శక్యమగును. జీవునకు మరణాత్పూర్వము. మరణసమయమందును గలిగెడి అంతరాకర్షణానుభవములన్నియు నీ సాధనల నభ్యాసము చేయుసాధకునకు అభ్యాసయయములో సంపూర్ణస్మృతి తెలివియు గల్గియున్నపుడే క్రమేణగల్గుచుండును. అట్టి సమయమందు గలిగెడి యనుభవములద్వారా పైన మేము వ్రాసినవిషయముల యొక్క వాస్తవత్వము తృప్తికరముగా ప్రయోగాత్మకవిధమున శోధనచేయుటకు వీలగును. మునుముందెప్పుడైనను వైజ్ఞానికులు, మరణించుచున్నజీవుని నిర్జీవసజీవభాగములలో వ్యత్యాసము తెలిసికొను పద్ధతులను కనిపెట్టినచో, మేము పైనవ్రాసిన విషయములకు సమర్థనము వానివలనకూడా చేకూరగలదు. వైజ్ఞానికశాస్త్రరీత్యా అట్టివిధమైన సమర్థనము బహుశః ఎక్కువ ప్రామాణికమనిపించుకొనవచ్చును.

## 19. జ్ఞానేంద్రియ కర్మేంద్రియములధారలు

స్థూలశరీరముయొక్కయు, ఇంద్రియములయొక్కయు, క్రిందటిప్రసంగములో నుదహరించిన షట్చక్రములయొక్కయు క్రియలన్నియు రెండు ముఖ్యధారలద్వారా జరుగుచున్నవి.

(i) వానిలో మొదటిది అంతర్ముఖధార:- జ్ఞానేంద్రియములమీాద బయటనుండి పడిన ఛాయల నీధారయే లోనికిలేసికొనిపోవుచుండును. శరీరముయొక్క పాలనపోషణవృద్ధులనిమిత్తమై ప్రాణశక్తికూడా ఈధారమూలముననే లభించుచున్నది. ఇది సురత్ ధార, అనగా, చైతన్యధార. ఇది అంతర్ముఖమైయుండి,

ఆకర్షణ చేయు లక్షణముగలదై యున్నది. ఇది బోధనాత్మకమనియు, (sensory) రచనాత్మకమనియు (Structural) రెండు ప్రధానరూపములలో ప్రకటమగుచుండును. బోధనాత్మకమనగా, జ్ఞానముగలుగజేయునట్టిది. రచనాత్మకమనగా శరీరనిర్మాణముచేయునది. మొదటిరూపము మానసికక్రియలుగల సమస్తజంతువులయందును, ప్రకటముగ కన్పించును. ఈ మానసిక క్రియలు నరముల (nerves) ద్వారాను, ఇతర సూక్ష్మనాళికల (Subtle Vehicles) ద్వారాను జరుగుచుండును. ఈ సురత్ ధార, లేక చైతన్యధారయొక్క బోధనాత్మకధర్మము రచనాత్మక ధర్మముకన్న నుత్తమతరగతికి చెందినది. ఈ ధర్మమును గురించి ఈగ్రంథముయొక్క రచనాభాగములో సవిస్తరముగ చర్చించెదము. రెండవరూపము నిమ్నతరగతికి చెందినదైనను, సృష్టికార్యమునకది యత్యావశ్యకము. ఈ రెండురూపములమధ్యగల పరస్పరసంబంధమునుగురించికూడ ముందు రచనాభాగములో సవిస్తరముగ చెప్పెదము. సమస్తప్రాణికోటిలోను రెండవరూపము మొదటిరూపముయొక్క సహాయముతోనే పనిచేయును. ఎట్లనగా, ప్రాణులయొక్క స్థూలసూక్ష్మ ఘటములు రెండింటినుంచికూడా ఈబోధనాత్మకధర్మము పూర్తిగాలోపించిపోయినచో రచనాత్మకాంగముకూడ నిష్క్రియమైపోయి చివరకు శరీరము మృతినొందును.

(ii) రెండవది బహిర్ముఖధార:- దీని పని మనసున ఇచ్ఛలనుపుట్టించుటయు, దేహేంద్రియములను చలింపజేయుటయు, మలమును బహిష్కరించుటయు, సంపర్కక్రియ నొనరించుటయును. మానసికక్రియలలోని బహిర్ముఖమగు ప్రబంధమంతయు, శారీరకము మానసికముకూడ, నీధారమూలముననే జరుగుచుండును. ఈధార మనస్సునుండి వెలువడును. వనస్పతులలో ఇచ్ఛాక్రియ పూర్తిగా శూన్యము, దేహపాలనము కూడ శరీరాభివృద్ధిరూపమునమాత్రమే కనపించుచుండును, కాని, శేషించిన రెండుకార్యములును, అనగా, మలబహిష్కరణము, సంపర్కక్రియలును, వనస్పతులలో, జంతువులకన్న నధికప్రబలముగ నుండకపోయినను, వానితో సమానప్రాబల్యముతో తప్పక జరుగుచుండును. మనస్సు క్రియాశీలమై యున్నప్పుడు సకలసంకల్పములను నాశించుటలో సమము పాల్గొనుచుండును. వనస్పతులలో మాత్రము మనస్సు క్రియాశీలముగ నుండక నిద్రాణమైయుండును, అట్లనే సురత్ ధారకూడ వనస్పతులలో వానియొక్క బోధనాత్మకక్రియలనుబట్టిచూచినచో, నిద్రాణముగనేయున్నది. సురత్ ధార, లేక, చైతన్యధారయొక్క రచనాత్మకరూపమువలెనే

మనస్సుయొక్క స్థానములవలెనే వట్స్థానములున్నవనియు సిద్ధాంతీకరించ వచ్చును.

బ్రహ్మాండీమనస్సుయొక్క యీ దేశము 'సంత్' మతములో బ్రహ్మాండ మందురు. ఈపదమునకు బ్రహ్మయొక్క అనగా బ్రహ్మాండీమనస్సుయొక్క అండాకారదేశమని శబ్దార్థము. ఈబ్రహ్మాండదేశములో పరబ్రహ్మపదము (అనగా బ్రహ్మకతీతమైనమండలము) కూడా చేరియున్నది. ఈపరబ్రహ్మపద మునుగూడ బ్రహ్మాండములోచేర్చనిదే దానికి ఆఱుఉపభాగములు పూర్తి కానేరవు, మనుష్యశరీరములోని ఆఱు చక్రములకును బ్రహ్మాండములోనిస్థాన ములకును (ఈస్థానములకు చక్రములుఛాయలు) సంపూర్ణమైనఆనుకూల్యము కూడ కుదరదు.

పై 18వ ప్రసంగములో మానవశరీరములోని ఆఱవచక్రము ఆత్మ యుండెడిస్థానమనియు, పంచమచక్రము సూక్ష్మప్రాణస్థానమనియు, నాల్గవ చక్రము మనస్సుండెడిస్థానమనియు చెప్పియుంటిమి. ఈస్థానములందును శేషించినచక్రస్థానములందును కాన్పించెడి నాడీకేంద్రములు (Nerve centres) స్థూలపదార్థముతో తయారైనవి. కాని ఆచక్రములకుసంబంధించినశక్తికేంద్రములు (Force centres) అత్యంతసూక్ష్మములై, సృష్టియందలి (అనగా యీఅఖండప్రపంచమునందు) వానికిసంబంధించియున్న సూక్ష్మమండలములతో నిరంతరసంబంధముగలిగియున్నవి. మఱియు చైతన్యశక్తి ఈనాడీకేంద్రముల లోనికి మనస్సుఅనెడికోశముద్వారా వచ్చుచున్నట్లు కన్పట్టుచున్నది. ఏలననగా స్థూలశరీరముయొక్కపనులన్నియు మనస్సునివాసస్థానమైన నాల్గవచక్రము పూర్తిగనిష్క్రియమైనపుడు కట్టువడిపోవును. కావున నీ ఆఱుచక్రముల కార్య క్రమమును, ఆత్మమనస్సులురెండుకలిసి జరిపించుచున్నవని తేలుచున్నది. బ్రహ్మాండముయొక్క ఆఱుస్థానములవిషయములోగూడ పరిస్థితి యిట్లే యున్నది. పైనచెప్పినవిషయములనుబట్టి చూడగా బ్రహ్మాండదేశసంరక్షణము చేయుటలో బ్రహ్మాండీమనస్సునకుతోడ్పడుచున్నట్టి మహాచైతన్యకేంద్రమొకటి బ్రహ్మాండదేశములో నుండితీరవలెనని తేలుచున్నది. వేదమతములో అనగా వేదాంతదర్శనములో ఇట్టికేంద్రమొకటియున్నదనిమాత్రమే చెప్పిరిగాని దానిని గుఱించి మఱేమియు విశేషవిమర్శ చేయలేదు. అందు చేతనే వైదికమతములో నీస్థానమునుగుఱించి "నేతి, నేతి" (ఇదికాదు, ఇదికాదు) అనిమాత్రమే

యున్నది. రాధాస్వామీమతబోధప్రకారము బ్రహ్మాండదేశముయొక్క పై మూడుస్థానములను "సున్న" "త్రికుటి", "సహస్రదళకమలము" అని పేర్కొనబడుచున్నవి. మొట్టమొదటిస్థానమైన "సున్న" లో కాధిపతిని అక్షరుడందురు, అనగా, క్షయము. లేక. నాశముఁలేనివాడు. బ్రహ్మాండీమనస్సును అనగా, బ్రహ్మయొక్క సర్వోన్నతరూపమును పురుషుడని చెప్పుదురు. ఆ పురుషునితో నీయక్షరపురుషునకు సంబంధమున్నది. పురుషుడు (బ్రహ్మ) అక్షరపురుషునినుండి శక్తినిపొంది ప్రకృతిని వధించి బ్రహ్మాండమును సృష్టిచేసెను. రచనాభాగములో నీస్థానములను గురించియు, వాని యధిపతులను గురించియు పరిపూర్ణముగ విమర్శించెదము. కావున నిచ్చట వానిని గురించి యెక్కువగ చెప్పక, త్రికుటి సహస్రదళకమలముల యధిపతులనామములను, ఈస్థానములకు మానవశరీరములో సరిపోయినట్టిచక్రముల నామములను మాత్రము చెప్పి చాలింతుము. త్రికుటియొక్క అధిపతి బ్రహ్మ. సహస్రదళకమలముయొక్క అధిపతి నిరంజనుడు. ఈరీతిగ బ్రహ్మకు మూడురూపములున్నవి. మొదటిది సున్నలోనున్న అవ్యాకృతము, రెండవది త్రికుటిలోనున్న హిరణ్యగర్భము, మూడవది సహస్రదళకమలములోనున్న విరాట్టు. బ్రహ్మకెట్లు మూడురూపములు గలవో జీవునికిగూడ నట్లే మూడురూపములుగలవు. ఆమూడురూపములును జాగ్రత్, స్వప్నావస్థలలోను సుషుప్తి లేక సమాధిఅవస్థలోను ప్రకటమగును. సుషుప్త్యవస్థయందు జీవునిరూపము సామాన్యముగ వ్యక్తముకాదు. కావున సుషుప్తితోపాటు అసాధారణమైన సమాధ్యవస్థను కూడా పైన కలిపిచెప్పితిమి. వీలనన, నీయవస్థ సుషుప్త్యవస్థను మించినదగుటయేగాక నీయవస్థలో జీవుని రూపము వ్యక్తము, అనగా చైతన్యవంతమైయుండును. జీవుని యీమూడు రూపములను "విశ్వ", "తైజస", "ప్రాజ్ఞ" రూపములందురు. ఆత్మయుదాని నివాసస్థానమును, పైనజెప్పినజీవునిమూడురూపములకంటె పూర్తిగ భిన్నమైయున్నవి. అయిన నీమూడురూపములకును "సత్తా" (శక్తి) ఆత్మనుండియు, ఆత్మస్థానమునుండియునే చేకూరుచున్నవి. మనుష్యశరీరములోని పైమూడు చక్రములును వరుసగా నీమూడురూపములతో సంబంధించియున్నవి, అనగా హృదయచక్రము విశ్వరూపముతోను కంఠచక్రము తైజసరూపముతోను, ఆజ్ఞచక్రము ప్రాజ్ఞరూపముతోను సంబంధించియున్నవి. ఈమూడుచక్రములు మూడురూపములును బ్రహ్మాండముయొక్క మూడుఉన్నతస్థానములతోను బ్రహ్మయొక్క మూడురూపములతోను అనువర్తించియుండును.

బ్రహ్మాండీమనో దేశముయొక్క క్రిందిమూడుస్థానములును ఈ సత్వ, రజ స్తమోగుణములయొక్క వెవ్వేఱు కేంద్రిములు లేక స్థానములు. తమోగుణము యొక్కక్రియ పులమును తోసివేయుట. దీనిని శాస్త్రములలో శివుడని పేర్కొనుచున్నారు. ఇది సంహారశక్తియొక్క కేంద్రిము. రజోగుణముయొక్క పని పదార్థములనుజీర్ణముచేయుట, అనగా ప్రోగుచేయుటయు, పిమ్మట నుత్పత్తిచేయుటయును. దీనిని శాస్త్రములలో బ్రహ్మయని పేర్కొనిరి. మూడవదగు సత్వగుణముయొక్కకార్యము పాలనపోషణలుచేయుట. దీనిని శాస్త్రములలో విష్ణువనిపేర్కొనిరి. ఈగుణమే తక్కినరెండుగుణములకును ప్రాణమును శక్తినియిచ్చి ఆరెండింటికార్యములను ఒకదానిలోనింకొకటి పరితూగునట్లుగాఉంచును. ఇచ్చట సృష్టిలోనిప్రాణులు, జడపదార్థములుఅన్నిటి లోను ఈమూడుగుణములప్రతిబింబములును కానవచ్చుచుండును. మూలతత్వ ముల వేఱువేఱురూపములను, వానిలోవానికలయికవలన నేర్పడినపదార్థముల రూపములను, స్థిరముగనుంచు మేళనశక్తియే(Cohesive force) జడపదార్థముల లోని సత్వగుణము. అనగా పంచమూలత్వములును వెవ్వేఱురూపములు గల్గియుండి వాని పరస్పరసమ్మేళనమువలన తయారైన అనేకమిశ్రితపదార్థములకు కూడా వెవ్వేఱురూపములుండును. ఈసమస్తరూపములల్లోని జడపరమాణు వులను చెదిరిపోకుండ నిలబెట్టునట్టి శక్తిని మేళనశక్తియని చెప్పుదురు. ఈజగత్తులోని అచేతనపదార్థములలో పనిచేయు సత్వగుణము ఆమేళన శక్తియే.

ఈ జగమున సర్వకాలసర్వావస్థలయందును జరుగుచుండెడి ప్రకృతిరూప ముల సంహారకార్యమే అచేతనవస్తువులలో తమోగుణప్రకటనము. అనేక నూతనశరీరముల నిర్మాణార్థమై అణువులను (molecules) పరమాణువులను (atoms) క్రొత్తగ తయారుజేయునట్టి, ఆకాశములోప్రవహించుచున్న అయన ముల (ions) ప్రవాహమే, ఈయచేతనసృష్టిలో రజోగుణప్రకటనము. జంతువుల లోను వనస్పతులలోను, యీ మూడుగుణముల ఛాయలు మఱింత ప్రస్ఫుట ముగ ప్రతిఫలించుచుండును. అచేతనపదార్థములలో, చైతన్యధర్మములతో విరాజిల్లునట్టి ఆత్మ, గుప్తరూపమున నుండును కావున, బ్రహ్మాండముయొక్క యుత్తమతరగతికిచెందిన మూడురూపములఛాయలును ఆపదార్థములలో ప్రస్ఫు టముగ కానరావు. ఏలననగా, బ్రహ్మాండములోని పైనున్న మూడురూపము లును, ఆత్మయొక్కచైతన్యావస్థలోనే ప్రతిఫలించుటకువీలగును. జంతువులలో

గుదా, ఇంద్రియ, నాభిచక్రములలో మూడుగుణములకార్యములును జరుగుచున్నట్లు స్పష్టముగకనిపించును. వనస్పతులలో పువ్వులు ఆకులు తెరచు రాలిపోవుటయు, బీజోత్పాదనము, శరీరపోషణయు అనెడి యీమూడువిషయములును, అల్పపరిమాణములో నీమూడుగుణములప్రకటనమే అయియున్నది. పైనచెప్పినదానినిబట్టి బ్రహ్మాండముయొక్క ఆయుస్థానములకును, మనుష్యశరీరమందలి షట్చక్రములకును సంపూర్ణమైన పరస్పరానువర్తనము (complete corespondence) ఉన్నట్లు స్పష్టపడుచున్నదని మా యభిప్రాయము. కనుక నిపుడు పారమార్థికవిమర్శకు ప్రధానాదర్శమైనట్టి, అనగా ముఖ్యలక్ష్యమైనట్టి నిర్మలచైతన్యదేశము ఎచ్చటనున్నదో తెలిసికొనుటకు ప్రయత్నించుదము.

## 21. నిర్మల చైతన్యదేశము

ఇపుడింతవఱకు, మానవుని మనస్సు, అతని ఆత్మ కధీనమైయున్నదనియు, నది తనపనులను నెఱవేర్చుటకవసరమైన శక్తిని చేతనతను ఆత్మనుండియే పొందుచున్నదనియు, ఆత్మతోనే బంధించబడియున్నదనియు, తెలిసికొంటిమి. మానవుని మనస్సుపరిస్థితి యెట్లున్నదో, బ్రహ్మాండీమనస్సుయొక్క పరిస్థితికూడ సరిగనట్లేయున్నది. ఈపై విమర్శవలన ఆత్మకును మనస్సునకునుగల అంతస్సంబంధమునుగుఱించి ప్రకాశమెక్కువగనే కలుగుచున్నదికాని, నిర్మలచైతన్యదేశ మీసృష్టిలో నెచ్చటనున్నదనువిషయము మాత్రము తెలియుటలేదు. అందుచే మనమీవిషయమును తేల్చుకొనుటకై మఱొకవిధముగా విమర్శచేసెదము.

ఆత్మపైనుండి స్థూలశరీరమును (దాని వివిధ సూక్ష్మరూపములతో సహితముగ) తొలగించినపుడు, దానికి, అనగా జీవాత్మకు, శక్తులన్నియు వృద్ధిపొందునవనియు, ననేకక్రొత్తశక్తులుగూడ మేల్కొంచునవనియు, నింతకుముందు 13వ ప్రసంగములో తెల్పియుంటిమి. మఱియు 9వ ప్రసంగములో, ఆత్మకు, తన వివిధచేతనక్రియలను నెఱవేర్చునిమిత్తమై, మనస్సొకసాధనముగ పనిచేయుచున్నదనియు, ఆత్మయొక్క చైతన్యధార మనస్సునుండి వెనుకకుమఱలిపోయినపుడు, మనస్సు పూర్తిగనిష్క్రియమైపోవుననియు, చెప్పియుంటిమి. అందువలన ఆత్మకు, స్థూలశరీరమెట్లో మనస్సుకూడ నట్లే, ఒకకోశమని నిశ్చితమగుచున్నది. ఆకారణమువలన, ఆత్మపైనుండి స్థూలశరీరమనెడి కోశము తొలగిపోయినపు డెట్టిఫలితములుగల్గెనో, మనఃకోశము తొలగిపోయినపుడుకూడ సరిగనట్టి ఫలితములే చేకూరవలయును, అనగా, మనస్సనెడియావరణము తొలగినప్పుడు

జ్ఞానము గలుగును. దీనిపైన తాకిడిగలిగినపుడు శరీరమందంతటనున్న సూక్ష్మ రంధ్రములలో వ్యాపించియున్న జ్ఞానేంద్రియధారలు ఆతాకిడిప్రభావమును (అంతర్యామునన్న) జ్ఞాతవఱకు గొనిపోవును. ఈ రంధ్రములు కప్పడిపోయినను లేదా వానినుండి జ్ఞానేంద్రియధారలు లుప్తమైపోయినను, మానవుని కెట్టిస్పర్శ జ్ఞానము గలుగనేరదు. ఇతరేంద్రియముల పరిస్థితికూడ స్పర్శేంద్రియముయొక్క పరిస్థితివంటిదే. అనగా ప్రతి ఇంద్రియమునకు నొక సాధనము, అనగా, ప్రత్యేక ద్వారము ఉండి ఆసాధనములో ఆఇంద్రియవిషయములకు సంబంధించిన ప్రత్యేక పదార్థముండును. జ్ఞానేంద్రియధార లాసాధనములోని ప్రత్యేకపదార్థము నంటి పెట్టుకొని యుండును. ఇప్పుడు చక్షురింద్రియమును ఉదాహరణగా తీసికొందము. కండ్లలోనినాడి (optie nerve) యందుగల ప్రకాశమే దర్శనేంద్రియముయొక్క ప్రత్యేకపదార్థము. ఈపదార్థమునకు బాహ్యప్రకాశముతో సంసర్గము కలిగినపుడు దాని జ్ఞానము ద్రిష్టకు కలుగుచున్నది. ఈవిషయమును స్పష్టపఱచుటకై బాహ్యప్రకాశమువలన చక్షురింద్రియముపైగలిగెడి ప్రభావమును పరిశీలించెదము. బహిఃప్రకాశము మొట్టమొదట అక్షిముకురము (crystalline lens of the eye) లో ప్రవేశించి కంటితెర (Retina) మీద బాహ్యవస్తువులఛాయలను లేక ప్రతిబింబములను పడునట్లుచేయును. పిమ్మట ఈ ఛాయలజ్ఞానము చక్షుర్నాడి (optic nerve) మూలమునను, అందలి జ్ఞానేంద్రియధారమూలమునను ద్రష్టవఱకు జేరుకొనుచున్నది. ఈనాడిలో తేజస్సు ఉండుటచే నిది ధగధగ ప్రకాశించుచుండును. జ్ఞానేంద్రియమునకు బాహ్యప్రకాశముతో సంసర్గ మీతేజస్సు మూలముననే గలుగుచున్నది. అటుపిమ్మట, జ్ఞానేంద్రియధారలు దర్శన క్రియను పూర్తిచేయును. దర్శనేంద్రియమువిషయములో చెప్పినఅంశములు ఇతరేంద్రియములవిషయములోగూడ, నందుకుతగినమార్పులతో, వర్తించును. (తృతీయభాగము 97వ ప్రసంగమును చూడుడు) కాబట్టి విశ్వసృష్టియొక్క జ్ఞానమును పొందుటకు సూక్ష్మప్రపంచము, అనగా, మానవ శరీరముయొక్క రంధ్రములలోనున్న (విశ్వసృష్టిలోని పదార్థములతోను శక్తులతోను సంబంధము గల్గిన) అనురూపపదార్థములతోను, శక్తులతోను చైతన్యధారకు (జ్ఞానేంద్రియధారకు) సంసర్గము కలుగుట యావశ్యకమని విశదమవుచున్నది. అటులనే మనుష్యుని శరీరములోనిచక్రములకు, అఖండప్రపంచములో వానికి సంబంధించియున్న మండలములతో సంబంధముకూడ, నిదే నియమమునననుసరించి గలుగును. కాని యీసంబంధమేర్పడుటకొను నిమిత్తమై, యొక ప్రత్యేకసాధన

నభ్యాసముచేయుట యావసరము. ఏలనన, చక్రములలో నిద్రాణములైయున్న గుప్తశక్తులు, సాధనమూలముననే మేల్కొంచుటయు, అందుమూలముగా ఆ చక్రములకు బాహ్యప్రపంచములోని మండలములతో సంబంధమేర్పఱచుకొన గలసామర్థ్యము చేకూరుటయు, జరుగును. అఖండప్రపంచములోని సంహార శక్తిరూపుడగు శివుని పుత్రుడైన గణేశు డీసృష్టిలోని నిమ్నతమమండలమున కధిపతి. ఈ మండలముతో ననువర్తించుచు మానవశరీరములో నట్టడుగునయున్నట్టి చక్రముయొక్క ఆంతరంగికఛిద్రమును అందలిగుప్తశక్తిని మేల్కొల్పుకొన్న యెడల నభ్యాసికి గణేశునితోను, గణేశునిమండలముతోను, సంబంధమేర్పడి అతనిలో గణేశునియొక్క శక్తులు లక్షణములును కొంతమట్టుకు జనించును. అదేప్రకారము శేషించిన పంచచక్రములకుకూడా విశ్వసృష్టిలోని తత్సంబంధమండలములయిదింటితోను సంయోగము కలుగజేసికొనవచ్చును. మనకు దృష్టిగోచరమైన, సూర్యచంద్రనక్షత్రాదులతో నిండిన సృష్టిభాగమంతయు, నాఱుఉపభాగములుగ విభాజితమైయున్నది. మనుష్యశరీరములోని ఆఱుచక్రములు, నీ యాఱుఉపభాగములతో ననువర్తించును. ఈసృష్టిభాగమునకుపైన బ్రహ్మాండీమనోదేశమున్నది. కాని, యీదేశమునుగుఱించినజ్ఞానము మనస్థూలేంద్రియములకు ఎట్టియంత్రసహాయమున్నను పొందశక్యముగాదు. ఈ గ్రంథము తృతీయభాగములో బ్రహ్మాండీమనోదేశముయొక్క మండలములను గుఱించియు నిర్మలచైతన్యదేశముయొక్క స్థానములనుగుఱించియు, సవిస్తరముగ చెప్పబడును కావున నావివరముల నిచ్చట విస్తరించుటలేదు. బ్రహ్మాండీమనోదేశమండలములతోను, నిర్మలచైతన్యదేశముయొక్క స్థానములతోను సంబంధ మెట్లేర్పఱచుకొనసాధ్యమగు ననువిషయముమాత్రమే ప్రస్తుతము వివరించెదము,

## 23. మస్తిష్కముద్వారా సాగించెడి పనులు.

మానవశరీరములో మెదడు ఒక అత్యద్భుతావయవము అయినను, జనులకింతవఱకు, దాని వివిధభాగములకృత్యములను గుఱించి సమగ్రముగ బోధపడలేదు. శరీరములోని క్రిందిభాగములచే సక్రమముగ పనిచేయించుటకై మెదడులో వెవ్వేఱువిశిష్టభాగములు అనగా వాక్శక్తికేంద్రము, చలనక్రియాకేంద్రము మొదలగు వెవ్వేఱుకేంద్రములున్నవని తెలుసుకొన్నమాట నిజమే. ఇవంతయు తెలిసికొన్నను మస్తిష్కముయొక్క క్రియాకలాపమును గుఱించి

ఇంతవఱకు మనకు చేకూరినజ్ఞానము. ఈఅద్భుతసాధనములోనున్న విచిత్రమైన యేర్పాట్లను (economy) బట్టి చూచినట్లైతే అతిస్వచ్ఛమైన మిడిమిడిజ్ఞానమే. ఇందుకు సంపూర్ణమైన సమర్థనము ఈక్రింద చెప్పబోవు విషయములవలన లభించును. ఏమానవుడైనను సమాధ్యవస్థలోగాని క్లోరోఫారమ్ వాసనచూచుటచే స్మృతితప్పిపోయినయవస్థలోగాని యున్నాడనుకొనుడు. ఆ పరిస్థితిలో మానవ శరీరములోని షట్చక్రములయుత్పత్తికి అధారభూతమని యెంచబడు మస్తిష్కములోని శ్వేతధూసరపదార్థములు రెండునుకూడ స్థూలశరీరమువలెనే నిష్క్రియమైపోవును. దీనినిబట్టి ఆత్మనివాసస్థానము మస్తిష్కపదార్థములోగాక ఆమస్తిష్కపదార్థఘట్టమునుండిభిన్నమైన మఱొకఘట్టములో నుండియుండునని స్పష్టమగుచున్నది. ఇంతియగాక జ్ఞానసంపాదనక్రియ సాగించు స్థానముకూడా మస్తిష్కపదార్థఘట్టముకంటె భిన్నమైనఘట్టమున నుండవలయుననికూడ నిశ్చితమగుచున్నది. క్షుద్రతరగతిజంతువులలో, క్రిందితరగతులకుపోయినకొలది మస్తిష్కము నుపయోగించునవసరము తగ్గిపోవుచు చిట్టచివర కొకరకమైన క్షుద్రతమజంతువులు మస్తిష్కము నించుకేని యుపయోగించనవసరము లేకుండగనే జీవించగలుగుచున్నవి. సృష్టిక్రమములో మనము జంతుయోనికన్న నీచయోనులను పరిశీలించి చూచినచో వానిలో మస్తిష్కమునకు నామరూపములుగూడ లేకుండగనే ఆహారజీర్ణక్రియయు ఇతరజీవనధర్మములును యథాప్రకారము జరిగిపోవుచున్నట్లు తెలియుచున్నది. వనస్పతులలో నరములుగాని చక్రములుగాని లేకపోయినను శరీరముయొక్క పుష్టిపోషణలు నిరంతరము జరుగుచునేయున్నవి. దీనినిబట్టిచూడగా నాడులు చక్రములు (నాడులన్నిటికి శక్తినిచ్చు భండారమని చెప్పదగిన] మెదడును స్థూలశరీరముయొక్క పాలన పోషణకార్యము నెఱవేర్చునిమిత్తముకాక అంతకన్న ప్రధానమైన మఱొక ముఖ్యకార్యముకొఱకై రచించబడినవని స్పష్టముగాబోధపడును. ఇవి వాస్తవమునకు చేతనాత్మకక్రియలు నెఱవేర్చునిమిత్తమే రచించబడినవనియు వీని కృత్యములలో జ్ఞానసంపాదనయు [Perception] సంకల్పక్రియయు (Volition) ప్రధానమైనశాఖలనియు తెలియుచున్నది. అయినను జ్ఞానసంపాదనశక్తియు సంకల్పశక్తియు తమపనిసాగించుకొనుటకై నాడులువగైరాలమీద నెల్లపుడు నాధారపడియుండుటలేదు. 10 వ ప్రసంగములో ప్రేతజీవులకు నాడీమండలము వగైరాలు లేకపోయినను అవి సంకల్పక్రియజ్ఞానగ్రహణక్రియలను జరిగించుచునేయున్నవని తెలియపఱచితిమి. ఇంతియగాక సమాధ్యవస్థలో నాడులు

నిష్క్రియమైపోయినపుడు, ఒక్కొక్కప్పుడు మానవునిలో నద్భుతశక్తులు మేల్కాంచుచున్నవి. దీనినిబట్టికూడ పైవిషయమునకు సమర్థనము చేకూరుచున్నది. ఇట్టిశక్తులు మేల్కాంచుటచే నట్టిశక్తులు మానవునిలో గుప్తముగ నున్నట్లును తగినసాధన నభ్యాసముచేయుటచే నట్టియభ్యాసీపురుషునిలో ప్రేత జీవులకును అంతకన్న నుత్తమజీవులకునుగల గొప్పగొప్పశక్తులు, అనగా ఇతరుల మనస్సులోని ఆలోచనలను తెలిసికొనుట, స్థూలశరీరము ప్రవేశించలేని స్థలములనుండి వస్తువులను తీసుకొనివచ్చుట, మున్నగుశక్తులు జాగృతినొందగల వనియు తేటపడుచున్నది. ఇంతియగాక మానవశరీరములో చేయబడిన చైతన్య సంబంధమైన యేర్పాట్లు, సామాన్యజనుల ఊహాలను అభిప్రాయములను ఎంతో యెక్కువగ మించిపోవునంత అద్భుతమైనవనికూడా తేలుచున్నది.

నిత్యము మానవశరీరములో (అనగానాడీమండలమునుకూడాకలుపుకొని) ముప్విధములైనక్రియలు జరుగుచున్నవి: (1) ఆశరీరమునకు ప్రాణమునిచ్చుట, అనగా చైతన్యమునుగలుగజేయుట (2) దానిచైతన్యమును నిలబెట్టి స్థిరముగ నుంచుట (3) ఇంద్రియాదులద్వారా ప్రపంచమునుండి సంస్కారములను గ్రహించి అందుకనుగుణముగ ప్రవర్తించుట. ఈత్రివిధమైనక్రియలలో మానవ జీవనముయొక్క సామాన్యశారీరికమానసికావస్థలన్నియు చేరియున్నవి. ఈ ముప్విధమైన క్రియాఘట్టములకు నాధారభూతముగ నాడీమండలములో ననేక సూక్ష్మఘట్టములుగలవు. మనుష్యశరీరములోని ప్రతిచక్రముయొక్క యంతర తమభాగమునకు దానికిసంబంధించిన సూక్ష్మఘట్టముతో నాంతర్యసంబంధ ముగలదు. ఈసూక్ష్మఘట్టములు చక్రములద్వారా పరిభావితముగావింపబడి నపుడు (అనగా ఈచక్రములమూలమున సూక్ష్మఘట్టములను పనిచేయునట్లు చేసినపుడు) వెంటనే ఆయాచక్రములకుసరియైన బాహ్యమండలములతో (అనగా యీవిశ్వసృష్టిలోని మండలములతో) సంబంధము స్థాపితమై యభ్యాసిలో ఆయామండలాధిపతులశక్తులు మేల్కాంచును. మనుష్యశరీరమందలి క్రింది చక్రములన్నిటి నుత్పాదనచేసిన మానవుని (మెదడు) మస్తిష్కములోకూడ నట్లే సూక్ష్మఘట్టములున్నవి. కాని యీసూక్ష్మఘట్టములకు మనదృష్టికిగోచర మైనజగత్తుతో నేమియుసంబంధములేదు. ఆసూక్ష్మఘట్టములు బ్రహ్మాండీ మనస్సుయొక్కయు ఆత్మభండారమైనపరమేశ్వరునియొక్కయు దేశములకు సంబంధించియున్నవి. మస్తిష్కములోని సూక్ష్మఘట్టములగుప్తశక్తులు మేల్కాంచినపుడు బ్రహ్మపురుషునితోను పరమపురుషునితోను సంబంధమేర్ప

డును. ఇదియే మానవుని మస్తిష్కముయొక్క మహిమాతిశయమునకు కారణము. ఇంకనీయుత్తమతరగతి సూక్ష్మఘట్టములు మానవమస్తిష్కములో నెచ్చటనున్నవో తెల్పబోయెదము.

## 24. మెదడునందలి ఛిద్రములు.

మస్తిష్కముయొక్క రెండుభాగములమధ్యనున్న చీలికలో పండ్రెండు ఛిద్రములుగలవు. ఈద్వాదశఛిద్రములద్వారా బ్రహ్మాండముయొక్క ఆఱు ఉపభాగములతోను, నిర్మలచైతన్యదేశముయొక్క ఆఱుఉపభాగములతోను సంబంధమేర్పఱచుకొను సావకాశమున్నది. మస్తిష్కములో ధూమ్రవర్ణపదార్థములో బ్రహ్మాండదేశమండలములకు సంబంధించిన ఆఱుఛిద్రములును, శ్వేతపదార్థములో నిర్మలచైతన్యదేశమునకు సంబంధించిన ఆఱుఛిద్రములును గలవు. మెదడులోని శ్వేతధూమ్రవర్ణములుగల స్థూలపదార్థమున కెట్టిప్రత్యేక మహిమయు లేదు. నిజమైనమహిమ మానవశరీరమునకు బ్రహ్మాండనిర్మల చైతన్యదేశములతో సంబంధముగలుగజేయుచున్నట్టి, ఆఛిద్రములలోనియంతరతమస్థానములకే కలదు. కావున మన కాయంతరతమస్థానములను గుఱించి విమర్శ ముఖ్యావసరము. మాయభిప్రాయము నొకదృష్టాంతముచే నెక్కువ విశదము చేయవచ్చును. మేము చెప్పబోవు దృష్టాంతము కొంతస్థూలమేయైనను, అది మాయభిప్రాయము నవగాహనచేసికొనుటలో తప్పకతోడ్పడ గలదు. ఒక చీకటిగది యున్నదనుకొనుడు. దానిగోడలలో నొకగోడలో నొక చిన్నరంధ్రముండి, ఆరంధ్రముద్వారా సూర్యకిరణము లా గదిలోనికి ప్రసరించుచున్నవనుకొనుడు. ఆరంధ్రము కుడ్యము (గోడ) యొక్క పదార్థముతో నేర్పడలేదు. పైగా ఆరంధ్రము కుడ్యములోనేయున్నను, ఆరంధ్రస్థానములో కుడ్యపదార్థము లోపించుటవలననే అది యేర్పడినదని జ్ఞాపకముంచుకొనవలెను. ఆగదిలోనున్నమానవుడు సూర్యకిరణములుచూడగోరినను, లేక ఆకిరణములపై స్వారీచేసి సూక్ష్మరూపమున గదిలోనుండి బయటకు రాదలచినను, అతడారంధ్రద్వారమువద్దకు రావలసియుండును. అటులనే మానవుడు ఉన్నతమండలములతో సంసర్గమేర్పఱచుకొనగోరినను, లేక మనుష్యశరీరమనెడి చీకటిగదినుండి బయటకువచ్చి బ్రహ్మాండదేశముయొక్కయు, దానిపైదేశముయొక్కయు, మండలములలో ప్రవేశించగోరినను అతడు తనమస్తిష్కములోని ఛిద్రముల యంతరతమస్థానముల నన్వేషించుకొని వానివద్దకు వెళ్ళవలసి యుండును.

ఇచ్చట మేము మస్తిష్కమునుగురించి కొన్నివిషయములను శబ్ద ప్రమాణరీతిని (అనగా మామాటపైన విశ్వాసముంచి తెలిసికొనవలసినదే కాని మఱొక ప్రమాణము లేకుండ) చెప్పితిమని యొప్పుకొనుచున్నాము. కాని ఆవిషయములకు ఆధారము వట్టిమాటలపైననే లేదు. ఎవ్వరైనను మస్తిష్క స్థానములను మేల్కొల్పుటకువిధించబడిన సాధనను కొంతకాలమభ్యాసము చేసినచో నతనికి పైనచెప్పిన యంశముల యథార్థతనుగురించి సంపూర్ణ ప్రమాణము స్వతస్సిద్ధముగ లభించగలదు.

## 25. సాధనల నభ్యాసముచేయుటచే చేతనత యభివృద్ధినొందును.

ఉన్నతచైతన్యమండలములతో సంసర్గమేర్పఱచుకొనునిమిత్తమై విధించిన సాధనల నభ్యాసముచేయుటచే నభ్యాసిలోని అంతరంగికశక్తి, అనగా, చైతన్యశక్తి చాలయెక్కువగా వృద్ధినొందునని ఇచ్చట విశదము చేయవలసియున్నది. అందువలన నుత్తమమండలముల చేతనత అనగా ఆధ్యాత్మికశక్తి అతనిలో ప్రవేశించి, అతడభ్యాససమయమున నంతర్ముఖుడై సమాధిలో నున్నప్పు డతనియాత్మయొక్క చైతన్యభాసమాత్రమువలననే అతని శారీరిక కృత్యములన్నియు బహుసుకరముగ నెరవేరిపోవుచుండును. సూర్యునియొక్క భాస సూర్యప్రకాశముకాకపోయినను, అది మానవునిచే కల్పించబడిన కాంతులన్నిటికన్న నెన్నిరెట్లు మించిపోయియున్నట్లే, అభ్యాసియైనవాని ఆత్మయొక్క చైతన్యభాసకూడ సామాన్యమానవులచైతన్యధారకన్న నెంతో బలవత్తరముగను చైతన్యవంతముగను ఉండును. ఆధ్యాత్మికసాధనల నభ్యాసముచేయుసమయములో జీవుడు, లోనికి మృత్యుస్థానమువఱకు ఆకర్షించబడినపుడుకూడా అతడు బాహ్యాంతరములలో సంపూర్ణస్మృతిగలిగియుండును. అట్టిస్థితిలో, అనగా, అభ్యాసి అంతర్యమున మృత్యుస్థానమును చేరుకొన్నపుడును, దానిని దాటి ఇంకనుపైకి వెళ్ళినపుడును, అతనికి తన శరీరముతోగల సంబంధము ప్రేత భూతమునకు దాని పూర్వశరీరముతో నున్నట్లేయుండును,

# ద్వితీయ భాగము

## ఆత్మను మేల్కొల్పి, దానిని అంతర్యామున నారోహింపజేయునిమిత్తమైన సాధనల వర్ణన.

---

### 26. ఆత్మను మేల్కొల్పుకొనవలసిన యావశ్యకత

అఖండప్రపంచకమునకును, సూక్ష్మప్రపంచమునకును, (అనగా మానవ శరీరమునకును) పరస్పరానువర్తనమునుగురించి మేము చేయవలసిన విమర్శ పూర్తియైనది. జీవాత్మయొక్క నివాసస్థాన మెచ్చటనున్నది, ఆత్మ కే మండలమునందు జేరుకొనినపిమ్మట క్షయవికారరహితమైన పరమానందము చేకూరగలదు, అను నీ రెండువిషయములనుగురించిగూడ విశదపర్చితిమి. ఇప్పు డాత్మ మూర్ధమధ్యమందుగల మండలములన్నింటిని దాటి, వికారరహితమైన యావశమానందమండలమునప్రవేశించుటకుపయోగించు సాధనలను, ఉపాయములను గురించి వర్ణించుటమాత్రమే మిగిలియున్నది. కావున నిపుడాసాధనలనే వివరించబోయెదము.

ఈప్రయాణముచేయుటకై, మొట్టమొదట ఆత్మ తనగుప్తశక్తులను మేల్కొల్పుకొనుట యావశ్యకము. ఏలననగా, ఆత్మకు ఆశక్తులు మేల్కాంచి నపుడే నిర్మలచైతన్యధామమువఱకు ప్రయాణముచేయదగిన శక్తిసామర్థ్యములు చేకూరును. ప్రస్తుతము ఆత్మ సృష్టిలోని మాయికమండలములలోనికి వచ్చి, అక్కడేపడియున్నందున, దానియందు బాహ్యమునుండి పడెడు సంస్కారములును, ఆసంస్కారములమూలమున దానిలోగలిగెడిభావనలు, సంకల్పములును, నిమ్నతరగతిమాయికమండలములకు సంబంధించినవై యున్నవి. అందుచే ఆత్మయొక్క బహిర్ముఖధారలు, అనగా మనస్సుతోను స్థూలప్రకృతితోను సంబంధించినధారలు, ప్రబలములు మహావేగవంతములునై పోయి, దానియాంతర్య చైతన్యశక్తి మిక్కిలి బలహీనము శిథిలమును అనగా చైతన్యహీనమును అయిపోయెను. ఆత్మయొక్క బహిర్ముఖధారలు ఎట్టి సంస్కారముల మూలమున చైతన్యవంతములయ్యెనో, అట్టివిధమైనసంస్కారములనే ఆత్మనివాసస్థానమందు గలుగజేసిన యెడల, నవశ్యముగ ఆత్మయొక్కగుప్తశక్తులుగూడ మేల్కాంచి ఉన్నతమండలములకు ప్రయాణముచేయునిమిత్తమై ఆత్మకు అవసరమైన బలవేగములు కూడ స్వతస్సిద్ధముగనే చేకూరగలవు.

## 27. శ్రవణ, దర్శన, వచనములు, మానవజీవనమునకు ముఖ్యాంగములు.

ఆత్మశక్తి నేకత్రితముచేసి, అనగా మేల్కొల్పి ఆత్మనూర్ధ్వమండలముల కారోహింపజేయుగల సాధనల మూలసిద్ధాంతమును వివరించుటకుముందు, ఆవిషయవివరణమునకు సహాయకరమైన ఒకటిరెండితరలవిషయములనుగూర్చి విమర్శించవలసియున్నది.

స్థూలప్రపంచములోని పదార్థములనుగురించి జ్ఞానమును సంపాదించుటకును, ఆజ్ఞానమును లేక అనుభవములను పైకిప్రకటించుటకును, ముఖ్యముగ చక్షుశ్శ్రోత్రవాగింద్రియములే యుపయోగించబడుచున్నవని, అనగా మానవశరీరముయొక్క అక్కరలను దీర్చుకొనుట కీమూడింద్రియములే ప్రధానమైనసాధనములని అందరకును తెలిసినవిషయమే. మరియు ఈ మూడింద్రియములను ఉపయోగించుట మానివేసినయెడల మానవుని చేతనశక్తులు అనగా మానసికశక్తులు సంపూర్ణముగ నశించినను నశించిపోవచ్చును లేదా జీవిత మెక్కువకాలము నిల్వలేనంతయధికముగ నవి క్షీణించినను క్షీణించిపోవచ్చును. ఏలననగా, మనము కండ్లతో చూచుటయు, చెవితో వినుటయు కట్టిపెట్టినచో మనమిక నేవిషయమునుగురించి ఆలోచింతుము లేక తల్చుకొందుము? మరియు మనము నోటితో బొత్తిగ మాట్లాడుటయే మానివేసినచో, నితరులకు మనయూహలు, భావములును తెలియుటెట్లు, మనఆవశ్యకతలు తీరుటెట్లు ? ఇట్టిపరిస్థితిలో మనమస్తిష్కశక్తులెట్లు సజీవముగనుండగలవు ? మనముమాత్ర మెంతకాల మట్లు బ్రతుకగలము ?

ఇచ్చట చెప్పినదంతయు స్థూలఘట్టమునకు సంబంధించినదేఅయినను, అనగా స్థూలశరీరముయొక్క యింద్రియములకు సంబంధించినదే అయినను, సూక్ష్మఘట్టములకును అంతకన్న పైఘట్టములకును సంబంధించిన యింద్రియచైతన్యశక్తులవిషయములోగూడ నీసిద్ధాంతములే వర్తించును. అనగా ఈ సూక్ష్మతరఘట్టములకు సంబంధించిన యింద్రియములు క్రియాశూన్యముగనుండిపోయినయెడల ఆయాఘట్టములకుసంబంధించిన సూక్ష్మదేహములయొక్క చైతన్యశక్తులుకూడ నశించిపోవును. అయినను, స్థూలశరీరమును సజీవముగనుంచుటలో సూక్ష్మేంద్రియముల కేమియు ప్రసక్తిలేదు కావున, అవి శిథిలమైపోయినందువలన మనుష్యజీవనమున కెట్టియుపాయము సంభవించనేరదు. కాని మానవులు సామాన్యముగ నీయింద్రియములను క్రియాశీలముగ చేయు

నిమిత్తమై యేదేని సాధనముగాని, వ్యాయామమునుగాని నియమముగా చేయుటలేదు కావున, నవియన్నియు పనికిరాకుండనుండిపోయి, ఆసూక్ష్మేంద్రియము లేయుద్దేశ్యముతో మానవశరీరములో నుంచబడినవో, ఆయుద్దేశ్యము విఫలమైపోవుచున్నది. రాధాస్వామీమతములో చెప్పబడిన భక్తివిధానము అభ్యాససాధనలును ఈమూడుశక్తులను మేల్కొల్పునిమిత్తమైన యాధ్యాత్మిక సాధనలు. వానివివరము లీక్రింద చెప్పబడినవి:-

(1) మొదటిది:- చైతన్యనామమును ఆత్మజిహ్వాతో అనగా శ్రద్ధాధారతో నుచ్చరించుట (2) రెండవది:- చైతన్యరూపమును ధ్యానముచేయుట (3) మూడవది:- చైతన్యశబ్దమును శ్రద్ధాపూర్వకముగా వినుట.

ప్రేతజీవులు స్థూలశరీరఘట్టమందు వ్యక్తమైనపుడు వారు శ్రవణ, దర్శన, సంభాషణక్రియలను మూడింటిని జరుపుచున్నారు. దీనినిబట్టి ప్రేతజీవులకు ఈ కృత్యములను నెఱవేర్చుటకు తగిన సూక్ష్మేంద్రియములున్నవనియు నీసూక్ష్మేంద్రియములమూలముననే ఆప్రేతజీవులకు, స్థూలేంద్రియముల కగోచరమైన సంభవములనుగుఱించి జ్ఞానముకలుగుచున్నదనియు స్పష్టపడుచున్నది. ఇంతియుగాక శ్రవణ, దర్శన, సంభాషణక్రియలు స్థూలఘట్టమునందేగాక, సూక్ష్మఘట్టములందుకూడ నిరంతరముజరుగుచున్నవనియు ఆ ఘట్టములందీక్రియల ప్రభావము స్థూలఘట్టముకంటె నెక్కుడువిశాలపరిమాణములో నుండుననియు కూడ స్థిరపడుచున్నది. కావున చైతన్యశక్తిని మేల్కొల్పుటవిషయములో మేము చెప్పినసాధనలు కేవలముకల్పనావిషయములుగావని తేటపడగలదు. కావున వైజ్ఞానికసిద్ధాంతములవిమర్శసందర్భములో చూపెడి ఆదరభావము వంటి ఆదరభావముతోనే ఈవిషయములనుగూడ పరిశీలించుటన్యాయము.

## 28. రచనాశక్తులు గూఢరీతిని పనిచేయుచున్నవి.

ఈసృష్టిలోగల మూడుపరిమాణములుగల వెవ్వేఱుఖండములలో పనిచేయుచున్నరచనాశక్తులు ఒక్కొక్కఖండములో నొక్కొక్కతరహాకు చెందిన సూక్ష్మత తైక్ష్ణ్యమునుగల్గినవై, ఒకఖండములోనిశక్తులకు మఱొక ఖండములోపనిచేయుచున్నశక్తులపై నెట్టిప్రభావములేకుండులాగున వానికిప్రబంధము చేయబడినది. ఇట్టికట్టుపాటు లేనియెడల ప్రస్తుతము సృష్టిలోనున్న తరహాల వారీగాచేయబడినప్రబంధము (Gradational arrangement) నిలిచియుండుట

అసాధ్యమగుటయేగాక, పైగా నిమ్నతరమండలములలోని మత్తముఘట్టముల లోనున్న యున్నతతరగతిశక్తులు దిగివచ్చుటచే, విద్యుద్ధారామార్గములో నేదేని ప్రతిబంధకపదార్థమడ్డువచ్చినపు డెట్టిపరిస్థితులుగల్గునో అట్టిపరిస్థితులే గలుగగలవు. అనగా, విద్యుచ్ఛక్తి తన ధారామార్గమునకడ్డువచ్చిన ప్రతిబంధక పదార్థము నెట్లు దహించివేయునో అట్లే యున్నతమండలములశక్తులు నిమ్నతర మండలములకు దిగివచ్చినపుడు (ఈ నిమ్నతరమండలములపదార్థము హీనతరమై నది కావున నాశక్తులకు ప్రతిబంధకముగపనిచేయును) అవి అత్యుగ్రముగ వ్యక్తమై నిమ్నతరమండలములనన్నిటిని నాశనముచేసియుండును. ఈగ్రంథము యొక్క మూడవభాగములో, ఈపరిమాణత్రయముల వెవ్వేఱుగణములు, ఇంకను ఇత్యాదిఇతరగణములును, పరస్పరము సంబంధముగల్గియుండుచు, విడి విడిగాకూడ నెట్లుండునో వివరముగవర్ణించెదము. మనఇంద్రియములకు గోచర మైనఆవరణకు పైనున్నమండలములనుంచి దిగివచ్చి యీసృష్టిలోపనిచేయుచున్న అనేకమైనఅద్భుతరచనాశక్తుల అస్తిత్వమును నిరాకరించుట అయుక్తమను విషయముమాత్రమే ఇచ్చట చెప్పదల్చితిమి. ఈశక్తులతోపాటు మహాగంభీర మైనధ్వనులు ప్రతిధ్వనించుచు, ఆభ్యాసియొక్క అంతశ్శ్రోత్రములు అనగా సూక్ష్మశ్రవణేంద్రియములు తగినంతగ మేల్కొంచినపుడు అతనికి అవి గోచరమై అతనిపైన మహాప్రబలమైన ప్రభావమును గలుగజేయును. (ఈ విషయము ఈగ్రంథముయొక్క తృతీయభాగములో వివరించబోయెదము) ఆధ్వనులు ద్వివిధములు:- అందొకరకముధ్వనులు చైతన్యధ్వనులు. ఇవి యంతర్ముఖములై యాకర్షణశక్తి గల్గియుండును. రెండవరకము, జడప్రకృతికిని మనస్సునకును సంబంధించిన ధ్వనులు. ఈ ధ్వనులు మొదటిరకపుధ్వనులు ఏవైపునకున్ముఖముగనుండునో, దానికిప్రతికూలదిశవైపున కున్ముఖమైయుండును. (పూర్తివివరములకై 64వ ప్రసంగము చూడుడు.)

## 29. ప్రతిశబ్దములోను, ఆశబ్దమునుజనింపచేసినశక్తియొక్క ధర్మములుండును.

ఈప్రపంచములో పుట్టునట్టిశబ్దములన్నిటిలో, వానినికలుగజేయునట్టి శక్తియొక్క లక్షణములు అనగా ధర్మములు కలిసియుండును. ఉదాహరణార్థము, మనము తుపాకిమందుకాని అటువంటిమఱొకపదార్థముగాని ప్రేలుట వలనగలిగెడి ధ్వనినిగుఱించి విమర్శించెదము. ఎచ్చటనైన నట్టిపదార్థము ప్రేలినచో, నచ్చటనొకధూమము మితపరిమాణములో తత్క్షణమే బయల్వెడలి

దానిమూలమున చుట్టుపక్కలవస్తువులకు ఒకతీవ్రమైనదెబ్బ హఠాత్తుగా తగులును. ఆదెబ్బలోని ఆకస్మికత్వము,తీక్ష్ణతయు అనగా తీవ్రతయు ఆప్రేల్పుడు యొక్క ముఖ్యలక్షణములైయున్నవి. అందుచేతనే ఆప్రేల్పుడువలనగలిగెడి ధ్వనిలోకూడా ఈరెండులక్షణములును స్పష్టముగకన్పట్టుచుండును. ఇంతియు గాక మానవునిమాటలవలన గలిగెడి ధ్వనులలోగూడ నీ నియమమే కన్పట్టుచున్నది. ఏలనన, మానవునివచనములలో నెల్లప్పుడు నతనిమానసికస్థితియొక్క ప్రభావము తప్పక కనిపించుచుండును. ఒకమానవునిమనస్సున నెప్పుడేలక్షణము ప్రబలముగనుండునో, ఆలక్షణముగల ఆలోచనలుభావములునే ఆసమయములో అతనిమాట్లాడెడిమాటలలో ప్రకటమగుచుండును. అనగామానవునిలో క్రోధము, ప్రేమ, మున్నగునావేశములలో నేదైన ప్రబలముగనున్నపుడు వానిమానసికపరిస్థితి వానినోటనుండివచ్చినవచనములలో తప్పకప్రతిఫలించుచు నతనిమాటలమూలమున వ్యక్తముచేయబడు భావములు, ఆలోచనలు నతని మానసికావేశము ననుసరించియే యుండును. నిమ్నతరగతిచైతన్యముగల పశుజాతి తమమనస్సునగల సామాన్యభావములనుమాత్రమే తమధ్వనులచే వ్యక్తముచేయగల్గుచున్నవి. కాని మానవుడు స్వరరాగభేదములమూలమున బహువిధభావములను, బహురమణీయదృశ్యవర్ణనలను వివరముగా తెల్పగలుగుచున్నాడు. అసాధారణబుద్ధిశాలురు తమవచనములమూలమున గలుగచేయుప్రభావమే యిందుకు దృష్టాంతము. సామాన్యమానవులుగూడ ఉద్రేకపూరితమైనభావములకును ఆవేశములకును లోనైనపుడు వారందుకుతగినట్టి స్వరరాగములను మాటలను ప్రయోగించి తమమనస్థితిని విస్పష్టముగ వ్యక్తపఱచుచున్నారు. తల్లి తనబిడ్డతోబల్కెడి అల్లారుముద్దుపల్కులనుబట్టియు, మానవుడు మరణించినపుడు అతనిసన్నిహితబంధువులు చేయు విలాపములవలనను, రణరంగమందు వీరయోధులుచేయు సింహనాదములవలనను, మానవుని మనోభావములప్రభావ మతనిపల్కులందు ప్రకటమగునని స్పష్టముగ తేటపడును. తుచ్ఛమానవుడే తనశబ్దధ్వనులమూలమున నింతప్రబలప్రభావమునుత్పన్నము చేయగల్గినచో, సృష్ట్యారంభమున పరమచైతన్యశక్తియొక్క ప్రథమప్రకాశములో వెలువడినశబ్దమునుమూలమున నెంతమహాప్రబలమైన చైతన్యప్రభావము రచనలోగలిగెనో యూహించుకొనవచ్చును.

**30. చైతన్యశబ్దముయొక్క గతి యెల్లప్పుడు నంతర్ముఖముగనే యుండును.**

సామాన్యముగ నొకశక్తి ప్రకటమైనదని చెప్పినపుడు, అందఱును ఆశక్తి తనకేంద్రమునుండి బయల్వెడలి ఒకవృత్తపరిధివైపునకు ప్రసరించినద

నిదే అభిప్రాయపడుచుందురు. కాని క్రిందటిప్రసంగములో మేము చరమ శక్తినిగురించివ్రాసిన వివరణములో మాయభిప్రాయ మదికాదు. చైతన్యశక్తి ప్రకటమగుటయనగా అది తనగుప్తదశనుండి ప్రకటదశలోనికి మారుటయని మాయభిప్రాయము. చైతన్యశక్తియొక్క కార్యము అంతర్ముఖమును, ఆకర్షకమును అయియుండును. కాబట్టి, అది వ్యక్తమైనపుడు దానితోకూడ బయల్వెడలినశబ్దమునకుగూడ సృష్టిపైన ప్రభావము అంతర్ముఖముగను ఆకర్షణకరముగను ఉండవలెను. చైతన్యశక్తియొక్క ఈప్రథమావిర్భావముయొక్క స్వాభావికధర్మములు సమస్త చైతన్యశబ్దములందు సంకేతమైయున్నవి కావున, రచనలోని చైతన్యశబ్దములన్నిటిలోకూడ నీరెండు ధర్మములును ఉండుచున్నవి. అందువలననే ఆశబ్దములువినుటచే నభ్యాసియాత్మ అంతరంగమున కతితీవ్రముగ నాకర్షింపబడిపోవును. ఈయభ్యాసమును నియమముగ యథావిధిగా చేయుటవలన, నభ్యాసియాత్మ ఆయాచైతన్యశబ్దముల యుత్పత్తిస్థానములైన యున్నతమండలములవైపున కాకర్షింపబడును, అనగా, ఆరోహించును. ఆత్మ నూర్ధ్వలోకముల కారోహింపజేయునిమిత్తము శబ్దాభ్యాసమును ఒక ప్రధాన సాధనగా గణించుట కిదియే కారణము. కాని చైతన్యశబ్దములు మహాసూక్ష్మములు కావున మేముచెప్పబోవు మఱిరెండుసాధనల నభ్యాసముచేసి ఆత్మయొక్కగుప్తశక్తులను గొంతవఱకు మేల్కొల్పినప్పుడేకాని ఆశబ్దములను చక్కగావినుటకు సాధ్యముకాదు. అందువలననే యోగసాధనసందర్భములో శబ్దాభ్యాసము పైమెట్టుగా నిర్ణయించబడుచున్నది. అయిన నీకారణముచే శబ్దాభ్యాసమును చాలకాలము ఉపదేశమివ్వకుండ నావుచేయరు. పవిత్రనామస్మరణము, పవిత్రస్వరూపధ్యానమును, ఆఱువారములు లేదా రెండుమాసములు గాని అభ్యాసముచేసినపిమ్మట నీయభ్యాసము ప్రారంభించవచ్చును. ఇంక చైతన్యస్వరూపధ్యానము నామస్మరణము అనెడి సాధనాద్వయమును క్రింద వివరించెదము.

## 31. ధ్యానమును గుఱించిన తప్పుటభిప్రాయములు.

సృష్టినంతను స్థూలముగా, చేతనాత్మకము అచేతనము లేక జడము అని రెండు విధములుగా విభజించవచ్చును. చేతనసృష్టిలో మానవయోని సర్వోత్తమయోని కావున, మానవాకారమును ధ్యానముచేయుటయే సర్వోత్తమమైన చైతన్యరూపమును ధ్యానించుటయగునని యూహించవచ్చును. కాని

అట్లనుకొనుట సరికాదు. మానవుని చేతనత జాగ్రదవస్థయందుమాత్రమే వెలు గొందుచుండును. ఏలనన మానవుడీ ఒక్క అవస్థలోనున్నపుడే జ్ఞానసంపాదనము చేయగల్గుచున్నాడు. స్వప్నావస్థలోనున్నపు డతని చేతనత అనగా జ్ఞానసంపా దనశక్తి (Intelligence) తన మస్తిష్కమున నేర్పడినఛాయలమీాదనే (Impre ssions) ఆధారపడియుండి, సుషుప్త్యవస్థలో ప్రవేశించినతోడనే, యీచేతనత బొత్తిగా నశించిపోవుచున్నది. కావున మానవరూపముయొక్క ధ్యానము స్వల్ప చైతన్యములోను స్థూలజ్ఞానములోనుకూడిన స్థూలస్వరూపము లేక స్థూలకో శము యొక్క ధ్యానమేయగును కాని, శుద్ధచైతన్యరూపధ్యాన మెంతమాత్ర ము కానేరదు.

అటులనే పరమేశ్వరుని ఆకాశరూపముగా సర్వవ్యాపకమైయున్నట్లు భావించి ధ్యానముచేయుటకూడ శుద్ధచైతన్యరూపధ్యానము కానేరదు. ఏల నన, తుదకదియును స్థూలపదార్థముయొక్క మనఃకల్పితరూపమును ధ్యానించు టయే అగుచున్నది.

### 32 మానవుని మానసిక భావములు అతని ముఖముమీాద సవిశ్య ముగా ప్రతిఫలించును.

నిజమైన చైతన్యరూపమును ధ్యానముచేయువిధమును తెలియచెప్పుటకు ముందు, ఈవిషయమునే స్పష్టపఱచునిమిత్తమై మఱొక విషయము నిచ్చట వివరించవలసియున్నది. మానవుని ప్రబలమానసికభావము లతనిముఖముపై ప్రతిఫలించుచుండుననియు, నట్టిప్రభావము తఱచు ప్రకటమగుచుండుటవలన, నట్టి చిహ్నము లతనిముఖముపైన స్థాయిరూపమున నంకితమైపోవుననియు నిం తకుముందు 20వ ప్రసంగములో చెప్పియుంటిమి. కాని యీనియమ మొక్క ప్రబలభావములకేగాక నించుమించన్నిమనోభావములకుగూడ వర్తించును. సామాన్యజనులయితే ప్రబలమానసికభావములచిహ్నలను మాత్రమే ముఖముపైన గుర్తించగల్గుదురుకాని, అనుభవశాలురు ప్రవీణులును ఇతరుల ముఖవైఖరినిబట్టి వారిగుప్తభావములను శీలమునుగూడ తెలిసికొనగల్గు చున్నారు. దీనినిబట్టి మానవునిముఖముమీాద నతనిమనోభావముల ప్రభా వము తప్పక పడుచుండునని స్థిరపడుచున్నది. మన మింక మన విమర్శార్హమైన విషయమును గూర్చి ఆలోచింతము.

## 33. ముఖాకృతినిచూచుటచే మనస్సుపైన గలుగుప్రభావము.

ఒకమనిషిమాటలను వినినపుడు వానిమనోభావములవంటి భావనలే మనలోగూడ నెట్లుగల్గునో, అట్లే ఒకవ్యక్తియొక్కముఖాకృతినిగాని ముఖవైఖరినిగాని చూచుటవలన ఇంచుమించు వానిభావములవంటి భావములే మనలోకూడ నుత్పన్నమగును. ఇందుకుదాహరణలు లెక్కకుమించినన్నిగలవు. ఎట్లనగా: చూడుడు, ఒకప్రేమాతురునిముఖము నతనియందుప్రేమగల మఱొకవ్యక్తి చూచినపుడా వ్యక్తిలో ప్రేమభావముప్పొంగును. హాస్యగాండ్రయొక్కయు విదూషకులయొక్కయు, హాస్యరసపూరితమైన ఆకారములను చూచినంతనే అందఱికిని పట్టలేనంత నవ్వువచ్చును. ఇంతియుగాక, వారివేషము జ్ఞాపకమువచ్చినంతమాత్రముననే జనులకు నవ్వువచ్చుచుండును. ఇదేపద్ధతిననుసరించి, పారమార్థికభావములను పరమార్థసంబంధమైన ఉత్సాహాసక్తులను మనస్సులో ఉత్పన్నము చేసికొనునిమిత్తమై ఒక ముఖాకృతిని ధ్యానముచేయుట ఆధ్యాత్మిక పరిభాషలో చైతన్యస్వరూపధ్యానమని చెప్పబడును. శుద్ధచైతన్యస్వరూపమును ధ్యానముచేయుటవలననే వాస్తవమైన ఆధ్యాత్మికభావములు జనించగలవు కాని సామాన్యస్వరూపములను ధ్యానముచేయుటచే గలుగనేరవు. కావున నిపుడు శుద్ధచైతన్యస్వరూప మనగ నెద్ది యను ప్రశ్న పొడముచున్నది. ఈ ప్రశ్నకు సమాధానము చెప్పుటకు ముందు సిద్ధపురుషులనుగూర్చియు, వారి లక్షణములను గూర్చియు కొంత వివరించుట యవసరమని తోచుచున్నది. ఏలననగా ఈ ప్రశ్నకు సమాధానము నవగాహనచేసికొనుటకై అట్టి వివరణము కొంత సహాయకరముగ నుండును.

## 34. సిద్ధపురుషులలో తరహాలు.

ఈ గ్రంథములో నితఃపూర్వము సూక్ష్మప్రపంచమునకును అనగా మానవశరీరమునకును అఖండప్రపంచమునకునుగల యన్యోన్యానువర్తనమును గుఱించి చెప్పినసందర్భములో, నీరెండింటికిని సంబంధము, మానవశరీరములోనున్న చక్రములు మెదడునందుగలఛిద్రములద్వారా, ఏర్పడుచున్నదని తెల్పియుంటిమి. శరీరమందలి షట్చక్రములను మేల్కొల్పిన పురుషుడు ఈసృష్టిలో తృతీయ మహాఖండమైన మలినమాయాదేశముయొక్క సిద్ధపురుషుడుగ భావించబడుచున్నాడు. అతడింకను మృత్యుస్థానమును దాటకపోయినను స్వప్నసుషుప్తి

సూక్ష్మావస్థలనుదాటియుండును కావున, అతనికి, మనకండ్లకగుపించెడి యావ త్సృష్టియొక్కయు, దానిసూక్ష్మావస్థలయొక్కయు సంపూర్ణమైనపరిజ్ఞానము ఉండును. బ్రహ్మయొక్క, అనగా బ్రహ్మాండీమనస్సుయొక్క మొదటిస్థాన మును జేరుకొని మృత్యువును జయించినట్టి పురుషుని యోగి అందురు. అటులనే బ్రహ్మయొక్క ద్వితీయ తృతీయ స్థానములగు త్రికుటిని సున్నలోకమును చేరు కొన్న పురుషులను యథాక్రమముగ (వరుసగ) యోగీశ్వరులనియు, సాధువులు లేక మహాత్ములనియు నందురు. బ్రహ్మాండముపైనున్న నిర్మలచైతన్యదేశ మును జేరుకొన్న పురుషులను సంతులని పేర్కొందురు. నిర్మలచైతన్యదేశము యొక్క సర్వోన్నతస్థానమును, అనగా చైతన్యశక్తియొక్క ఆదిభండారమైనట్టి పరమపురుషుని నిజధామమును చేరుకొన్న మహాపురుషులు పరమసంతులని పేర్కొనబడుచున్నారు.

## ౩౯. చైతన్యస్వరూపధ్యానము

మానవునిమనమున నుత్పన్నమగు తీవ్రభావములన్నిటికిని అతని మన స్సులోని తీవ్రసంవేగము లేక సంక్షోభమే కారణము. కాని, జీవితకాల ములో మానవునిమనమున జనించగల తీవ్రాతితీవ్రమైన సంవేగముగూడ శరీర త్యాగానంతరమందు మృత్యుస్థానమును దానిపై స్థానములను అతిక్రమించు సమయమున జీవునిలోగలిగెడి మహాక్షోభతో పోల్చిచూచినయెడల నెంత మాత్రము గణనకురాదు. ఆసమయమున జీవునిగతి యంతర్ముఖముగ నుండు టచే, నాక్షోభయొక్క బాహ్యచిహ్నములు, సామాన్యమైన ఆవేశోత్సాహ ములు గల్గినపుడు కన్పడునంత ప్రబలముగ పైకి కన్పించ నేరవు. నాడులు, కంద రములు మున్నగునవన్నియు మరణమునకు కొద్దిసమయము ముందే మెలిపెట్టు కొననారంభించి, ఆమెలి మరణసమయమున బాహ్యశరీరముమీదకూడా దాని ప్రభావము స్పష్టముగ కన్పించునంత మహాప్రబలమైపోవును. యోగసాధనలను చేయుచున్నపుడుకూడా చాలనెమ్మదిగ నీపరిస్థితులన్నియు, నభ్యాసికిగలుగును. ఈ హేతువువలన నభ్యాసిశరీరపరిస్థితి పూర్తిగా మార్పుచెంది అతని నాడీమం డలము, కందరములు మున్నగునవన్నియు, మృత్యుసమయములో చైతన్య ధారలు అతనిశరీరమునుండి తొలగిపోవు సమయమున నట్టిప్రతిబంధము కలుగ జేయకుండునట్టి పరిస్థితిలోనికి మాఱిపోవును. అభ్యాసినాడీమండలము కందరముల యొక్క ఈలోలోపలిమార్పుల చిహ్నాలు కొద్దిగొప్ప బాహ్యముగా అతనిశరీ

రము మీఁదకూడా కన్పట్టుచునే యుండును. కాని వీనిప్రభావ మెక్కువగా ఆ
సూక్ష్మశరీరములయందు వ్యక్తమగుచుండును. సిద్ధపురుషులకు ఈ బా
చిహ్నములు ముఖ్యముగ వారినేత్రములందును మస్తకమందును, కన్పట్టు
డును. ఉత్తమభక్తులకు అట్టిసిద్ధపురుషులదర్శనముచేసికొన్నప్పుడు, వారిఆత్మ
ఆంతర్యమున కాకర్షింపబడి ఊర్ధ్వముగనారోహణ చేయుచున్నట్లనుభవము
పైకి స్పష్టముగ తెలియునట్లే, కలుగుచుండును. బ్రహ్మాండీ దేశమున ప్రవేశిం
సిద్ధపురుషుడు కండ్లకగుపడు సృష్టినంతటిని దాటిపోయి తనసామాన్యక్రియ
బ్రహ్మాండఘట్టములనుండియే జరిగించుకొనుచుండును. అతని ముఖమున
బ్రహ్మాండముయొక్క చేతనత ప్రకాశించుచుండును, అటులనే సంతులయొ
యు, పరమసంతులయొక్కయు క్రియలన్నియు నిర్మలచైతన్య దేశముయొ
చైతన్యధారలద్వారా జరిగింపబడుచుండును. దీనినిబట్టి బ్రహ్మాండమును
కొన్న సిద్ధపురుని స్వరూపధ్యానము బ్రహ్మాండదేశముయొక్క చైతన్యస్వరూ
ధ్యానమగుననియు, సంతుస్వరూపధ్యానము నిర్మలచైతన్యదేశముయొ
స్వరూపధ్యానమగుననియు పర్యవసానము తేలుచున్నది. ఈకారణమువల
సంతుమతములో సంతులు లేక పరమసంతుల స్వరూపమునుగాని,
అట్టివారు లభించనిపరిస్థితిలో, ఒకసాధువు లేక మహాత్మునిస్వరూపమును
ధ్యానించుట నిజమైన చైతన్యస్వరూపధ్యానముగా మన్నింపబడుచున్న
33 వ ప్రసంగములో మనము ప్రేమించినవారల స్వరూపము జ్ఞాపక
వచ్చినపుడు మనపై నెట్టి ప్రభావముగల్గునో వర్ణించితిమి. కాని సిద్ధ
షుల స్వరూపమును ధ్యానముచేసినపుడు భక్తజనులహృదయములందుగ
ప్రభావము అంతకన్న బహుగాఢముగను, తీవ్రముగను ఉండును. ఏలనన
ఆప్రభావము, ఆసిద్ధపురుషుల స్వరూపము జ్ఞాపకమువచ్చినందువలన మాత్ర
కలిగినది కాదు. సిద్ధపురుషులకు తాముదాటివెళ్లినట్టియు చేరుకొన్నట్టి
ఉన్నతస్థానములన్నిటి సూక్ష్మఘట్టములును అందుబాటులోనుండును కా
నేభక్తుడైనను వారిస్వరూపమును ధ్యానముచేసినపుడు తత్క్షణమే ఆవిషయ
వారికి తెలిసి వెంటనే వారు ఆభక్తునికి చేయువలసినసహాయసంరక్షణలను, అ
ధ్యానావస్థలోనుండగా అతనికి తెలియకుండగనే, చేయుచుందురు. అయినను అ
భవశాలురగుభక్తులుమాత్రమే తమఆత్మలకు ఆత్మస్థానమువద్ద ఆంతర్యగా
కర్షణకలుగుటను తెలిసికొనగల్గి ఆసహాయసంరక్షణలను గ్రహించుకొనగ
డురు. ఇంతియగాక సిద్ధపురుషులు తమభక్తులవిశ్వాసమును దృఢపఱచి ను
నోత్సాహపీడితులను వారిలో మేల్కొల్పునిమిత్తమై అప్పుడప్పుడు తమ తే

మతురూపముయొక్క క్షణికదర్శనములనుగూడ భక్తులకిచ్చు దివ్యేచ్ఛధరించుచుందురు.

సృష్టిలో రెండవమహాఖండము అనగా బ్రహ్మాండమువఱకు చేరుకొనిన సిద్ధపురుషుని స్వరూపధ్యానముచేయుటవలన నట్లు ధ్యానాభ్యాసముచేయువానికి చైతన్యశక్తి యభివృద్ధినొంది గొప్పఆధ్యాత్మికలాభము సేకూరుననుటలో సందేహములేదు. కాని నిర్మలచైతన్యదేశమును,అనగా సృష్టిలో నున్నతతమమైన, మహాఖండమును చేరుకొన్న సిద్ధపురుషునిస్వరూపమును ధ్యానముచేయునిదే అభ్యాసికి బ్రహ్మాండీమనస్సుతో సంబంధముపూర్తిగ తొలగిపోవునంతటియుత్తమ తరగతిచైతన్యము లభింపనేరదు, అనగా అంతవఱకు, బ్రహ్మాండీమనస్సుయొక్క సంపర్కము అభ్యాసియాత్మకట్టియుండిపోవును. ఈవిధమములో ఆధ్యాత్మికాభివృద్ధి సంపాదించుకొనునిమిత్తము నిర్మలచైతన్యదేశమును చేరుకొన్న మహాపురుషునియొక్కయు నట్టిపురుషుని నేతృత్వముకింద సాధనచేయుచుండెడి భక్తులయొక్కయు సహవాససాంగత్యములుకూడ నత్యావశ్యకము. ఏలననగా, అట్టి మహాపురుషుని నైజచేతనత మహాప్రభావముగలదై, ప్రధానముగా సత్సంగసమయములో దేదీప్యమానమగుచుండును. సత్సంగసమయములో గురుమహారాజువారి చైతన్యస్వరూపమును భక్తులు తమ యంతరంగమున విరాజమానమగుచున్నట్లు ధ్యానము చేసికొనుచుందురు. కావుననే వారు సద్గురుసాంగత్యమును మహాగౌరవభక్తులతో గోరుచుందురు. సంతులసత్సంగము యొక్క మహిమనుగుఱించియు, దానిఆవశ్యకతను గుఱించియు, రాబోవు 56వ ప్రసంగములో సవిస్తరముగ వివరించెదము.

## 36. సిద్ధపురుషులకు గల్గు నాల్గువిధములైన సిద్ధి.

సిద్ధపురుషులలో నింతకుముందు చెప్పిన తరగతులుగాక, ఒకేతరగతిలోనే, వారి వారి సిద్ధియొక్కతరహానుబట్టికూడా భేదములుగలవు. ఏలననగా, సిద్ధి నాల్గువిధములు:—

1. సాలోక్యసిద్ధి, అనగా, ఒకయున్నతలోకములోనికి ప్రవేశము మాత్రమే లభించుట.

2. సామీప్యసిద్ధి, అనగా, ఒకయున్నతలోకముయొక్క అధిష్ఠాతృశక్తి అనగా, అధిపతియొక్క సన్నిధానమును పొందుట.

3. సారూప్యసిద్ధి అనగా, ఒకయుత్తమలోకాధిపతి రూపమును ధరించ గలశక్తి గల్గియుండుట.

4. సాయుజ్యసిద్ధి, అనగా నొకయుత్తమలోకాధీశుని తత్త్వముతో నైక్యమైపోగలశక్తి నొందుట.

చివరిరెండురకములసిద్ధిని బొందినపురుషులకు తాము చేరుకొనినస్థానాధిపతితో కలిసి ఐక్యమైయుండుటకును, లేదా, కావలెనన్నచో వేఱుగనుండుటకునుగూడ స్వాతంత్ర్యముండును.

పై వివరణమునుబట్టి యేయభ్యాసియైన నొకయుత్తమలోకమును పొందవలెనన్నచో, దానిదిగువనున్న ప్రతిస్థానములో నతడు పైనాల్గురకముల సిద్ధులను సాధించుకొనవలసియుండునని తేటపడుచున్నది. అందువలన యోగియైనవాడు పిండదేశము అనగా మలినమాయాదేశముయొక్క ఆఱుస్థానములలోను బ్రహ్మాండీదేశముయొక్క క్రిందిమూడుస్థానములలోనుకూడ నీచతుర్విధసిద్ధి పొందియుండును.

## 37. సిద్ధపురుషుల అసాధారణశక్తులు.

ప్రసిద్ధపురుషునకును ఏదైననొక యున్నతస్థానమునుపొందినపుడు ఆ స్థానముయొక్కశక్తులతనిలో కొంతవఱకు ప్రకటమగును. ఆ యుత్తమలోకాధిపతితో సాయుజ్యగతి సిద్ధించినయెడల నాయధిపతియొక్క సమస్తశక్తులు, మహిమలుగూడ నతనికిసంక్రమించును. పై విషయములనుబట్టి ఇట్టి మహాశక్తులు సంపాదించినసిద్ధపురుషులు తమశక్తిమహిమలను ప్రకటించినచో ప్రపంచములో నందఱకును వారిమహిమనుగుఱించి విశ్వాసముగల్గునుకదా, వారేల నామహిమలను ప్రకటముచేయుటలేదు అనెడిప్రశ్న సహజముగ పొడమవచ్చును.

## 38. అద్భుతములు, విచిత్రములు.

పై ప్రశ్నకు సమాధానముచెప్పకముందు వెవ్వేఱుఅవతారములు, ప్రవక్తలుమున్నగువారు జరిగించినట్లుచెప్పెడి విచిత్రములనుగుఱించి సంక్షేపముగవిమర్శించుట యుక్తము. శ్రీరామచంద్రుడు, శ్రీకృష్ణుడు, గౌతమబుద్ధుడు యేసుక్రీస్తుప్రభువు, మహమ్మదుప్రవక్త మొదలగువార లట్టి యసాధారణశక్తులను స్పష్టముగసూచించునట్టి మహాద్భుతకార్యములనుచేసినట్లు చెప్పుదుం

దుకు. వీరియద్భుతక్రియలలోని సమానధర్మములు పరిశీలించినయెడల వానిలో సామాన్యముగా ఆపన్నివారణము శరణాగతరక్షణము విశ్వాసహీనులకు విశ్వాసముపుట్టించుటయు లేదా అట్టివారిని పరాజితులనుచేయుటయు,మున్నగు లక్షణములే కాన్పించుచుండును. అయినను యీ యద్భుతములుచేయుటలో ఒకనియమముగాని పద్ధతిగానియున్నట్లు కన్పించదు. అనగా, ఈఅద్భుతములు నిరంతరము జరిగించబడుచుండినట్లుగాని, లేదా అవన్నియు నొకేపద్ధతిని లేక ఒకేనియమమును అనుసరించి జరిగించబడినట్లుకాని కనపడదు. కొన్నిప్రత్యేక సమయములందుమాత్రమే అట్టిపనులుజరిగించబడినట్లు కన్పించును. మఱియు పైనచెప్పినయుద్దేశ్యములను సాధించునిమిత్తముకూడా యెల్లప్పుడు నీయద్భుతములనే చేసిచూపినట్లుకూడా కనపడదు. పైగా ఇందుకుప్రతికూలముగా పెక్కుసార్లు యేసుక్రీస్తు, మహమ్మదు,ఇతరఅవతారపురుషులును, తమకు తమభక్తులను కును అపజయమును, విశ్వాసహీనులకు విజయమునుకూడ, చేకూరనిచ్చిరి. దీనినిబట్టిచూడగా అద్భుతములు విచిత్రములును భక్తరక్షణనిమిత్తముగాని, దుఃఖబాధానివారణనిమిత్తముగాని కార్యవిజయమునిమిత్తముగాని అనుదినము నుపయోగించవలసినసాధనములు కానేరవని విశదమగును. ఇపుడు తేలినపర్యవసానము 37 వ ప్రసంగముచివర తెలియజేసిన పూర్వపక్షమునకు సరియైనసమాధానమునిచ్చుటలో చాలసహాయముకల్గించుచున్నది. మఱియు దీనినిబట్టి లోకములో తమాషాకొఱకై గొందఱుప్రదర్శించుచున్న విచిత్రశక్తుల యథార్థవిషయ మెట్టిదో తెలిసికొనుటకుకూడా వీలగుచున్నది.

## 39. ఆధ్యాత్మికశక్తులను ప్రయోగముచేయుటలో నియమములు.

ఇతరశక్తులకంటె చైతన్యశక్తిలోగల మహావిశేష మేమనగా అందులో సచ్చిదానందధర్మములుండుటయే యని ఇదివఱలో చెప్పియుంటిమి. చైతన్యశక్తియొక్క ఆదిభండారమును సత్యసృష్టికర్తయు నగు పరమసర్వేశ్వరుడు, పరమసత్తపరమచేతనత, పరమానందములయపారసింధువనికూడ నిదివరలోనే తెల్పబడినది. పరమపురుషునియందీలక్షములున్నట్లంగీకరించినపుడు వారు ప్రస్తుతము జరిగించుచున్నట్టియు నింతవఱకు జరిగించినట్టియు, నికముందు జరిగించబోవునట్టియు విషయములన్నియు ఉత్తమోత్తమబుద్ధిమత్తతో కూడియుండుననియు, వానిలోఅన్నిటియొక్క ఉద్దేశ్యము సమస్తజీవులకు మహోపకారము చేయుటతప్ప మఱెద్దియుకాజాలదనియు సహజముగ నొప్పుకొనవలసియుండును.

పరమసర్వేశ్వరుడు సర్వజ్ఞుడు కావున నాతనచే యేర్పఱచిన చట్టములు, అనగా, నియమములు భూతభవిష్యద్వర్తమానకాలములు మూడింటికిని వర్తించుటయే గాక, ఆచట్టములు నియమములనుండి తప్పిపోయినవిషయ మెద్దియు నుండజాలదు, మఱియునాచట్టములు, లేక నియమములు పరిపూర్ణములు, అనగా, పూర్తిగా దోషరహితములై యుండునుగావున వానిలో మానవకృతచట్టములవలె నెట్టి మార్పులు కొట్టుబొట్లు సవరణలకును సావకాశ మెంతమాత్రము నుండజాలదు. అందుచే నాపరమసర్వేశ్వరుని నియమములనుగుఱించి పరిపూర్ణజ్ఞానముగల్గి నట్టి, లేదా వానినికొంతమట్టుకైన ప్రయోగములోపెట్టుచున్నట్టి సిద్ధపురుషుడు తప్పకుండ ఆనియమములను పాలించునట్టివాడే అయియుండవలెనుగాని యుల్లంఘించువాడుకానేరడు. ఈప్రపంచమున అనగా ఈమలినమాయాదేశములో చైతన్యశక్తియొక్క ప్రవర్తనను పరిశీలించినచో నెంతసూక్ష్మాతిసూక్ష్మమైనబుద్ధిగలమానవునికైనను తనలోనున్న చైతన్యశక్తి చేయుచున్నక్రియల జాడమైన తెలిసికొనజాలనంతరహస్యముగ నది గుప్తమైయుండుచున్నట్లు బోధపడగలదు. చైతన్యశక్తి కేంద్రమైన ఆత్మనుండి బయల్వెడలి, జంతువుల వెన్నెము ఘట్టముల (అనగా ఇంద్రియముల) మీదికి ప్రసరించునట్టి చైతన్యధారలమూలమునసే ఆఘట్టముల (అనగా ఇంద్రియముల) స్వాభావికధర్మములు చైతన్యవంతములై పనిచేయప్రారంభించి, మానవునకు యీజగత్తునకు సంబంధించిన జ్ఞానానుభవములు కొంతకలుగుచున్నవి. ఈప్రాపంచికవ్యవహారమంతయు ఆవిధముగనే సాగిపోవుచున్నది. ఇవ్విధముగ జీవులలో నాత్మధారలద్వారా మేల్కొనెడిచేతనతకు, ప్రకృతిలోని జడశక్తులరహస్యములను దెలిసికొనగల సామర్థ్యముకూడా కొంతవఱకుండును. ఈచేతనతద్వారానే మానవజాతికి సుఖవర్ధకములు జ్ఞానపోషకములునగు నూతనావిష్కరణములను మానవుడు చేయగల్గుచున్నాడు. సాధారణ చేతనతకు సంబంధించిన యీకార్యములన్నిటిని, చైతన్యశక్తిధారలే నెఱవేర్చుచున్నను, ఆధారలుమాత్రము నిరంతరము నంతర్ముఖములై నిగూఢగుప్తముగనే యుండుచున్నవి. చైతన్యశక్తికి పైనచెప్పినవేగాక విశేషావస్థలుగూడ, అనగా, సమ్మోహనావస్థ (Hypnotism) సమాధ్యవస్థ మున్నగు అవస్థలుగూడ గలవు. ఆయవస్థలలో నప్పుడప్పుడు అంతర్జ్యోతిః ప్రకాశము మఱికొన్ని అద్భుతలక్షణములును ప్రకటమగుచుండును. చేతనశక్తియొక్క అట్టి అసాధారణావస్థలలో ఆయవస్థకులోబడినమనిషి స్మృతివిహీనుడై, స్వాతంత్ర్యముతప్పిపోయియుండి, తాను చేసెడి పనులన్నియు, ఆసమ్మో

హానసిద్ధిను పుట్టించినవాని యిష్టానుసారమైనను చేయుచుండును లేదా, క్రమ నియమములెవ్వియు లేకుండనైన చేయుచుండును. మీదుమిక్కిలి, అట్టియవస్థలను పొందినమానవుడు చెప్పెడివిషయములు చాలమట్టుకసత్యములుగకూడ పరిణమించుచున్నవి. కావున నట్టివిషయములలో వ్యక్తమయ్యెడి యసాధారణ శక్తులు ప్రాపంచికలాభములను సంపాదించుకొనుటకు అంతగా ఉపకరించవని కూడా తేటపడుచున్నది.

పై విషయములనుబట్టిచూడగా, అంతర్జ్ఞానచైతన్యశక్తులు, ప్రకృతిశక్తుల ద్వారా సాధించవలసిన బాహ్యప్రపంచములోని స్థూలకృత్యములు నెఱవేర్చుకొనునిమిత్తమై యుద్దేశింపబడలేదనియు, వానికి ఈసృష్టిప్రబంధములో మఱి వేరొకా కార్యములు నిర్దేశింపబడియున్నవనియు, తేలుచున్నది. శారీరకక్రియలు పూర్తిగాకట్టుబడి మానసికక్రియలుగూడ కొంతవఱకుకట్టుబడినపిమ్మటనే, ఆధ్యాత్మికగుప్తశక్తులనుపయోగించువాని సంకల్పశక్తి యన్యపురుషునిసంకల్పశక్తి కధీనమైయున్నప్పుడే, ఆగుప్తశక్తులు మేల్కాంచుటయు, ప్రయోగింప శక్యములగుటయు, జరుగుననుసిద్ధాంతముకూడా ఇందుతోపాటే సిద్ధమగుచున్నది. ఈరెండువిషయములను సిద్ధపురుషులకు వర్తింపజేసిచూచినయెడల యేసిద్ధపురుషునికైనను, ఒక యున్నతలోకమున ప్రవేశించుటకును ఆయుతన్న మండలశక్తులను సంపాదించుకొనుటకును, తనసంకల్పశక్తిని ఆమండలాధిపతి యిష్టమునకు పూర్తిగ వశముచేయవలసియుండునని తేటపడును. ఇంకొకవిషయమేమనగా, ఏనియముల ప్రకారము ఒకమండలాధిపతి తనమండలమున పనులు జరిపించుచుండునో సిద్ధపురుషుడు ఆనియమములకు పూర్తిగబద్ధుడై యుండవలెననియు, ఆమండలాధిపతియొక్క అద్భుతశక్తులను జగమున ప్రకటించవలెనన్నచో, సిద్ధపురుషుడు చేయదల్చిన పనులన్నియు ఆమండలాధిపతి యాజ్ఞకు బద్ధమైయే చేయవలసియుండుననియుగూడ స్థిరపడుచున్నది. సిద్ధపురుషులకు ఈనియమముల నుల్లంఘించి తమయిష్టానుసారము ప్రాపంచిక ప్రయోజనములను సాధించుకొనినిమిత్తమాయుత్తమశక్తులనుపయోగించుటకు అనుజ్ఞ లేదు.

## 40. అద్భుతకృత్యములలో వ్యత్యాసము.

ఏదైన నొకఉత్తమలోకములో ప్రవేశించగలసిద్ధిని పొందకుండా, అట్టి పురుషులబాధ్యత లెట్టివో తెలియకుండా, ఏదోకొద్దిగా చైతన్యశక్తిమాత్రము

మేల్కాంచినట్టివారుకూడా కొందఱు ప్రపంచములో గలరు. అట్టివారు తమ చైతన్యశక్తిని పైకిచూపించుకొనుటకై తమాషాలు అద్భుతములను చేయుచు ఆశక్తిని బుద్ధిపూర్వకముగా దురుపయోగముచేయుచుందురు. ఈయద్భుత కృత్యములమూలమున నాస్తికులలో ఆధ్యాత్మికవిషయములు పరమార్థమును గుఱించి కొంతఆస్తికత పుట్టవచ్చును;కాని వీనికిని,అవతారపురుషులు ప్రవక్తలు చేసినచమత్కారపుకృత్యములకును యెట్టిపోలికయు లేదు. మొదటివిషయ మేమనగా, ఆమహాపురుషులు చమత్కారకృత్యములను చూపించుటయే అరుదు, అట్టి విచిత్రములను ప్రదర్శించినపుడుకూడా, వారిముఖ్యోద్దేశ్య మా విచిత్రకృత్యములమూలమున, తాము ప్రకటముచేసిన యాంతర్యస్థానముల వాస్తవత్వమును నిరూపించి, జనులలో పారమార్థికాసక్తివృద్ధిచేసి వారిచే నాంతర్యాభ్యాసముచేయించి యూర్ధ్వమండలముల కారోహింపజేయుట యొక్కటేఅయియుండెడిది. అదియునుగాక, ఆమహాపురుషులు, ఆంతర్యాభ్యాస ముచేసి యూర్ధ్వమండలముల కాత్మ నారోహింపచేయగల యధికారిజీవులకు మాత్రమే అట్టి చమత్కారములను చూపెడివారు.

## 41. ప్రవక్తలు, అవతారపురుషులును విపత్తులను సహించవలసివచ్చును.

ఐహికభోగవాంఛలతో నిండినట్టి సామాన్యవ్యావహారికవిషయములలో చైతన్య శక్తి నుపయోగించి విచిత్రములను చేయుట చైతన్యశక్తియొక్క సహజనియమ ములకు విరుద్ధముకాబట్టి, అట్లుచేయుటకు వీలులేదు. ప్రవక్తలును, అవతార పురుషులును ప్రాపంచికావసరములనుతీర్చుకొనునిమిత్తమై, అనివార్యపరిస్థితు లలో తమగుప్తశక్తులను ప్రయోగించినపుడెల్ల వారు విపత్తులకు లోనైపోవు చుండుట కిదియే కారణము,అవిశ్వాసులకు విశ్వాసముకల్గించునిమిత్తముకూడా, వారు ముఖ్యముగా సామాన్యపద్ధతులనే అవలంబించుచుండెడివారు. అనగా హేతువాదము, హితోపదేశము, ఆచరణశుద్ధులమూలముననే వారు తమ ఆశయములను మతమును ప్రచారము చేసిరికాని, విచిత్రములనుచూపినది చాలఅరుదు.

## 42. విచిత్రానుభవములు

భక్తులకును, శిష్యులకును తమఅద్భుతశక్తులను విశదపరచునిమిత్తమై మహాపురుషులు విచిత్రములుచేసిచూపుటకుబదులు, మఱొకసహజస్వాభావిక మైనపద్ధతి నుపయోగించెడివారు. అదెట్టియనగా మానవునకు సామాన్యముగా ఊహింపశక్యముకాని హేతువులుగల్గి తఱచుగ సంభవించుచుండెడి ఆకస్మిక

సంఘటనలని మా అభిప్రాయము. ఈ సంఘటనలమూలమున గలిగెడి పరిస్థితులు పర్యవసానములును మహాద్భుతములై, అంతకుముందెవనికి నెంతమాత్రము నూహింపశక్యముకానివై యుండుచుండును. వాస్తవముగా ఈ దైవిక సంఘటనలు, లేక ఆకస్మిక సంఘటనలు, మామూలుగా అనుకొనుచున్నట్లు, నిర్నిమిత్తముగాగాని నియమరహితముగా కాని జరుగవు. పైగా అవికూడా, మునుముందు మేము ఋజువుచేయబోవుచున్నట్లు, పద్ధతిప్రకారముజరిగెడి ప్రకృతికార్యములవలెనే కొన్నిప్రత్యేకవిశేషనియమములననుసరించియే సంభవించుచుండును. సామాన్యముగా దైనందినజీవితములో నీనియమములు ఉపయోగము చేయబడుచుండునుకావున వీనిని ఉపయోగములోపెట్టునిమిత్తమై ఉన్నత తరగతికిచెందిన నియమములను వేనిని సిద్ధపురుషులు ఉల్లంఘించనవసరముండదు. ఈ కారణమువలన నిజమైనసాధుసంతుమహాత్ములు ప్రధానముగా తమ శిష్యులకు ఆధ్యాత్మికలాభముచేకూర్చునిమిత్తమై, ఈ నియమములనే ఉపయోగించుచుందురు. ఈప్రకారము, శిష్యులకు దుర్ఘటములుగను, తమ శక్తికి మించినట్లుగను కనిపించునట్టి క్లిష్టపరిస్థితులు ఆపత్తులును సాధనచేసెడి కాలములో చాలసార్లు విచిత్రముగ మాయమైపోయి, శిష్యులకు ఆసమయములో ఒక్కపెట్టున ఆవిర్భవించునట్టి పరిస్థితులవలన సద్గురువునిరక్షకహస్తము అందులో స్పష్టముగాకాన్పించుచుండును. అట్టియనుభవములు తఱచుగా గల్గుచుండుటచే, శిష్యులకు తమసద్గురుని యసాధారణశక్తులనుగూర్చి సందేహములన్నియునివృత్తిమైసద్గురుచరణములందు కృతజ్ఞతాపూర్వకభక్తివిశ్వాసములు స్థిరపడును. కాని యిట్టి యనుగ్రహములు, శిష్యునిఆత్మ యథార్థముగ నారోహించుటలో అందుకు ప్రతిబంధములు విఘ్నములుగలిగినపుడే చూపబడునుగాని, పరమార్థపద్ధతికి విరుద్ధముగా శిష్యునిప్రాపంచికవాసనలను తృప్తిపఱచుట కెంతమాత్రము చూపబడవు. శిష్యునికి పారమార్థికసాధనల నభ్యాసముచేయుటలో ప్రతిబంధకమైన ప్రాపంచికకష్టమేదైనను తటస్థించినపుడు అదికూడ కొంతవఱకైనను లేదా పూర్తిగనైనను తొలగించబడును. కాని కేవలము స్వార్థప్రధానమైన ప్రాపంచికవాసనలను పూర్తిచేసికొనునిమిత్తమెట్టిసహాయమును చేయుబడదు. పార్సీభాషలో నొకమహాత్ముడిట్లు విధముగ సెలవిచ్చెను:—

తాలి బానే దునియా షక్ హూరంద్
తాలి బానే ఉక్ బా, షజదూరంద్
త్లాలి బానే మ్మాలా, మసరూర్ అంద్.

అనగా ఐహికసుఖములనుగోరువారు భగవంతుని యప్రసన్నతకు పాత్రు లగుదురు. మరణానంతరము స్వర్గాదిసుఖములను వాంఛించువారు వెట్టికూలీలు. నిజమైనభగవంతుని గోరువారు పరమానందభాగ్యమునకు పాత్రులు.

## 43. సిద్ధపురుషులకును, అవతారపురుషులకునుగల వ్యత్యాసము.

పైప్రసంగములో సిద్ధపురుషుల శక్తులను పనులనుగురించి వర్ణించు సందర్భములో, నవతారపురుషులు, ప్రవక్తలు మున్నగు మహాపురుషుల యద్భుత కృత్యములనుగురించి వివరించిన విషయములనుబట్టి, అవతారపురుషులకును, కేవలసిద్ధపురుషులకును వ్యత్యాసమేమియు లేదని యనిపించవచ్చును, కాని అది సరికాదు. చిట్టచివరకు అనగా సాయుజ్యసిద్ధిచేకూరినప్పుడు, సిద్ధపురుషునకు తానారోహించినమండలముయొక్క యవతారపురుషునితోగాని ప్రవక్తతో గాని సమానమైన శక్తులన్నియు చాలమట్టుకు చేకూరునుకాని, అట్టి సిద్ధపురుషులకును, అవతారపురుషులకును మధ్య గొప్పవ్యత్యాసమున్నది. ఆవ్యత్యాసమేమనగా, ఆఅద్భుతశక్తులు అవతారపురుషులకును, ప్రవక్తలకును పుట్టుకతోనే యుండునుకాని, సిద్ధపురుషులకుమాత్రము ఆధ్యాత్మికసాధనల నభ్యాసము చేసి యుత్తమలోకములందు ప్రవేశించినపిమ్మటనే గలుగగలవని స్థూలముగా చెప్పవచ్చును.

## 44. అవతారపురుషులు.

అవతారపురుషులవిషయములో జనసామాన్యములోగల యొకగొప్పతప్పు టభిప్రాయము నీ సందర్భములో ఖండించుట అసమంజసముకానేరదు. మానవమాత్రుడొక అల్పపరిమాణముగల వస్తువై యుండుటచే అద్భుతాపారశక్తులుగల యొక యుత్తమమండలాధిపతి తన్నుతాను ఆచిన్నకూజావంటి శరీరములో బంధించుకొనుట కేవలముఅసందర్భముగను, లేదా, అధమాధమము లోకమతవిరుద్ధముగను ఉండునని యెవరైన ననుకొనవచ్చును. కాని క్రిందచెప్పబోయెడి కారణములను గమనించినయెడల నట్టియూహలో పొరపాటు తేటతెల్లము కాగలదు. సిద్ధపురుషునియాత్మ మృత్యుద్వారముదాటి బ్రహ్మాండీమనస్సుయొక్క స్థానములనుగాని నిర్మలచైతన్యమండలములనుగాని (ఆయాసిద్ధపురుషుని తరహానుబట్టి) ప్రవేశించినప్పుడు అతని చేతనతయొక్క ఆభాసకే అనగా విస్తృతకాంతికే (diffused spirituality) తన శరీరసంబంధమైన ఆవశ్యకకృత్యములను

జరిపించుటకు తగిన సమర్థత చేకూరుననియు, ఆతని ఆత్మకు, తన చైతన్య ధారలకు స్థూలశరీరముతో సంబంధముగల్గియుండిన హేతువుచే, అంతరంగికారోహణములో అనగా ఆధ్యాత్మికసాధనలను జయప్రదముగా సాగించుకొనుటలో ఎట్టి ప్రతిబంధము గలుగనేరదనియు నిదివరలోనే చెప్పియుంటిమి. ఇప్పుడు ఈసిద్ధాంతము సిద్ధపురుషులవిషయములోనే సరియైనచో అవతారపురుషులవిషయములో నది అంతకన్న నెక్కువ ప్రబలముగ సత్యమైయుండవలెను. ఆపద్ధతిని, ఉన్నతమండలాధిపతి తనమండలమందేయుండి, ఆమండలముయొక్క సంరక్షణ యధావ్రికారము జరిగించుచునేయుండునుకాని, అతనినుండి తిన్నగా వెలివడు కిరణములుమాత్రమే మానవాకారమునుధరించును. దానినే మండలాధిపతి యవతారమని అందురు. ఈయవతారస్వరూపము, మండలాధిపతివలన ప్రత్యేకమైన ప్రేరణనొందుచు, ఆయవతారమెత్తినయుద్దేశ్యసాఫల్యమునకు కావలసినకార్యక్రమమునంతను సాగించుచుండును. అందుకు ఉదాహరణయెట్లనగా, కొన్నినదులలో, సముద్రముతో గలిసియున్నట్టియు సముద్రపుపాటు పోట్లకు అందుపాటులోనున్నట్టియు నదీభాగములో, సముద్రములో పోటురాగా సముద్రమునుండి నీరు బయటకువచ్చి లోనికిపోవుచుండినపుడు, నీరువచ్చుటయు పోవుటయు నదీభాగములోనే జరుగుచుండును కాని, ఆ నీటి రాకపోకలు సముద్రపు పొంగుతరంగముల ప్రభావమువలననే గలుగుచుండునుకదా. సముద్రమెప్పుడు తనస్వస్థానముననే యుండునుకాని దాని తరంగములుమాత్రమే ఆపాటుపోట్లనీరు నదిలోనికి వచ్చిపోవునట్లు జరిగించుచున్నవి.

## 45. అవతారపురుషునిరాకచే ప్రపంచమునకు మహాశ్రేయోలాభము చేకూరును.

అవతారపురుషులు ఈప్రపంచమునకు వచ్చుటలో నుద్దేశ్యము లేక, అవసరమేమైయుండును, అని ప్రశ్నగలుగవచ్చును. అందుచే నిపుడు దీనికే సమాధానము చెప్పుచున్నాము. ఈసృష్టి యొకసర్వజ్ఞపురుషునిచే సృజింపబడుటచే నేవిషయము కూడ నిచ్చట నిర్నిమిత్తముగగాని, నియమరహితముగగాని జరుగనేరదనియు ఈసృష్టికిని అందలిజీవులకును గలిగెడిపరిస్థితులన్నియు మహోదయాభరితమైన శాసననియమముల ననుసరించియే కలుగుచున్నవనియు నిదివరలో చెప్పియుంటిమి. కావున బాహ్యముగ నెంతయు హృదయవిదారకములు మహాదుఃఖదాయకములును ప్రచండక్రౌర్యపూరితములునైనట్టి కష్టక్లేశపరిస్థితులలోగూడ, అంత్యములో తప్పక నొకలాభదాయకపర్యవసానము అంతర్గతమై

యుండుచునేయుండును. వీలననగా తువ కాపరిస్థితులన్నియు నాసర్వతోముఖ జ్ఞానవివేకనిధియగు పరమేశ్వరుడే యేర్పాటుచేసినట్టి ప్రత్యేకశాసననియమముల పరిణామమే కదా! ఈసృష్టికిమూలము అనగా ఆదికారణ మొకసర్వజ్ఞ పురుషుడని యంగీకరించినపుడు దీనిలో దుఃఖానుభవముగల పరిస్థితి సదాస్థాయిగ నుండుట అసంభవము. పరమపురుషుని పరమానందమయతత్త్వమునకు విరుద్ధముగనే కన్పట్టునట్టి యీయవస్థలలోగూడ లాభదాయకోద్దేశ్యమే అంతర్గతమై యుండినపుడు, పరమానందమయతత్త్వములో స్వతహాగాజనించిన దివ్యేచ్ఛవలన దిగివచ్చినయవతారపురుషుని శుభోదయములో ఉత్తమోత్తమదయానుగ్రహములుండి తీరవలసినదేకదా.

46. ప్రపంచమునకు ఉత్తమసంస్కారులైన యాత్మలమూలముననే సకల సుఖభోగసామగ్రియు, జ్ఞానోదయమును లభించుచున్నవి.

సభ్యజనుల సుఖములుభోగవిలాసములు;దుఃఖోపశమన, దుఃఖనివారణల నిమిత్తమును,వర్తకమునకు, వ్యాపారాభివృద్ధినిమిత్తమునుఅవసరమైనట్టియాపత్తు ఉత్తమయంత్రములు సాధనములును; సృష్టిలోని గుప్తప్రబంధముయొక్కయు ప్రకృతినియమములయొక్కయు రహస్యములను మానవులకు కొంతవఱకు (అత్యల్పముగనేయగాక) తెలియజేయునట్టి ఆవిష్కరణములు,వైజ్ఞానిక శాస్త్ర రహస్యములును; మానవునిమనస్సునకు సుఖశాంతులనొసంగెడి సమస్తమైన మనోభావనలు, మనోహరభావములు, విద్వద్గ్రంథరచనలును; పరస్పర కలహములను నిర్మూలించి పరస్పరప్రేమసహాకారభావములతో ప్రాపంచిక కార్యములు జరిగించుకొనునిమిత్తమై ప్రచలితమైన శాసనములు నియమ నిబంధనలును—ఇవన్నియును తపఃశ్రద్ధాపూర్ణులైన అనగా ఉత్తమసంస్కారములుగల ఆత్మలీపృథ్విలోనికి వచ్చుటవలననే సాధ్యమైనవి. వివిధజాతుల యౌన్నత్యావనతులును, మానవసభ్యతయొక్క వృద్ధిక్షయములునుగూడ, నిట్టి యాత్మల ఉనికిలేములమీదనే (Existence or nonexistence) ఆధారపడి యున్నవని తెలియుచున్నది. కావున నీలోకమున నింతదనుక ప్రకటమైనట్టియు నిపుడగుచున్నట్టియు నికముందు ప్రకటముకాబోవునట్టియు సమస్తవిద్యలు, కళలును తగినంత బుద్ధిసామర్థ్యముగల సంస్కారిజీవులమూలముననే లభ్యమైనవని చెప్పవలెను.

**47. పారమార్థికజ్ఞానమంతయు నవతారపురుషులు ప్రవక్తలమూలముననే, ప్రకటితమయ్యెను.**

వెవ్వేఱుసమయములందు వెవ్వేఱు సంస్కారిజీవులీప్రపంచమున నెట్లు జన్మించి విద్యాకళల నభివృద్ధిచేసియున్నారో అటులనే అవతారపురుషులు ప్రవక్తలునుగూడ యుక్తసమయములం దీజగమున నవతరించి జీవులకు సమయోచితముగ పరమార్థలాభమును సమకూర్చుచున్నారు. అట్టిసమయములందు వారు జీవులందఱకును తమతమనిజధామములయొక్క, అనగా తామేమండలమునుండి వచ్చిరో ఆమండలముయొక్క గుప్తవిషయములను ప్రకటించి, తమనిజధామమున ప్రవేశింపచేయుగల యభ్యాసపద్ధతుల నుపదేశించుచుండిరి. పూర్వకాలములో జీవులుఅమాయకులై శ్రద్ధాభక్తులుగలవారగుటచే నీమహాపురుషుల స్వచ్ఛజీవనము పవిత్రాచరణముమాత్రమే వారికి తమయుపదేశములందు దృఢవిశ్వాసముకలుగచేయుటకు సరిపోయెడివి. కావున నప్పటికాలప్రజను ఎట్టి శంకాసందేహములులేకుండగనే ఆయవతారపురుషులు బోధించిన సాధనా పద్ధతులను అనగా అంతరంగికరహస్యములను స్వీకరించి అభ్యాసముచేసి, అందువలన పారమార్థికలాభముకూడ నొందుచుండెడివారు. ఇకముందు మేము వివరింపబోయెడి సమస్తవిఘ్నములు కష్టములును, జీవులకు సాధనలను,(ఆసాధన లేతరహాకు చెందినవైననూగాక) అభ్యాసముచేయుకాలములో నెల్లపుడు పూర్వము గలుగుచునేయుండెడివి, ఈకాలములోను గలుగుచున్నవి, ఇకముందుకూడా గల్గుచునేయుండును. యదార్థమైనట్టి ప్రతిమతమునకును ప్రారంభములో నెల్లపుడు నొకయవతారపురుషుడో ప్రవక్తయో గురువుగనుండుటచే సాధకులకు, అట్టిగురువుసహాయముతోను వారియనంతరము వారిగురుముఖులు (అనగా వారి సత్సంగముచేసికొనుచు వారునేర్పినసాధనలను పూర్తిగనభ్యాసనముచేసి సిద్ధినొందినశిష్యులెవరైనను) వారు ప్రారంభించిన యాధ్యాత్మికకార్యక్రమమును జరిపించుచుండినచో, నట్టిగురుముఖులసహాయముతోను తమయభ్యాసములోగల్గు విఘ్నములను తొలగించుకొనుటలో కష్టముండెడిదికాదు. కాని అట్టిమహాపురుషులంతరించినపిమ్మట వారిసంఘములో కేవలము బాహ్యాచారములే మిగిలిపోయి అంతర్యాభివృద్ధి ఇంచుమించుపూర్తిగా కట్టుబడిపోయెను. ఇచ్చట అభ్యాసమనగా స్వప్నసుషుప్తిసమాధిమరణావస్థలనతిక్రమించి యూర్ధ్వమండలములపైకి ఆరోహించుటయని మాఅభిప్రాయము. ఈయాంతర్యారోహణములో ప్రతినూతనప్రస్థానమందును దానికిందిమెట్టుకు సంబంధించిన

(యభ్యాసియొక్క) మనోబుద్ధులు (సంకల్పవివేచనాశక్తులు) మున్నగునవి లయమైపోవుచుండును. ఇచ్చట పసిబిడ్డకు పాలనపోషణలకొఱకై తల్లియెట్లవసరమో అటులనే ఒక్కొక్కనూతనపరిస్థానములో దానికిసంబంధించిన మనోబుద్ధ్యాది శక్తులను అభ్యాసిలో మేల్కొల్పునిమిత్తమై యతనికెవరైననొక సహాయము చేసెడి మహాపురుషు డవసరము.

## 48. పరిశోధనచేయునిమిత్తమై నవీనోత్సాహము ఉద్భవించుట.

ప్రాచీనకాలపు ప్రవక్తలు, అవతారపురుషులును ఆంతర్యప్రకాశ సంపన్నులు కావున జగమునకు తాము వెల్లడిచేసిన ఆధ్యాత్మికరహస్యములను, యుక్తమైనహేతువాదములద్వారా, సమూలముగ ధ్రువపర్చగలసమర్థులే అని చెప్పుట కెట్టిసందియము లేదు. కాని ఆకాలపు జీవులు అందుకు పరిపక్వముకాక పోవుటచే వారికి విశ్వాసముగలుగజేయునిమిత్తమై ఆమహాపురుషులు ఆంతరంగికమార్గము స్థానములను గుఱించిన గూఢవిషయములను వివరించుటదప్ప మఱెట్టిప్రయత్నమును సేయలేదు. కాని ఈకాలములో పరిస్థితులు తీవ్రముగా మాఱిపోయి అందఱును ప్రతివిషయమును దాని పూర్తివివరములతో సహితముగా, నిష్కర్షగను అనుభవవేద్యమగునట్లుగను విశదీకరించవలయుననియు, సమస్తవిషయములను లౌకికముగాని, పారమార్థికముగాని, హేతువాదముల మూలముననే సిద్ధాంతీకరించవలయుననియు గోరుచున్నారు. జనులలో నిట్టి ప్రశ్నాభిలాష పారమార్థికజిజ్ఞాసారీతికి విరుద్ధము కాదని తెలిసికొనదగును. పైగా, ఈయభిలాషమూలమున నాంతర్యరహస్యములను జనులలో సందేహము లొక్కపెట్టున శాశ్వతముగానివృత్తిమైపోవువిధమున విశదపఱచుటకవకాశము చిక్కుచున్నది. ఇట్టి సార్వజనీనమనోవృత్తి కేవల మాకస్మికము లేక యాదృచ్ఛికముకాక, జనులలో శాశ్వత శ్రేయోదాయకమైన పరమోత్తమరహస్య విషయములను తెలిసికొనునిమిత్తమై హార్దికాభిలాష యుండినందువలననే వాస్తవముగా అట్లుకలుగుచున్నదని తేటపడుచున్నది.

## 49. ప్రచలితమతములలోని యవతారపురుషులు ప్రవక్తలును.

పైనుదహరించబడిన అవతారపురుషులు, ప్రవక్తలును ఈసృష్టియొక్క ద్వితీయమహాఖండమగు బ్రహ్మాండీమనోదేశమునుండి యవతరించిరని మేము ముందు తెల్పబోవుచున్నాము. బ్రహ్మకును, ఆయనదేశమునకును చైతన్య శక్తియొక్క ఆదిభండారమైన నిజపరమసత్యేశ్వరునినుండియే శక్తిచైతన్యములు

లభించుచున్నవనియు మానవునిలోని మనస్సునకు మృత్యుస్వరమయమందెట్టి మార్పులు వికారములుగల్గునో, అట్టిమార్పులువికారములే బ్రహ్మకును, ఆయన దేశమునకునుగూడ గలుగుచుండుననియు నిదివరలో చెప్పియుంటిమి. కావున జీవునికి, బ్రహ్మయొక్క దేశమును పొందుటచే, చిరకాలమువఱకు మహా చైతన్యలాభము చేకూరునుకాని శాశ్వతవరమానందము, సకలవిధక్షయవికారములనుండి మృత్యువునుండియు శాశ్వతవిముక్తియు, చేకూరజాలవు. మఱియు మానవమనస్సుయొక్క ప్రవృత్తివలెనే, బ్రహ్మండీమనస్సుయొక్క ప్రవృత్తి కూడా ఆదేశములోబహిర్ముఖముగనే యుండునుకావున, ఆత్మ అంతర్ముఖమైనచైతన్యధారల మూతగొని ఆదేశమునుదాంటి నిర్మలచైతన్యదేశమునకు ప్రయాణము సేయునపుడు, బ్రహ్మండీమనస్సుయొక్కవృత్తులు సహజముగా ప్రతిబంధములనే కలుగజేయుచుండును.ఇంతియగాక మానవునిమనస్సు 24 గంటలును స్వసౌఖ్యదాయకమైన పనులలోనే లగ్నమైయెట్లుండునో అటులనే బ్రహ్మండీమనస్సుకూడ తనస్థితికిసంబంధించిన యేర్పాట్లు కార్యకలాపములోనే నిరంతరము లీనమైయుండి,మానవుని మనస్సులో నిర్మలచైతన్యదేశమునకు సంబంధించిన ఆలోచనలెవ్వియు నెట్లు పుట్టవో, అట్లే బ్రహ్మండీమనస్సునకు గూడా ధ్యానమావైపునకు పోనేపోదు. బ్రహ్మండీమనస్సుయొక్క పరిస్థితియే యిట్లున్నప్పుడు దానియాజ్ఞచే నవతరించిన అవతారపురుషులు ప్రవక్తల పరిస్థితికూడ నాతీరుననే యుండవలెనుకదా. కావున నట్టిమహాపురుషులు బ్రహ్మండిమనోదేశమును మాత్రమే చేరుకొనుటకు యేర్పాట్లుచేసిరి, ఆ యేర్పాట్లుకూడా స్వయముగాతమచరణములందు లగ్నమైనవారికిని లేదా తమగురుముఖశిష్యులశరణుజొచ్చినవారికినిమాత్రమే తమఉపదేశములవలన అనుభవసిద్ధమైనలాభముగలుగునట్లుగా చేసిరికాని, వారు వారిగురుముఖశిష్యులును అంతరించినపిదప వారిమతమునను సరించినవారికి గలుగు ఆధ్యాత్మిక లాభము, యావజ్జీవము పాటుపడినను శూన్యప్రాయముగనే యుండెడిది. అట్టి వారందఱును మరణానంతరము వారివారి శుభాశుభకర్మల ననుసరించి తగిన ఉచ్చనీచలోకములను పొందిరేకాని వారికి బ్రహ్మండీమనోదేశములో అనగా బ్రహ్మండములో నివాసముమాత్రము లభించలేదు. ఏలననగా మనోధారల యొక్కబహిర్ముఖప్రవృత్తి పూర్తిగ నశించువఱకు నెట్టిజీవునకును బ్రహ్మండమందు అడుగిడశక్యము కాదు. అట్లే బ్రహ్మండీమనస్సుయొక్క బహిర్ముఖవృత్తులన్నియు పూర్తిగ నశించువఱకు నేఆత్మకును నిర్మలచైతన్యదేశమున ప్రవేశిం

చగలఅధికారము గలుగ నేరదు. ఈమనోవృత్తులనిర్మూలనము జడపదార్థము ఘనావస్థలోనుండి (Solid Sate) అయనావస్థ (Ionic State) లోనికి మాఱిపోవు నపుడు దానికిగలిగెడి అవస్థల మార్పులతో పోల్చవచ్చును. అనగా పరమాణు వులు (atoms)వాని ఘనావస్థకుకారకమైన మేళనధర్మమును(cohesiveness) మొట్ట మొదట విడిచిపెట్టవలెను. అపుడు ఆపదార్థము జలమువంటితరళావస్థలోనికి మాఱిపోవును. ఈ రెండవ అవస్థయొక్క ముఖ్యలక్షణమైన స్నిగ్ధత్వధర్మమును అవి విడువవలసియుండును. అపుడు దానికి భారముగల్గించుటకు హేతుభూతమైన భూమధ్యాకర్షణశక్తిని(gravity) తొలగించవలసియుండును. అటుపిమ్మట నాపర మాణువులువేఱగునపుడు గల్గెడిసంఘర్షణవలన జనితమైన తాపావస్థ నతిక్రమించ వలసియుండును. ఆతరువాత పరమాణువులు పగిలి అయనావస్థను (ionic sate) పొందును. జడపదార్థమొకయవస్థలోనుండి మఱియొకఅవస్థలోనికి మాఱి నపుడెల్ల అనగా ఒక్కొక్కఅవస్థాభేదముకలిగినపుడెల్ల, దానిపరమాణువులకు శక్తియు, స్వాతంత్ర్యము నంతకంతకెక్కువగా చేకూఱుచున్నవని గమనింప దగును.

## 50. అవతారపురుషులు,ప్రవక్తలును బ్రహ్మాండమునుండివచ్చినట్లుప్రమాణములు,

ప్రచలితమతములలోని యవతారములు ప్రవక్తలును బ్రహ్మాండ మనస్సుయొక్క మండలములనుండియే యీలోకమునకు అవతరించిరని పైన చెప్పితిమి.ఇందుకుప్రమాణములు వారురచించినపవిత్రగ్రంథములలోనే యున్నవి. ఏలనన నాగ్రంథములలో చెప్పిన యాంతరంగికరహస్యములనుబట్టియే ఆధ్యా త్మికవిద్యావేత్తలకు ఆయవతారపురుషుల గమ్యస్థానము అనగా సిద్ధాంతపదము సృష్టిలోని ద్వితీయమహాఖండమునకుచెందినదని స్పష్టపడగలదు. సామాన్య మానవులకుమాత్ర మీవిషయముల నవగాహనచేసికొనగలశక్తి లేదు. అందు చేతనే వారు వివిధప్రచలితమతముల సిద్ధాంతపదములలో వ్యత్యాసమును గ్రహింపజాలకున్నారు. మఱియు నాకారణమువలననే ఆయామతములలో నెన్నియోవిషయములు, సామాన్యులకు పైకిచూడగా అసంభవములు,హాస్యా స్పదములుగనే కనిపించినను, ఆధ్యాత్మికవిద్యాప్రవీణులకు అంతర్యానములవర్ణ నలుగనుఊర్ధ్వమండలములకుఆత్మారోహణమును గుఱించినవివరణములుగను స్పష్టముగ బోధపడును. ఉదాహరణార్థము,మహమ్మదుప్రవక్త జగత్ప్రసిద్ధమైన “బుఱ్ఱాక్” అను తమయశ్వముపైన స్వారిచేయుచు, నాకాశముపై నెక్కిన

విడను, నక్షత్రారోహించుటలో చంద్రుని రెండుముక్కలుగ ఖండించెననియు చెప్పె దురు. ఆంతర్యరహస్యపరిభాష తెలియనట్టియు, పాండిత్యసాధనలనుగురించి యెట్టిశిక్షణను పొందనట్టియు సామాన్యమానవులకు ఈవిషయములు కేవలము మిథ్యావచనములు అనగా గప్పాలుగా కన్పట్టును. కాని యేఆధ్యాత్మిక విద్యాలయములోనివిద్యార్థికైనను వీనియర్థము తేటగాతోచును. అట్టివిద్యార్థికిప్రవక్త గారు స్వారిచేసిరనిచెప్పెడి "బుర్రాక్" గుఱ్ఱమనగా సృష్టియొక్క తృతీయమహా ఖండమగుపిండదేశముయొక్క యుత్తమతరగతికిచెందిన విద్యుచ్ఛక్తియనియు, నీదేశమందలి స్థూలపదార్థములన్నిటికి నది ప్రాణభూతమైనది అనగా ఆత్మావం టిదిగనుక, నీధారమీద స్వారిచేయుటవలననే యూర్ధ్వముగ నారోహింపవ సాధ్యమగుననియు బోధపడును. ఈధారయొక్క కేంద్రము లేక భండారము చంద్రమండలమున గలదు. చంద్రుడనగా నీపృథ్వికిఉపగ్రహమైన చంద్రుడు కాదు. ఆచంద్రమండలము పృథ్విపై ప్రకాశించెడి సూర్యునికంటెకూడ పైనను న్నది. మానవశరీరములో జీవుని నివాసస్థానమగు మధ్యచక్రము ఆచంద్రునికి సరియైన స్థానము. ఈస్థానమును దాటి పైకివెళ్ళునిమిత్తమీచక్రమును లేక కేంద్రమును భేదించుకొని వెళ్ళవలయును. మహమ్మదుసాహెబ్ వారు ఈచక్రమును భేదించుకొనిపైకివెళ్ళినపుడు ఆధ్యాత్మికపరిభాషలో వారు ఆచంద్రుని రెండు ఖండములుగచేసిరని చెప్పవచ్చును. పిమ్మట మహమ్మదుసాహెబ్ వారి కొక ప్రకాశవంతమైన దీపము దూరముగ కనిపించెను. దీనినే వైదికమతములో జ్యోతియందురు. ఇది మాయాశబలబ్రహ్మయొక్క అర్ధాంగిని. మహమ్మద్ సాహెబ్ వారి కీస్థానమునుండియే సమస్తాదేశములును, ఆంతరంగికజ్ఞానమును సంప్రాప్తమైనవి. వారు ఉపదేశించినసిద్ధాంతపదము ఈస్థానముతో ఆగి పోయెను.

## 51. జీవోద్ధారము.

ఏవస్తుజ్ఞానము కలిగినను, జ్ఞేయవస్తువుతో చైతన్యధారకు సంయోగము గల్గుటవలననే చేకూరును కనుక, నొక మండలముయొక్క సృష్టినిగురించియు దానియధిపతియొక్క తత్త్వమునుగురించియు జ్ఞానము ప్రత్యేకము ఆమండలాధిపతికైనను, లేదా, దానిపైనున్న స్థానాధిపతికైనను మాత్రమే కలుగగలదు. ఈకారణమువలననే, ఏమండలాధిపతియైనను, తనక్రింది మండలముల నివాసులకు తనధామమున నివాసమివ్వదలచినపుడు, ఆధామురహస్యములను, అచ్చటజేర్పిం

చుటకవసరమైన సాధనలను క్రిందిజీవులకుబోధించు నిమిత్తమై ఆయనయేస్వయముగా అవతరించవలసియుండును. కాని యిట్టి యవతారములు చాలయరుదు. అట్టియవతారము వచ్చినపుడు మహాగూఢాతిగూఢరహస్యములు ప్రకటింపబడి, వారిశరణాగతజీవుల కతిత్వరితముగా ఆధ్యాత్మికముగ మహాభివృద్ధి చేకూరుచుండును. అట్టియవతారపురుషుడు శరీరము చాలించినపిమ్మట, వారిగురుముఖశిష్యుడు జీవోద్ధారకార్యమును సాగించుచుండును. అతడేతరగతికిచెందినసిద్ధి పొందియున్నాడో, జీవులకతనివలన లభ్యమయ్యెడిఆధ్యాత్మికలాభము దానిననుసరించినతరహాగానే యుండును. ఆగురుముఖుడు మొదటితరగతిసిద్ధిని, అనగా సాయుజ్యసిద్ధిని పొందినవాడైనచో, నాయన ద్వారా సాధనలనభ్యసించు శిష్యులకు, సాక్షాత్తుఅవతారపురుషునివలనచేకూరునంతటి యాధ్యాత్మిక లాభము లభించగలదు.

## 52. అవతారపురుషులు వచ్చుటకుముందు జరిగెడి సన్నాహము.

ఒక్కొక్కపుడు, ఒకమండలాధిపతి యవతరించుటకుముందుగా వారి మహిమను (కొంతవరకే యాగాక) లోకమునప్రకటనచేసి, వారికొరకుత్రోవ తయారుచేయుట అవసరమగుచుండును. అందుకొరకై, ఆమండలాధిపతి తన నిజతత్వమునుండి పుట్టిన ఆత్మనెవరినైనను (అట్టి ఆత్మను ఆ అధిపతియొక్క నిజపుత్రుడనికాని, ఆయన ధామునివాసియైన ఆత్మ అనికాని చెప్పుదురు) అందుకు అవసరమైనబలమునిచ్చి, ఈలోకమునకు ముందుగా పంపుచుండును. ఈమహాసృష్టియొక్క ద్వితీయమహాఖండమైన బ్రహ్మాండదేశముయొక్కటే కాక, నిర్మలచైతన్యదేశముయొక్క, గుప్తరహస్యములుగూడ నీలోకములో ఈనియమముననుసరించియేప్రకటింపబడినవి. ఈనియమప్రకారమే సంతులు, అనగా, నిర్మలచైతన్యదేశమునకు సంబంధించిన, సాలోక్యసిద్ధికాని, సారూప్యసిద్ధికాని సామీప్యసిద్ధికాని, సాయుజ్యసిద్ధికాని పొంది ఆదేశములోని వేర్వేరు మండలాధిపతులయంశలు లేక నిజపుత్రులైనసిద్ధపురుషులు భూలోకమున నవతరించిరి. ఈరకమైనయవతారములువచ్చుట కబీర్ సాహెబ్ వారిశుభాగమనముతో ప్రారంభమయ్యెను. వారు అలఖ, అగమలోకములకుపైనున్న సర్వోన్నతమైన రాధాస్వామిధామమునుండి దయచేసినట్లు వారువ్రాసిన కొన్నిశబ్దములనుబట్టి (అనగా పద్యములు) బహుస్పష్టముగాఋజువుఅగును. కబీర్ సాహెబ్ వారు నిజపరమసర్వేశ్వరుడగు రాధాస్వామి దయాళుని నిజపుత్రులు, తమనిజపరమపిత

యొక్క మహనీయాజ్ఞల నీలోకమున కందజేయునిమిత్తమై వారలోకవార్తా వహులనివలె ముందుగా దయచేసిరి. కాబట్టి వారిక్రిందివద్యభాగములో నీవిష యములను సూచనారూపముగ తెలియజేసిరి:—

"కహైం కబీర్ హమ్ ధుర్ ఘర్ కే భేదీ
లాయే హుకుమ్ హుజూరీ"

అనగా సర్వోన్నతమైన మూలధామముయొక్క రహస్యము తెలిసిన కబీర్ సాహబ్ వారు, హుజూర్ వారి అనగా పరమసర్వేశ్వరుని ఆజ్ఞను తీసికొని వచ్చితిమని సెలవిచ్చుచున్నారు.

కబీర్ సాహబ్ వారియనంతరము ఇతరసంత్ మహాత్ములుకూడ నీలోక మున అప్పుడప్పుడుఅవతరించిరి. వారెవరనగా, గురునానక్ సాహబ్ వారు, జగ జీవన్ సాహబ్ వారు, పలటూదాసు, హాథ్‌రస్‌నివాసులగు తులసీసాహబ్ వారును. (వీరు తులసీరామాయణము వ్రాసిన తులసీదాస్ అనెడి కవీశ్వరు లనిపొరపడరాదు.) వీరుగాక వీరికన్న కొద్దిగా తక్కువ తరగతికి చెందిన పురు షులుగూడ నీలోకమున నవతరించిరి. ఎవరనగా, గరీబ్ దాస్, దూలందాస్, చరణదాస్, నాభాజీ. దరియాసాహబ్, రైదాస్, సూరదాస్, శమ్సత్ బరేజ్, మన్‌సూర్, సర్మద్, మోయినుద్దీన్ చీస్తీ.

## ౯౩. సంతులందరి యుపదేశములును ఒకేవిధముగనున్నవి.

ఆంతర్యసాధనలఅభ్యాసమునుగురించి అందరుసంతులు, సిద్ధపురుషులును సెలవిచ్చిన ఉపదేశములు బోధలన్నియు నొకేతీరున నున్నవి. అందుకే వారం దరును సత్యనామము, సద్గురువు, సత్సంగములయొక్క యావశ్యకతను, మహి మను గురించియే బోధించిరి. సత్యనామమనగా యథార్థమైననామమనియర్థము. యథార్థనామమును అనగా చైతన్యనామమును ఆంతర్యమున శ్రవణముగాని, స్మరణగాని చేయుచుండవలెననియే వారందరిబోధయునై యున్నది, సద్గురు వనగా యథార్థమైనగురువు, అనగా స్వయముగ నిర్మలచైతన్యదేశమును చేరుకొని, తమశిష్యుల నాదేశమునకు తీసికొనిపోగల సమర్థతగల సిద్ధపురుషులని యర్థము. యథార్థగురువునిలక్షణములనుగురించి గురునానక్ సాహబ్ వారి క్రిందివిధముగ సెలవిచ్చిరి:

ఘరమేం ఘర దిఖలాయు దే;
సో సతగురు పురుష సుజాన్;
పంచ శబ్ద ఝునకార్ ధున్
తహాం బాజైం శబ్ద నిశాన్.

అనగా, భవనములోపల భవనమును కనుపఱచగల సిద్ధపురుషుడే సర్వజ్ఞుడైన సద్గురువు. అయిదు వేర్వేఱుస్థానములనుండి అయిదు వేర్వేఱుశబ్దముల ఝుంకారములుత్పన్నమగుచున్నవి. సత్సంగము అనగా యథార్థమైనసాంగత్యము, లేక సహవాసము. నిర్మలచైతన్యమొక్కటే అవినాశియైనదగుటవలన అదే నిజమైనసత్యవస్తువు. ఈజగమున అసత్యవస్తువుయొక్క సజీవజాగ్రిత్స్వరూపమే సద్గురువుకావున,వారిసాంగత్యములో మసలుచుండుటయే బాహ్యమైన సత్సంగమని పేర్కొనబడును. ఆంతర్యమున చైతన్యధారతో సాంగత్యము చేయుట, అనగా, ఆంతర్యచేతన్యశబ్దములను లోలోపల ఆకర్ణించుటయు, చైతన్యనామములను ఆంతర్యమున ఉచ్చరించుచుండుటయును, వీనినే ఆంతర్య సత్సంగమని చెప్పుదురు. ఇంతియుగాక, సద్గురువునకు తమశిష్యులచైతన్యఘట్టములందు ప్రవేశించగలశక్తియుండును కావున నాశిష్యులుప్రార్థించనక్కఱలేకుండగనే, సద్గురుస్వరూపమును శిష్యులు ప్రేమతో ధ్యానము చేసినప్పుడుకాని సద్గురువుని దయాకటాక్షములను వారు మానసికముగ స్మరించుకొన్నపుడు కాని సద్గురుదర్శన మాంతర్యమునలభించినచో,అదికూడా ఆంతర్యసంత్సగముగా చెప్పబడును.

## 54. రాధాస్వామీదయాళుని శుభాగమనము

పైనుదహరించిన సంతులును, సిద్ధపురుషులును జీవోద్ధారకార్యక్రిమములోముందంజవేయుటకుతగినట్లుగా క్షేత్రిమును తయారుచేసి యుంచినపిమ్మట సర్వోన్నతచైతన్యధామాధిపతియైన హుజూర్ రాధాస్వామీ దయాళురే స్వయముగ నవతరింపననుగ్రిహించిరి. వారుదయచేసినపిమ్మట సంతుమతములోనంతకుపూర్వము ప్రచారములోనున్న సిద్ధాంతములు, బోధలు, సాధనలును, అతిసరళరూపమున ప్రకటించబడి, అభ్యాసవిధానముగూడ, నందఱును— పురుషులు, స్త్రీలు, యువకులు, వృద్ధులు, ఎవరైననోగాక— పాటింపచేక

మములనుమాత్రము పాటించినచో నేకష్టములేకుండా జయప్రదముగ సాగించు కొనగల్గునంత సులభము చేయబడెను.

ఈరచన యేతీరుననే యుద్దేశ్యముతో సృజింపబడినదో ఇంతవఱకెవరికిని బోధపడలేదు. సంతులుగూడ నీవిషయమునుగుఱించి యెక్కువగావివరించలేదు. అయినను, రాధాస్వామిదయాళురుమాత్రి మీగుప్తవిషయమును పరిపూర్ణ రూపమున ప్రకటముచేసి, పూర్వకాలమునాటిసంతులు ప్రకటనచేయనట్టి సర్వో న్నతధామముయొక్క శబ్దమైన నిజనామమునుగూడ ప్రకటింపననుగ్రహించిరి. తమచే వెల్లడిచేయబడిన గూఢవిషయముల వాస్తవత్వమును స్థిరపఱచునిమి త్తమై, ప్రతిదినము తమయాధిపత్యమున జరిగించబడుచుండినసత్సంగములో న్యాయశాస్త్రసమ్మతమైన హేతువాదములతోగూడిన యుత్కృష్టతపచనము లను సెలవిచ్చుచు నావచనములను, సామాన్యానుభవవిషయముల దృష్టాంత మునిచ్చియు, ఆధ్యాత్మికాభ్యాసముద్వారా ఆంతర్యానుభవములనిదర్శనముల నిచ్చియు, సమర్థించుచుండెడివారు. హుజూరురాధాస్వామిదయాళురు ప్రకట పఱచినయద్భుతవిషయములను వైజ్ఞానికశాస్త్రపద్ధతిననుసరించి యీగ్రంథ ములో వివరించబడినదంతయు వారుసెలవిచ్చినయద్భుతామృతవచనములపైననే ఆధారపడియున్నది.

## ౕ౫. ఆధ్యాత్మికసాధనలను సాగించునిమిత్తము సమకాలికసద్గురువు ఆవశ్యకము.

సంతులు,సిద్ధపురుషులును ఈలోకమునకుదిగివచ్చుటచే వారిచైతన్యమున కేయేఘట్టములతోసంబంధమేర్పడెనో ఆయాఘట్టములన్నిటినుండియు,తమచైత న్యమును తమశరీరత్యాగసమయములో వెనుకకుతీసికొనిపోవుదురు. ఐనను వారీలోకమునుండి వెనుకకువెళ్ళెడిప్రయాణము ,మామూలుమానవులమరణము వలెనుండదు. వారికావిషయము మొదటినుండియు తెలిసియేయుండి వారీ జగమున నవతరించిన మహోద్దేశ్యము, లేక దివ్యేచ్ఛ పూర్తియైనపిమ్మటనే అట్టిపరిస్థితిగల్గును. ఆమహాపురుషు లీశరీరములో విరాజమానమైయున్నంత కాలము వారిచైతన్యము మహాప్రభావవంతమైయుండుటవలన, వారిస్పర్శతగిలిన ప్రతివస్తువులోను ఆచైతన్యప్రభావము కొంతవఱకు ప్రవేశించి వానిని ప్రసాద ముగచేయుచుండును. అట్టిప్రసాదపదార్థములను తాకినవారికిని ఉపయోగించు వారికిని, పారమార్థికలాభము సేకూరుచుండును. అయినను వారు గుప్తమైన బోధనే వారేమండలమునుండి దిగివచ్చిరో ఆమండలాధిపతిశక్తి యీలోక

ములో ప్రకటరూపమున వని చేయుట కట్టిపోవును. ఈసృష్టిలో నొకలోకము యొక్క విశిష్టచైతన్యము దానిక్రిందిమండలములోనికి వడియకట్టినట్లు చిన్నచిన్న చుక్కలుగా కారవలసినదేకాని, తిన్నగాప్రవహించుట నియమవిరుద్ధముకావున నట్టివిశిష్టచైతన్యములో బహుస్వల్పభాగముమాత్రమే క్రిందికిదిగివచ్చును. అందుచే సంతులును, యితరమహాపురుషులును ఇచ్చటిజీవులకు ఆధ్యాత్మిక సహాయమును, వారిలోకమువనున్నపుడు గలుగజేసినవిధముగా, తాముగతించిన తరువాత పైనియమమునతిక్రమించి కలుగజేయరు. ప్రేతజీవులకు మరణహేతువుచే స్థూలశరీరముతో బంధనము విడిపోయినను ఐహికబంధనములు, ప్రాపంచిక వాసనలును యథాప్రకారమేయుండిపోవునుగావున, వారు (ఈష్వధిపియొక్క ఆకాశమండలములోనే ఈష్వధిపికిసంబంధించియున్నట్టి) తమసూక్ష్మమండలము నుండిదిగివచ్చి తమకుప్రేమగల బంధుమిత్రులను కలిసికొనుటయు, నదిగాక నొకప్పుడు సదుద్దేశ్యములతోను, ఒకప్పుడు దురుద్దేశ్యములతోను ప్రాపంచికవిషయములలో కలుగజేసికొనుటయుకూడ జరుగుచుండును. కాని యీ ప్రపంచము నందు ప్రాపంచికపదార్థములయందును ఎట్టిఆసక్తియు లేకుండా, కేవలము తమ మండలాధిపతియొక్క ఆజ్ఞానుసారము జీవులకాధ్యాత్మికలాభము గలుగజేయు నుద్దేశ్యములో, నీప్రపంచమున నవతరించినట్టి సాధువులు, సంతుమహాత్ములును మాత్రము వారు తిరిగి తమనిజధామమును చేరుకొన్నపుడు ప్రాపంచికవ్యవహారము లలో నెట్టిసంబంధము నుంచుకోరు. అందువలననే సంతులందరును సామాన్యముగను, రాధాస్వామీదయాళుని యవతారపురుషులు ముఖ్యముగను, అంతరాభ్యాసముజయప్రదముగ సాగుటకు సమకాలికసద్గురువుండుటఆవశ్యకమని గట్టిగ నొక్కిచెప్పిరి. ఆత్మవిద్య కేవలము అభ్యాసముమీద ఆధారపడునట్టి బహు సునిశితరహస్యవిషయము. ఈవిద్యనేర్చుకొనునిమిత్తమై తనకంతకుముందెన్నడు తెలియనట్టి యాంతర్యఘట్టములమీద నియమపూర్వకముగ ప్రతిదినము నభ్యాసముచేయవలసియుండును. అందుచే ఆయభ్యాసముసాగుటకు, సంతుల పవిత్రగ్రంథముల పారాయణయొక్కటే చేయుచుండుట చాలదు. సద్గురువు యొక్క అంతర్యబాహ్యసహాయములురెండును అడుగడుగునకు నున్నపుడే ఆయభ్యాసము జయప్రదముగసాగును, వాస్తవముగ సమస్తాపదలకును మూలకారణము అహంకారమే. ఇచ్చట నహంకారమనగా మాయభిప్రాయము "అహం"మ్మనెడి యభినివేశమేకాని స్వాతిశయమును గర్వమును అనికాదు. అనగా స్వార్థపరమార్థవిషయములలో జరుగుచున్నదంతయు నాకార్యములు చేయుకర్తయొక్క శక్తిసామర్థ్యములమూలముననే జరుగుచున్నదని యున్న

కొనుచు నే చైతన్యభండారమునుండి ఆశక్తిసామర్థ్యములు కర్తకు లభించినవో అట్టి చైతన్యభండారమును మఱచిపోవుటయే అహంకారమని యర్థము. ఇట్టి లక్షణము జీవునిలోనున్నంతకాలము అతనియాత్మ యున్నతస్థానములందు ప్రవేశించుట యసాధ్యమైపోవును. ఏలనన, సంతవఱకు నతడు తనమనోరూపమైన "అహం" చుట్టూనే తిరుగుచు దానినే స్వస్వరూపముగ భావించుకొనుచుండుటచే వాస్తవమైన ఆంతర్యగతియేమియు నతనికి కలుగనేరదు. ఈ 'అహం' కన్న పైనున్నఘట్టములనుండి సమస్తక్రియలను జరుపుచుండునట్టి సద్గురువొక్కరే శిష్యునికి దుర్ఘటప్రతిబంధమును తొలగించగలరు. శిష్యుడు తన సకలయత్నములును విఫలమైనపిమ్మట అధైర్యనిరాశలకులోనైపోయిన సమయములలో సద్గురువు శిష్యునిపైన అతడు ప్రార్థించనక్కఱలేకుండగనే ఇట్టిదయచూపుచుందురు. అభ్యాససమయములో నివ్విధమగు ననుభవములు శిష్యునికి తఱచుగగల్గినమీదట, నతని భావములు, స్వభావముకూడ క్రమక్రమముగ మార్పుచెందనారంభించును. రానురాను శిష్యునిలో తనశక్తిసామర్థ్యముల యహంకారము ఛిన్నభిన్నములై శిష్యునిమనస్సున నిజమైనదీనత్వముదయించి, అతడు దయాసహాయములనుపొందునిమిత్తమై తనశ్రద్ధను, లక్ష్యమును ఆంతర్యమున నూర్ధ్వమండలమువైపునకు తఱుచు మఱల్చుకొననారంభించును. మాటిమాటికి నట్లుచేయుట కలవాటుపడినమీదట శిష్యునిమనోఘట్టము మాఱిపోయి, కొంతకాలమున కతనిలో నున్నతఘట్టములశక్తులు కొంతవఱకు మేల్కొని అతనికి క్రొత్తవిధమైన స్వాతంత్ర్యము, క్రొత్తవిధమైన ఆనందము నవీనదృష్టియు చేకూరినట్లు అనుభవరూపమైన సూచనలుగలుగును. అపుడు అతడపరిమితానందపరవశుడై పోవును. ఇంతియగాక నతనికి అప్పుడు అహంకారములో నంతర్గతముగా దాగుకొని పూటుగానిండియున్నట్టి మహావిపత్తులన్నియు స్పష్టముగకన్పించదొడగి, భక్తియొక్క మహిమయు, భక్తిభావములోని మహానందస్వారస్యములును చక్కగా బోధపడనారంభించును. భగవచ్చరణములవద్దకు భక్తజనుల నతివేగముగగొనిపోవుశక్తిసామర్థ్యములుగల యిట్టినిర్వ్యాజనిర్మల భక్తి ఒక్క ప్రత్యక్షసద్గురువుని సహాయముమూలముననే యుదయించగ.దని తెలిసికొనదగును. భక్తిసాధనలో నభివృద్ధిచెందినభక్తులు తమకన్న వెనుకపడియున్న సోదరులకు, తమ సత్ప్రవర్తనప్రభావముమూలమునను, తమయాంతర్యానుభవములను తెలియజెప్పియు, వారిభక్తివిశ్వాసములకుత్తేజనముమాత్రమే కొంతవఱకుచేయ గల్గుదురుకాని, ఏఆత్మకైనను తనప్రస్తుతనివాసస్థానమును వదిలి ఉన్నతమండలములవైపునకుత్క్రమించులాగున సహాయమును ప్రత్యక్ష

సద్గురువాక్కులే చేయగలరు. అనగా, శిష్యుడెల్లప్పుడును సమకాలిక సద్గురువుని సన్నిధానముననే యుండవలయునని దీనియభిప్రాయముకాదు. సమకాలికసద్గురు వీప్రపంచమున విరాజమానులై యుండిన చాలును. ఏలనన, వారున్నంతకాలము వారిచైతన్యశక్తి సమస్తమైనయూర్ధ్వఘట్టములందును క్రియాశీలమైయుండును కావున, వారెంతదూరముననున్నను తమశిష్యునకు ఆధ్యాత్మిక సహాయము నొసగూర్పగలరు. ప్రస్తుతములో బ్రహ్మాండమునకుగాని నిర్మలచైతన్యదేశమునకుగాని సంబంధించిన ప్రచలితమతములన్నియు సఫోగతివాలకుటకును, వానిలో నాంతర్యమార్గమున ప్రయాణముచేయుట పూర్తిగ కట్టువడిపోవుటకును ప్రధానకారణము, ఆమతములలో నిక్కాలమున యథార్థమైన ప్రత్యక్షసద్గురువు లేకపోవుటయే. ఆంతర్యమార్గమున నిరంతరాభివృద్ధిగలుగవలెనన్నచో సద్గురుపరంపర అవిచ్ఛిన్నముగాగాని, లేదా స్వల్పవ్యవధులతో త్వరత్వరగాగాని వెలుగుచుండినపుడే సాధ్యమగును. ఒకసద్గురువు గుప్తమైనపిమ్మట మరొక సద్గురువు ప్రకటమగువఱకునుగల మధ్యకాలములో, శిష్యులకంతవఱకుగల్గిన చైతన్యశక్తి పుష్టిప్రౌఢిమల నొందుచు తరువాతసద్గురువు ప్రకటమైనప్పటినుండి అప్పుడాముల మీద నింకనెక్కువగా వృద్ధినొందుటకు వీలుండును.

## ౫౬. సంత్సగము

ఇప్పుడింక సమకాలికసద్గురువుయొక్క ఆధిపత్యమున నుపాసన యెట్టివిధమునచేయబడునో, అనగా సత్సంగముసాగించబడునో కొంతవివరించుట యసంగతముకానేరదు. ఈయుపాసన, లేక, సత్సంగమే ఆంతర్యాభ్యాసమునకును, ఆత్మవిద్యకును సంబంధించిన నిజమైన ప్రయోగాత్మకబోధనొసంగెడి శిక్షాప్రబంధము.

ఆయుపాసనాకార్యక్రమమంతయు సద్గురువే అధిష్ఠాతగనుండి నడిపించునుకావున, వారిఅమృతవచనముల నందఱును ననాయాసముగవినగల్గుటకుమాత్రమై సద్గురు వొకయున్నతాసనమున విరాజిల్లుదురు. స్త్రీపురుషులిరువురును కూడ సత్సంగసమయములో హాజరగుచుందురు. కాని స్త్రీల ఘోషాకులోపము లేకుండునట్లు స్త్రీలకు,పురుషులకును వేఱువేఱు ప్రక్కల కూర్చుండుటకేర్పాట్లు చేసి, మధ్యనొకతెర అడ్డుగాకట్టబడును. సత్సంగేతరులు ప్రత్యేకానుమతిపొందకుండా, సత్సంగసమయములోవచ్చి హాజరగుటకువీలులేదు. కాని ఆధ్యాత్మిక సాధనలను నేర్చుకొనగోరి, సంతుమతసిద్ధాంతముల నవగాహనచేసికొనదల్చిన

హాలందఱకిని అట్టి అనుమతి సామాన్యముగ నీయబడును. సత్సంగసమయములో సత్సంగేతరులను రాకుండనిషేధించుటకు ప్రధానకారణ మిద్దియనగా, సత్సంగులు తఱుచుగా ఆసమయములో శబ్దాభ్యాసముచేయుచుందురు.

సత్సంగములో మొట్టమొదట సత్సంగులందఱును కలిసి మంగళాచరణ శబ్దమును పఠించుదురు. మంగళాచరణశబ్దములో రాధాస్వామిదయాళురు జీవులకు ఈయథార్థముక్తిమార్గమును ప్రకటించి అనుగ్రహించిన అపారవరదానమును గుఱించియు, వారిశరణాగతభక్తులు శాశ్వతపరమానందస్థానమైన నిర్మల చైతన్యధామమునకు ఆంతర్యప్రయాణము సాగించుకొనుసమయములో, రాధాస్వామిదయాళురు వారిపైన అవిరతముగవర్షించెడి యపారదయనుగుఱించియు, కృతజ్ఞతాపూర్వక వర్ణనలుండును. అదేతీరున చిట్టచివర, నొకబినతి శబ్దము పఠింపబడును. కాని బినతిశబ్దములోని విషయములు మంగళాచరణములోని విషయములకన్న భిన్నముగనుండును. అతివిస్మరణశీలురును(మఱపుస్వభావముగలవారును) కేవలము దుర్బలులును అయినట్టి తమ పిల్లలైన సమస్త జీవులకును పరిపూర్ణసహాయ మనుగ్రహించుడని పరమదయాళురైన పరమపితచరణములందు బినతీశబ్దములో ప్రార్థనచేయబడును. ఏలననగా వారి సహాయసంరక్షణలులేనిదే జీవుడు తనపరిపూర్ణోద్ధారమునకు సంబంధించిన కార్యక్రమము నెంతమాత్రము నిర్వహించుకొనజాలడు. అదికాక, జీవుల హృదయములలో నావరమసర్వేశ్వరునిచరణకమలములందు నిర్మలప్రేమగల్గునట్లనుగ్రహించవలయునని కూడ నీబినతిశబ్దములో మరియొక విన్నపముచేయబడును. ఏలననగా, నీరెండుమహానుగ్రహములును దయచేయనిచో జీవునకు పరమసర్వేశ్వరునిదర్శనభాగ్యము, వారిపరమపవిత్రనిజధామమందు నివాస భాగ్యము నెన్నటికిని లభ్యముకానేరవు.

మధ్యలో, అనగా, మంగళాచరణముబినతీశబ్దపాఠముల మధ్యసమయములో, సంతుల గద్యపద్యాత్మక పవిత్రగ్రంథములలోనుండి కొన్నిభాగములు నియమప్రకారము పఠింపబడుచుండును. ఆపవిత్రగ్రంథపాఠక్రమములో కఠిన వచనమేదైనను, అనగా సులువుగా అవగాహనకానట్టివచనమేదైననువచ్చినచో సంత్ సద్గురువు దానికర్థమునైనను వివరించి చెప్పుదురు, లేదా ఆవచనములోని విషయముపైన నొకప్రత్యేకవిమర్శయైనను చేయుదురు. ఇంతియగాక నదేసమయములో సంతసద్గురువు సంతుమతసిద్ధాంతములకును, ఆంతర్యాభ్యాసవిధానమునకును సంబంధించిన విషయములపైన వైజ్ఞానికపద్ధతిని యుక్తియుక్తమైన

అనగా మూర్ఖజీవులకు అసలురహస్యము తెలియదు. సత్సంగముతో అమృతవర్షము కురియుచుండును.

## 57. ప్ర సా ద ము.

పేరిమిాసత్సంగ్ము లో‌కొక్కొకపుడు సత్సంగముప్రారంభమగుటకుముందు సంత్ సద్గురువునకు పుష్పహారములు వేయుచుందురు. వారిపవిత్రస్పర్శచే నాపుష్పహారములు పావనమైనపిమ్మట, వానిని సత్సంగులందఱకును ప్రసాదముగ పంచిపెట్టుదురు. అటులనే ఒక్కొకపుడు మిఠాయిమున్నగు తినుబండారములనుగూడ వారు స్పృశించిన పిమ్మట పంచిపెట్టుదురు. ఆపదార్థములన్నియు సత్సంగములో ప్రసాదముగ నెంచబడును. కాని సత్సంగమునకు వచ్చువారి సంఖ్య రోజురోజు పెరిగిపోవుచుండినందున నీకార్యమునకై అధికసమయము వెచ్చింపవలసివచ్చుచున్నది. అందుచే నీఆచారములు తగ్గింపబడుచున్నవి. సత్సంగ మిావిధముగనే అభివృద్ధియగుచు సత్సంగులసంఖ్య వందలు వేలకొలది పెరిగిపోయినచో నీయాచారములను పూర్తిగకట్టిపెట్టవలసియుండును.

## 58. ప్రసాదము, — చరణామృతము — ఆరతి — వందనము.

సద్గురు వప్పుడపుడు తమదగ్గరనున్న శిష్యులకు ప్రత్యేకప్రసాదము గూడ ననుగ్రహింతురు. దీనిసిద్ధాంమునుగుఱించి ఈప్రసంగములోనే మును ముందు వివరించెదము. సద్గురునిభుక్తశేషము, వారుధరించినవస్త్రములు, వారి చరణామృతమును, మహాచైతన్యపూరితములుగ భావింపబడుచుండును. అవి శిష్యులెవరికిలభించిన వారే, ఆధ్యాత్మికలాభముపొందునిమిత్తమై ఉపయోగించుకొనుచుందురు. ఒక్కొకపుడు సంత్ సద్గురువు సత్సంగులకు తమచరణములపై దండప్రణామములుచేయుటకుకూడ అనుమతియిచ్చి, ఆవిధముగా తమచరణోద్గతమగు చైతన్యధారను సత్సంగులుస్వీకరించుకొనునట్లు చేయుచుందురు. కాని యీావిధముగ ప్రణామములు చేయుటకు అనుమతి చాలకొద్దిమందికి మాత్రమే యీాయబడును. అయినను, ప్రసాదముచేసిన పదార్థముల నుపయోగించుటయు పైవిధముగప్రణామములొనర్చుటయు సత్సంగకార్యక్రమములో నొక యంగముకాదు. అప్పుడప్పుడు సత్సంగులకు తమదృష్టిని సంత్ సద్గురుని దృష్టితో కలుపుటకు అనుమతి యియ్యబడును. అట్టిసమయములో సంత్ సద్గురువుకూడా

ఈపరిసంగారంభమున సూచించినప్రకార మిపుడు మేము ప్రసాదము చతుర్విధములుగా చేయుటలోని సిద్ధాంతమును వివరించెదము. పుష్పహారములుమున్నగువానిని స్పర్శచే ప్రసాదముచేయుటలోగల సిద్ధాంతముగూడ నిందులోవివరింపబడును.

ఒకజంతువును స్పృశించినపు డా జంతువుశరీరములోనిపదార్థముయొక్క ప్రభావము స్పృశించినవానిశరీరములో ప్రవేశించునని యందఱకును దెలిసిన విషయమే. ఉదాహరణార్థము కొన్నిపురుగులవిషప్రభావము ఆపురుగులను తాకినవెంటనే స్పృశించినవానిశరీరములో ప్రవేశించి, అప్పుడప్పుడు శరీరముపైన బొబ్బలుకూడ పొటమరించును. ఈధర్మమొక్క పురుగులలోనేగాక కొంతమట్టుకు సమస్తజంతువులలోను గలదు. దీనినిబట్టి ప్రతిశరీరములోని సహజచైతన్యము నాశరీరము ద్వారా తనబీజమునకనుగుణమైన ప్రత్యేకప్రభావమును ఇతరశరీరములలో కలుగజేయుననిసిద్ధించుచున్నది. ప్రసాదముమూలమునప్రభావముకూడా ఇటులనే గల్గుచున్నది. కాని స్థూలఘట్టము (అనగాస్థూలశరీరము) యొక్క ప్రభావము స్థూలశరీరముమిాద నెట్లుగల్గుచున్నదో, ప్రసాదముయొక్క ఆధ్యాత్మికప్రభావము అట్లే ఆధ్యాత్మికఘట్టముమిాద వ్యక్తమగుచుండును. ఆధ్యాత్మిక శక్తి కొంతవఱకుప్రబోధమునొందినభక్తుడు ప్రసాదమైనతినుబండారమును, తనకదిప్రసాదమని తెలియకనే, తినినప్పటికిని దానియాధ్యాత్మికప్రభావము వెంటనే అతనికిగోచరించగలదు. అదియునుగాక హిప్నాటిజము చేయబడిన మనిషికి మఱొకమనిషిచే నుపయోగించబడినవస్తువుద్వారా ఆరెండవమనిషితో సంబంధమేర్పఱచుకొనుట సుసాధ్యమని చెప్పబడినవిషయము సరియైనచో, దీనివలన గూడ మేము పైననిర్వచించినసిద్ధాంతము బలపడగలదు. వేటకుక్కలు వేటమృగములజాడను పసిగట్టువిధముగూడ నీసిద్ధాంతముపైననే ఆధారపడియున్నది. ఏలనన, వేటమృగము పారిపోవునపుడు త్రోవలో నొకవిధమైన గంధము లేక వాసనను విడిచిపెట్టుచుండును. వేటకుక్క లావాసనను పసిగట్టుచు, నామృగముజాడను కనుగొనగల్గుచున్నవి.

ఇతరపదార్థములన్నిటికంటెను (సమస్తతత్త్వములకు ప్రాణభూతమని చెప్పదగిన) విద్యుచ్ఛక్తికి చైతన్యశక్తితో పోలిక యెక్కువగ నున్నది. అందుచే చైతన్యశక్తికి సంబంధించినసిద్ధాంతములను సమర్థించు నిమిత్తమై విద్యుచ్ఛక్తిధర్మముల నుదాహరణగాదీసికొనుట యయుక్తము కానేరదు. విద్యుచ్ఛక్తితో నిండిన పదార్థములకు మఱొకవస్తువు అంటియుండినచో మొదటిపదార్థమునుండి విద్యుచ్ఛక్తి ఆ అంటియున్నవస్తువులోనికి ప్రవహించ

ప్రబంధము యాదృచ్ఛికమైనదిగాక రచనాక్రమముయొక్క నమూనాపై నచేయబడినదని తెలుపుటకై ప్రయత్నించితిమి. ఆసందర్భములో సూక్ష్మప్రపంచము (అనగా మానవశరీరము) యొక్క ముఖ్యభాగములు, ఉపభాగములును, అఖండప్రపంచము (విశ్వసృష్టి)యొక్క ప్రధానఖండోపఖండములకు అనురూపముగ నున్నవనియు, మానవశరీరములోని చక్రములలోగల ఛిద్రములద్వారా వీనికి పరస్పరసంబంధమున్నదనియు, అనగా మానవశరీరములోని చక్రములు అఖండప్రపంచములోనిమండలములకు చిన్ననమూనాలుగ నున్నవనియు గూడ చెప్పియుంటిమి. దీనినిబట్టి బాహ్యసృష్టిలో క్రియాశీలమైనశక్తిధారలు మానవశరీరములోగూడ చిన్నపరిమాణములోనున్నవని సిద్ధించుచున్నది. ఇంతియగాక శక్తియొక్క క్రియాశీలమైన అంశలైనట్టి (Kinetic force emanations) ఈధారలన్నిటినుండియు స్పందములు (Vibrations) ఉద్భవించి శబ్దములు ప్రతిధ్వనించుచుండునని యు, ప్రస్తుతము గుప్తముగనున్న మనచైతన్యశ్రవణశక్తిని మేల్కొల్పుకొనినయెడల ఆశబ్దప్రతిధ్వనుల నన్నిచోట్ల నన్నివైపులనుకూడ మనము వినగలమనియు నిదివఱకే (28, 30వ ప్రసంగములను చూడుడు)సమగ్రముగ వివరించియుంటిమి. ఒక్కొక్కధ్వనిలో నొక్కొకస్వరముండును. ఆస్వర మాధ్వనియొక్క స్పందములమీద నాధారపడియుండును. రెండు వేర్వేఱుధ్వనుల స్వరములు ఒకేవిధముగనుండి కలిసిపోయినచో నాధ్వనులు రెండును వెంటనే ఏకమైపోవును. ఆరెండు ధ్వనుల స్వరములు నేకముగానిచో నాధ్వనులు రెండును పరస్పరము ప్రతిఘటించును. పైనచెప్పినశబ్దములుకూడా ఈస్వరసమ్మేళననియమము (Law of harmony)ననుసరించి వానితో నేకస్వరములైన యితర శబ్దములతో గలియుచు, భిన్నస్వరములగు శబ్దములతో ప్రతిఘటించుచుండును. ప్రతిమండలమును, దానియధిపతియని పేర్కొనబడునొక కేంద్రికశక్తి (central power)మీద నాధారపడియుండును. ఆయధిపతి ఆమండలశక్తియొక్క భండారము లేక కేంద్రమైయుండుటచే నాశక్తిధార లాయధిపతినుండి బయల్వెడలి మండలములోనంతటను వ్యాపించును.ఆధారలతో కలిసి ప్రత్యేకవిధమైనధ్వనులుగూడనుండును. మనశరీరములోని వేర్వేఱుచక్రములలోగూడ బాహ్యమండలములలోవలెనే వేర్వేఱు శక్తిధారలుగలవు. కాని యీధారలు మండలాధిపతులనుండి యుద్భవించినధారలు ఆయామండలములలో క్రియాశీలమైయుండు విధముగా తమతమ చక్రములలో పనిచేయనేరవు. స్థూలశరీరము యొక్క రక్షణపోషణములకు సంబంధించినంతవరకుమాత్రము ఈధారలు ఆమండలాధిపతిధారలు చేసినట్లే కొన్ని కృత్యములను నెఱవేర్చుచుండును. కాని యీధా

రల చైతన్యధర్మములు, అనగా, జ్ఞానగ్రహణశక్తి (perception) అవగాహన శక్తి (Comprchension) శాసనశక్తి (Regulation) మున్నగునవి, గుప్తముగా, అనగా నిద్రాణముగనున్నవి. ఒక బాహ్యమండలముయొక్క కేంద్రము లేక అధిపతినుండి ప్రకటమగు శబ్దమునకు మనుష్యభాషలో అనుకరణ శబ్దమును, అనగా, నామమును ఆమండలమునకు సరిపోవునట్టి (మానవశరీరము లోని) చక్రమువద్ద నుచ్చరించుచుంటిమనుకొనుడు, అట్లు కొంతకాలము చేయగా ఈయభ్యాసము సరిగాచేయగల్గినపుడు ఆచక్రములో నీయభ్యాసము వలన పుట్టిన కంపనము బాహ్యమండలశబ్దముయొక్క స్పందముతో సమానమై పోవుట మొదలిడును. ఆరెండుస్పందములు పరిపూర్ణముగా సమానమైనపుడు ఆరెండుశబ్దములస్వరములునుకలిసి యేకమైపోవును. అట్లు ఈరెండుస్వరములు నేకమైపోవుటవలన, బాహ్యముగ నొక వాయిద్యముమ్రోగుచున్నప్పుడు ట్యూనింగ్‌ఫోర్క్ (Tuning fork) అను సాధనములో నాబాజాస్వరముతో కలిసినస్వర మెట్లుబయల్దేరునో అదేవిధముగా ఒకస్థానములో స్వరముయొక్క స్పందముబయల్వెడలినతోడనే అందుకుసరిపడిన రెండవస్థానమువద్దగూడ పట్టి కంపనమే ప్రారంభించును. ఈపరిస్థితికలిగినపుడు, మండలాధిపతియొక్క చైతన్య ధర్మములును, ఆంతర్యశక్తులును అభ్యాసిలో తమంతటతాము ప్రబోధమగును, ఆపరిస్థితివచ్చినపుడు అభ్యాసి, తన యాంతర్యమున పవిత్రనామము నుచ్చరించుట మూలమున, మండలాధిపతిచే తనధామములో చలాయించబడుచున్న మహా శక్తిని తనయిచ్ఛవచ్చినపుడెల్ల క్రియాశీలముచేయగలుగును. దీనినే పారమా ర్థికపరిభాషలో మంత్రసిద్ధి, అనగా పవిత్రనామములోని శక్తిని సంపాదించుట అని అందురు. చాలాకాలమువఱకును, ఆంతర్యనామోచ్చారణ కేవలము పైపై స్మరణగనేయుండి ఇంచుమించు నిష్ఫలముగనున్నట్లే యుండును. ఏలననగా, మనమనోవృత్తులన్నియు బహిర్ముఖముగ నుండినందున, నామోచ్చారణ ముచే, అనల్పైనస్వరముగల ఆంతర్యతంత్రి మ్రోగించలేకపోవుచున్నాము. ఈబహిర్ముఖవృత్తులు అభ్యాససమయమందు అనగా పవిత్రనామోచ్చారణ సమయమందు పలువిధములైన తలంపులను రూపములను లేవదీయుచుండును. అట్టితలంపులు, రూపములును చిత్తమునుచలింపజేయుటచే అభ్యాసమునకు మహావిఘ్నముగల్గును. అందుచే పవిత్రనామోచ్చారణమువలన చేకూరవలసి నంతఫలితము చేకూరదు. అభ్యాససమయములో నభ్యాసియాంతర్యమున నొక మహాసంగ్రామమువంటి పరిస్థితి గలుగును. ఈబహిర్ముఖవృత్తులు కొద్దిగొప్ప

పరాజితములగుచున్న, నేచక్రిము లోధారలనైనను మేల్కొల్పుట, అనగా, చైతన్యవంతములుగ చేయుట యసాధ్యము. మన బహిర్ముఖవృత్తులు, అనగా మాయికవృత్తులు, మనము పుట్టినదిమొదలు ప్రతిదినము నిరువదినాలుగుగంటలును తమతమ కృత్యములను తిరిగితిరిగి చేయుచుండుటచే, నవి బాగుగ వికసించి పుష్టినొంది యున్నవి. అందుచేనవి కొద్దిరోజులు, లేక కొద్దిమాసములు, లేదా కొన్నిసంవత్సరములుగాని కించిన్మాత్రము సాధనచేయుటచే పరాజితమైపోవుట యసంభవము. ఇంతియగాక చాలమంది సాధనచేయువారలకు పవిత్రనామము నాంతర్యమున సరిగ నుచ్చరించువిధానమే తెలియదు. ఒకవేళ వారేదోవిధముగ యథావిధిగనభ్యాసముచేసినను, పాపము, వారికి సరియైనసలహాసహాయముల నిచ్చువారెవరును కన్పించరు. ఈకారణమువలననే పవిత్రనామముల కీకాలమున మహిమలు పూర్వకాలములోవలె లేవనెడి యపోహ జనులలో ప్రాకిపోయినది. కాని యిది చాలపొరపాటు. ఇదివరలోవలెనే పవిత్రనామములలో నిప్పుడుకూడ మహిమ లేకపోలేదు. అభ్యాసవిధానమును సరిగ చెప్పి, తగిన సలహాసహాయములనుచేయువారీకాలమున దుర్లభమైపోయిరి. కావున పైవిషయములనుబట్టి, ఒకమండలాధిపతియొక్క శక్తిధారలవెంట జనించునట్టి ధ్వనికి మానవభాషలో అనుకరించునట్టి నామమును, (దానిశబ్దార్థములో నిమిత్తము లేకుండా) ఆమండలమునకు మానవశరీరములోనున్న అనురూపమైన చక్రమువద్ద, నాంతర్యమున స్మరణ, లేక, ఉచ్చారణచేసినయెడల స్వరసమ్మేళన నియమము (Law of Harmony) ననుసరించి ఆమండలాధిపతిశక్తులు అభ్యాసిలో ప్రబోధముకాగలవనెడిసిద్ధాంతము స్థాపితమగుచున్నది. ఖ్వాజా మొయీనుద్దీన్ చిశ్తీగారీసిద్ధాంతమునే యీక్రిందిద్విపదలో వివరించిరి :

"మియానే ఇస్మ వ ముసమ్మా చో ఫర్క నేస్త బబీం ।
తు దర్ తజల్లియే ఇస్మా జమాలే నామే ఖుదా ॥

అనగా, నామమునకును, ఆనామముచే ప్రతిపాదితమైనశక్తికిని తేడాయేమియులేదు. భగవన్నామముయొక్క మహాప్రకాశము భగవంతుని జాజ్వల్యమాన తేజోమయరూపముయొక్క దర్శనమిప్పించును.

సుప్రసిద్ధరామాయణ మహాగ్రంథకర్తయైన తులసీదాసుకూడ నీయభిప్రాయమునే క్రింది పద్యములో తెలియజెప్పిరి :

"గిరా అర్థ జల బీచి సమ ।
కహియత భిన్న న భిన్న ॥

ఒకేనామమును దానియర్థమును, జలమునకును జలములోని తరంగము లకును సమానముగనుండును, పైకిచెప్పుటకుమాత్రమే యవి వేఱుగాని, నిజ ముగ భిన్నములుగావు.

పైన వివరింపబడిన నామములన్నియు ధ్వన్యాత్మకనామములు, అనగా, వివిధమండలములధ్వనులకు మానవభాషలో అనుకరణ రూపములైన శబ్ద ములు. కావున నిట్టి నామములను, ప్రపంచములోనిపదార్థములను తెల్పునట్టి మాటలతోను, మానవుని భావములను ఆలోచనలను తెల్పుటకై యుపయో గించబడు శబ్దములతోను, కలగలుపు చేయకూడదు.

## 61. అన్ని ఆధ్యాత్మికసాధనల ముఖ్యోద్దేశ్యమును ఒక్కటే.

15వ ప్రసంగములోని వివరణమువలన ఆత్మకు నిర్మలచైతన్యదేశమందు నివాసము లభించినపుడే పరమార్థముయొక్కయుద్దేశ్యప్రాప్తి సిద్ధించునని బోధ పడును. ఇంతకుపూర్వము వివరించిన రెండుసాధనలును ప్రత్యేకముగ నీయుద్దేశ్యము సాధించునిమిత్తమే నిర్ణయింపబడినవనికూడ విశదపఱచితిమి. ప్రస్తుతము విమ ర్శింపబడుచున్న మూడవసాధనకూడ నీయుద్దేశ్యప్రాప్తికొఱకే యేర్పాటు చేయబడినది. మొదటిరెండుసాధనలకును, అనగా ధ్యానభజనాభ్యాసములకు చైతన్యధారయొక్క జాగృతియే, అనగా, ఆత్మనేకాగ్రముచేసి అటుపిమ్మట దాని నూర్ధ్వముగనారోహింపజేయుటయే ప్రధానలక్షణమైనట్లుగనే,ఈముందు చెప్పబోవు స్మరణాభ్యాసమనెడి మూడవసాధనకుగూడ ఆత్మను చైతన్యవంత ముచేయుటయె ప్రధానలక్షణము. ఏలననగా, ఈయుచ్చారణచేయబడు పవిత్ర నామమునకు కేవలము ఆధ్యాత్మికక్రియలతో, అనగా, చైతన్యాత్మకమైన ఆకర్షకక్రియలతోనే సంబంధముకాని మనోమాయలవృత్తులతోను శక్తులతోను సంబంధమెంతమాత్రము లేదు.

## 62. పవిత్రచైతన్యనామమునకు, సాధారణమంత్రములకును గల వ్యత్యాసము.

నిర్మలపారమార్థికమతములో కేవలము నితరులను వశముచేసికొనుశక్తిని గాని నాశనముచేయుశక్తినిగాని గలుగజేయు నామములకు అనగా మంత్రముల కెట్టి మహత్త్వమును లేదు. ఆత్మకు మనోమాయలదాస్యమునుండి విమోచన చేకూర్చు పవిత్రనామమొక్కటే అట్టిమతములో సేవింపబడును. కావున మొదటిరకము నామములనుగుఱించి యిచ్చట ప్రసంగించుటలో, జనులట్టి నామ

ముల నభ్యాసముచేయవచ్చునని మాయాశయముకాదు. మంత్రజపము యొక్క మూలసిద్ధాంతమును స్థాపించుట కుదాహరణనిమిత్తమైమాత్రమే ఇచ్చట వాని ప్రశంస చేయబడినది కాని సంత్ మతసాధనల కట్టిమంత్రములతో నేమియు సంబంధములేదు.

## 63. చైతన్యశక్తియొక్క లక్షణములు

హుజూర్ రాధాస్వామీదయాళురుప్రకటించిన యథార్థమైన పవిత్ర నామమును వర్ణించుటకుముందు నిజపరమ సర్వేశ్వరుని మహిమలను, అనగా, ప్రధానగుణములను వివరించి, ఆత్మశక్తి అనగా చైతన్యశక్తియొక్క (ఈసృష్టి యంతయు నా ఆత్మశక్తి ప్రభావమువలననే రచింపబడినది) వాస్తవలక్షణము లను పరిశీలించవలసియుండునని మాయభిప్రాయము.

ప్రకృతిలోనిశక్తులెవ్వియు కేంద్రము ధారలును లేకుండా పనిచేయజాల వని అందఱకు తెలిసినవిషయమే. అనగా ధారలు బయల్వెడలువఱకు శక్తి అవ్యక్తావస్థలోనేయుండి, ధారలుప్రకటమైనపుడు,(ధారలెప్పుడును ఆశక్తియొక్క కేంద్రములో క్షోభ అనగా పెద్ద తరంగము, బయల్వెడలినపుడే ఉత్పన్నమగు చుండును) అవ్యక్తస్థితిలోనుండి వ్యక్తావస్థలోనికి మాఱును,అనగా, క్రియాశీలమై దానిపనులనుచేయనారంభించును. దీనినిబట్టి శక్తియొక్క ధారలు భండారము లేక కేంద్రములేనిచో నెంతమాత్రము ప్రకటముకానేరవని తేలుచున్నది. ప్రకృతి శక్తుల ఈధర్మమునుఆదిశక్తియైనచైతన్యశక్తిగూడ పాలించుననిచెప్పవచ్చును. లేదా,ఆదిశక్తియైన చైతన్యశక్తినుండియే ఈలక్షణము లేక స్వభావముప్రకృతి శక్తులకు సంక్రమించినదనిచెప్పుట, బహుశా ఇంతకన్న నెక్కువయుక్తముగ నుండవచ్చును. మా ఈఅభిప్రాయము సరియైనచో, సృష్టికూడా ఈనియమాను సారమే ఉత్పన్నమైయుండునని, అనగా, చైతన్యశక్తియొక్క అనంత అపార సింధువైన నిజపరమసర్వేశ్వరునిలో నొక తరంగము లేక 'మౌజ్' మొట్ట మొదట బయల్దేరి యుండుననియు, అటుపిమ్మటనే దానినుండి చైతన్యధారలు ప్రకటమైయుండెననియు, నీరెండుపరిస్థితులు సంభవించనంతకాలము రచన ప్రకటముకాలేదనియు, అంతవఱకు నిజపరమసర్వేశ్వరుడుకూడా సృష్టికర్త రూపమున తన్నుతాను ప్రకటముచేసికొనలేదనియు, అంగీకరించవలసియుండును. ఈసమస్తసృష్టిని చైతన్యధారలు ఏవిధముగా రూపవంతముగావించినవో ఈ గ్రంథముయొక్కరచనాభాగములో సవిస్తరముగవర్ణించెదము. ప్రస్తుతము చైతన్యశక్తి యించుమించు చుంబనశక్తివలెనే పనిచేయుననియు, నదికూడ

నొకకర్మక్షేత్రము (Field of action) నేర్పఱచుకొనుననియు మాత్రము చెప్పిన చాలును. చుంబకశక్తియొక్క కర్మక్షేత్రములోనున్న బిందువులమీఁద చుంబకశక్తియొక్క ప్రభావము పనిచేయుచుండుటవలన, ఆబిందువులన్నియు నాశక్తియొక్క కేంద్రమువైపువకు వంపుగల్గి లేక మెలితిరిగి యుండును. చుంబకశక్తియొక్క యీఆకర్షణధర్మమునొక్కదానిని బట్టియే మనమాలోచించినయెడల ఆశక్తి తనకేంద్రమునుండిబయల్వెడలి తనక్షేత్రములోదూరముగాపోవుట దానిప్రకృతికి విరుద్ధముగకన్పించును. కాని చుంబకధ్రువములకు (Magnetic poles) తమచుట్టునున్నఆకాశమందలిఅణువములను (Ions అనగా సూక్ష్మపరమాణువులు) చుంబకములుగమార్చుజేయులక్షణమును (చుంబకశక్తి తనక్షేత్రమందు అంతటవ్యాపించినందువలననే యీక్రియసాగునుకదా) దృష్టియందుంచుకొనినచో నీధర్మమునెఱవేర్చుకొనుటకై చుంబకశక్తిధారలు ఆశక్తియొక్క కర్మక్షేత్రమందంతటను వ్యాపించి ఆకాశతత్వము (ether) లోని ఋణాత్మక ధనాత్మకసూక్ష్మపరమాణువులను (positive and negative ions) యథాక్రమముగా నాశక్తియొక్క ఋణాత్మకధనాత్మకధ్రువముల చుట్టును (positive and negative poles) వేఱువేఱుగ నుంచవలసియుండును. కావున నీవిరోధాభాసమాయమైపోవును. అనగా, చుంబకశక్తియొక్క ఆకర్షణక్రియకును, ఆశక్తి తన కేంద్రమునుండిబయల్వెడలి కర్మక్షేత్రమందంతటను వ్యాపించుటకును విరోధము లేనట్లుబోధపడును. మఱియునప్పుడు ఏఆకర్షకశక్తినుండియైనను ధారలు ప్రకటమగుపద్ధతికూడ బహుస్పష్టముగా అవగాహనకాగలదు, చైతన్యభండారమునుండి రచనారంభమున చైతన్యధారలుకూడా ఈతీరుననే ప్రకటమైనవని తెలిసికొనదగును.

64. చైతన్యభండారమునుండి ప్రకటమగుశబ్దమునకును, చైతన్యధారలనుండి ప్రకటమైనశబ్దమునకును గలభేదము,

చైతన్యభండారములో చైతన్యధారలు ప్రకటముకాకమునుపు బయలుదేరిన "మౌజ్", లేక, తరంగమును, ఆభండారమునుండి తదనంతరమందు ప్రకటమైన చైతన్యధారలును, నిజముగ నా యాదిశక్తియొక్క రెండుక్రియాశీలమైన ప్రకటరూపములని తెలిసికొనదగును. ఇదివరలో 60వ, ప్రసంగములో తెలిపిన సిద్ధాంతప్రకార మీరెండింటితోపాటు రెండుశబ్దములుకూడ ప్రకటమైయుండవలయునని యంగీకరించవలసియున్నది. తరంగమువెంటబయలుదేరిన శబ్దము ధారలవెంటబయల్వెడలినశబ్దముకంటె వేఱుగనుండుననికూడ స్పష్టమే. కాబట్టి రచనారంభమున ఆదిశక్తి రెండు క్రియాశీలరూపములలో ప్రకటమగుట

వలన చైతన్యభండారసంబంధమైన శబ్దమొకటియు, ధారలకుసంబంధించినశబ్దమొకటియు, మొత్తము రెండుశబ్దములు ప్రకటమైనవని సిద్ధించుచున్నది. భిన్నభిన్నమండలాధిపతుల అంతర్గతశబ్దములలో అనగా మండలాధిపతిప్రాణధారనుండి ప్రకటమగుశబ్దములలోగూడ నీభేదమున్నది. అనగా, భండారశబ్దమనియు ధారాశబ్దమనియు రెండుశబ్దములుండుచున్నవి. కాని యెవరు నీభేదమును పాటించలేరు. ఆయామండలాధిపతుల బహిర్ముఖక్రియలసందర్భములో వారినుండి ప్రకటమైనధ్వనులనుమాత్రమే గమనించి వానినే మంత్రరూపముగ జేసిరి. వేదములలో సర్వోత్తమపవిత్రనామముగ ప్రకటించబడిన "ఓం" మంత్రము, దానిలోనంతర్గతమైన చైతన్యశక్తివలనప్రకటమైన ధారాశబ్దము భండారశబ్దము అను రెండు శబ్దములను తెలియపర్చుట లేదు. "ఓం" మంత్రము బ్రహ్మనుండి అనగా బ్రహ్మాండీమనస్సునుండి బ్రహ్మాండములో నా యధిపతి సాగించు బహిర్ముఖక్రియల సందర్భములో ప్రకటమైన శబ్దముయొక్క దానికే మానవభాషానుకరణము. చైతన్యశక్తియొక్క మూలభండారమైనట్టి నిజపరమసర్వేశ్వరుడు కాక, తక్కిన మండలాధిపతులు తమతమ బహిర్ముఖక్రియలను జరిపించుసందర్భములో వారినుండి ప్రకటమైన ధ్వనులకును, ఆయామండలాధిపతుల ఆత్మలో పుట్టిన తరంగమునుండి ప్రవహించిన శక్తిధార నుండి ప్రకటితమైనశబ్దమునకును గలవ్యత్యాసమిాక్రిందియుదాహరణవలన తేటపడగలదు. మనలోసంకల్పవికల్పములనుబుట్టించు మనస్సనెడిసాధనము మనశరీరములోనున్న ఆత్మకేంద్రమునుండి లభించు చైతన్యశక్తిపైన నాధారపడి తనక్రియాకలాపమును నెఱవేర్చుకొనుచున్నదనియు, మనోఘట్టముమిాదికి ఆత్మయొక్కచైతన్యశక్తి ప్రవహించినప్పుడే మానసికక్రియలు— (అనగా మనన (ఆలోచన) చింతన (వివేచన) బోధ (జ్ఞానగ్రహణ) అహంకారములు)- ప్రకటమగుచున్నవనియు, నిదివరకే చెప్పియున్నాము. మానసికక్రియలధర్మములును, ఆత్మయొక్కయు, దానిధారలయొక్కయు క్రియల ధర్మములును (ఆత్మధారలద్వారానే మనస్సునకు ప్రాణములేక చైతన్యశక్తిలభించుచుండినను) బొత్తిగా పరస్పరభిన్నములైనవని అందఱకును తెలిసినవిషయమే. మానసికక్రియలసందర్భములో మనోఘట్టమునందుగలుగు స్పందములును శబ్దములును ఆత్మశక్తిలేక చైతన్యశక్తి మనోఘట్టముద్వారా ప్రవహించుటవలనగల్గినవే. అయినను, ఈశబ్దములు ఆత్మరధాలనుండి ప్రకటమగు శబ్దములకంటె, నీలిరంగుగల అద్దపుబిళ్ళగుండా ధవళకాంతి వెళ్ళినపుడు ప్రకటమైన నీలికాంతి యెట్లు ధవళకాంతికంటె భిన్నముగనుండునో అట్లే, భిన్నమైయుండునని గ్రహించవలయును. నీలిరంగుఅద్దపుబిళ్ళలో దృష్టిని

ప్రవేశపెట్టి ఆరెండుకాంతులను ఏకకాలమున చూడగలశక్తి యేరికైననుండినచో, నట్టివారి కారెండుకాంతులమధ్యగల గొప్పవ్యత్యాసము స్పష్టముగ కనబడును. అదేవిధముగా మనస్సుద్వారా ప్రకటమగుశబ్దములకును, ఆత్మయొక్కధారలవలన ప్రకటితమైనశబ్దములకును మధ్యకూడా మహావ్యత్యాసము గలదు. కాని ఏమహాపురుష్యునిదృష్టి మధ్యనున్న తెరలనన్నిటిని చీల్చుకొని ఆత్మస్థానమునకు ప్రవేశించగలదో ఆయనకే ఈవ్యత్యాసము గోచరముకాగలదు. మండలాధిపతులనుండి వారిబహిర్ముఖక్రియలు జరిగించు సందర్భములో ప్రకటమగు ధ్వన్యాత్మకనామములని పేర్కొనబడు శబ్దములుకూడ, నామండలాధిపపతులకు చైతన్యశక్తినొసంగునట్టి చైతన్యధారనుండిప్రకటమగుశబ్దములకన్న భిన్నమైయున్నవి. అయితే చైతన్యశక్తికాదికారణమును, భండారమునగు పరమసర్వేశ్వరునివిషయములోమాత్రి మట్టివ్యత్యాసము లేదు. ఏలననగా, నాయాదిభండారముయొక్క బహిర్ముఖక్రియ ఒక్కచైతన్యధారనుప్రకటముచేయుటమాత్రమే. నిజపరమసర్వేశ్వరుడైన రాధాస్వామిదయాళునియవతారపురుషులుతప్ప తక్కినయవతారములు ప్రవర్తలుమున్నగువారందఱును కేవలము తమతమమండలాధిపతుల ధ్వన్యాత్మకనామములనుమాత్రమే ప్రకటముచేయగల్గిరి. ఏలననగా చైతన్యశక్తియొక్క మూలభండారమునకును చేరుకొన్న పురుషులొక్కరే యదార్థమైనచైతన్యనిజనామమును ప్రకటముచేయగల సమర్థులు. నిజచైతన్యభండారమునకును చేరికగల్గినట్టియు అచ్చటనుండి ఈలోకమునకు పురోగామిగా దయజేసినట్టియు కబీర్ సాహెబ్ వారు తామురచించినయొక చరణములో నా నిజచైతన్యనామమునుగురించి సూచనగజెప్పిరి. ఆవిషయమును గురించి సంపూర్ణవివరములు ముందుచెప్పబోయెదము. ఇచ్చటమాత్రము ఆనిజనామమును తెలియజేసి దానిమహిమను వర్ణించెదము.

## 65, రాధాస్వామీ నామము

ఈసృష్టికంతకును ఆదియందుబుట్టిన చైతన్యధారవలన ప్రకటమైన శబ్దమును మానవధ్వనిలో ననుకరించగా "రాధా" శబ్దమగును. ఈఆదిచైతన్యధార దేనివలనపుట్టెనో అట్టి (భండారములోని) తరంగముయొక్క అనగా "మౌజ్" యొక్కశబ్దమును ఉచ్చారణచేసినయెడల "స్వామీ" శబ్దము ఏర్పడును. అందుచే నీసృష్టిలోనియావత్తుచైతన్యశక్తికిని ఆదికారణము అనగానిజభండారముయొక్కనిజపవిత్రనామము, అనగా పరమమంత్రము "రాధాస్వామీ"

శబ్దమని తేటపడుచున్నది. అనగా ఆనిజపరమసర్వేశ్వరుడు సత్యశబ్దరూపమున వెలసి సృష్టినారంభించినపుడు భండారములోనితరంగమును భండారముయొక్క ధారలును, అన్నిటికన్నముందుసృజింపబడిన మహాచైతన్యమండలములో నిజపరమసర్వేశ్వరునినిజనామమైన రాధాస్వామీశబ్దమును ప్రకటించినవి. సృష్టిలోనంతటను ఈనిజనామము విరాజమానమైయున్నది. ప్రతిమానవుడును తనలో చైతన్యధారక్రియాశీలముగనున్నట్టి అంతరతమఘట్టమునందు ఆనామమును వినగల్గును. సూర్యునినుండియుద్గతమైన సూర్యకిరణములలో ఆకిరణములకు భండారమైన సూర్యునిలక్షణము లెట్లుండునో అట్లేయెంతసూక్ష్మాతిసూక్ష్మమైనచైతన్యకిరణములోనైనను అనగా చైతన్యాంశలోనైనను(అనగా జీవునిలో) చైతన్యభండారముయొక్క నిజధర్మములు, అనగా భండారములో తరంగముపుట్టుటయు భండారమునుండి ధారాప్రవాహము బయల్వెడలుటయు అనెడి రెండు ధర్మములును, (ఈసృష్టిఅంతయు నీరెండుధర్మములప్రకటనముపైననే ఆధారపడి ప్రారంభమయ్యెను) ఒప్పారుచుండును. ఎవరైనను మధ్యనున్న కోశములన్నిటిని చీల్చుకొని చైతన్యకిరణము అనగా "సురత్ అంశ" విరాజమానమైయుండిన తనయంతరతమస్థానమునకు వెళ్ళగల్గినచో నతనికి రాధాస్వామీనామము అచ్చట అల్పపరిమాణములో వినవడగలదు. ఇతరపవిత్రనామములను లేక మంత్రములనా యా యవతారపురుషులు ప్రకటించినట్లే "రాధాస్వామీ" పవిత్రనామమునుగూడ రాధాస్వామీదయాళునియవతారస్వరూపము ప్రకటింపననుగ్రహించిరి. ఈనామమునుగురించి పైనచెప్పినవర్ణనమంతయు నాదయాళుని యుపదేశానుసారమే వివరించితిమి. కాని ధారయొక్కయు భండారముయొక్కయు శబ్దములను నోటితోనుచ్చరింపగా "రాధాస్వామీ" శబ్దమేర్పడునని కొన్నిరుజువులనుచూపి నిరూపించినయెడల బహుశా యెక్కువతృప్తికరముగ నుండవచ్చును.

## 66. "రాధా", "స్వామీ" శబ్దములక్రమము.

రాధాస్వామీనామమునుగురించి రుజువుచేయు ప్రమాణమేదైనను చూపుటకుముందు పైనవ్రాసినవివరణమునుబట్టిగల్గుటకువీలున్న ప్రశ్నలు కొంత దానికి సమాధానముచెప్పవలసియున్నది. ఆశంకయేమనగా, ఆదిచైతన్యమహాభండారమందు తరంగము లేక "మౌజ్" మొదటఉత్పన్నమైనదనియు పిమ్మట ధారప్రకటమైనదనియు వివరించినపుడు పరమసర్వేశ్వరుని నిజనామము

"స్వామీరాధా" యైయుండవలెను కాని, "రాధాస్వామీ" యనుటకు వీలు లేదని శంకించవచ్చును. అవగా, ఆదియందు రచనకుసంబంధించినక్రియలు ఏవరుసలో జరిగినవో ఆక్రమమునననుసరించియే నిజనామము ఏర్పడవలసి యుండునని అనిపించవచ్చును. ఈప్రశ్నకు సమాధాన మీక్రిందివిధముగా చెప్పవచ్చును. 63 వ ప్రసంగములో ఆదిచైతన్యధారయొక్క ప్రకటనము చుంబకశక్తియొక్క ఆకర్షణక్రియ జరుగుతీరుననే జరిగెనని చెప్పియుంటిమి. అనగా చుంబకశక్తిధారలు ముందు బయట వ్యాపించిన పిమ్మటనే, ఆశక్తిక్షేత్రములోని బిందువులన్నిటిని చుంబకకేంద్రమువైపున కాకర్షించుట జరుగుచున్నది గనుక, చుంబకక్షేత్రమును బట్టి చూచినచో ప్రథమక్రియ చుంబకశక్తిధారలదే అయినట్లుగా యెట్లగుపడునో, అటులనే రచనయొక్క దృష్టికోణమునుబట్టి చూచినచో, చైతన్యధారదే మొదటిక్రియయై, ఆధారమొదట వ్యాపించిన పిమ్మటనే చైతన్యభండారముయొక్క ఆకర్షణక్రియ ప్రారంభమైనది, లేదా, ధారలమూలముననే భండారముయొక్క ఆకర్షణక్రియ ప్రకటితమైనదనికూడా చెప్పవచ్చును. ఈకారణములచే, రచనయొక్కదృష్టికోణమునుబట్టి చూచినయెడల ప్రప్రథమమున నీధారనుచెప్పి, పిమ్మటనే భండారమును చెప్పుట యుక్తముకావున, నిజనామము "రాధాస్వామీ" అనుటయే సరిగాని, "స్వామీరాధా" యని చెప్పుట సరికాదు.

## 67. రాధాశబ్దము.

ఈల, ఘంట, మున్నగువానిధ్వనివంటిధ్వనిని చేయగోరినపుడు, మనము ఆశబ్దముచేయు యంత్రములోనున్నపరిస్థితితో నించుమించుసరిపోలిన పరిస్థితినే మనముఖములోగూడ కల్పించవలసియుండునని యందఱును సులువుగనే దెలియగలరు. ఉదాహరణము పిల్లనగ్రోవి, సన్నాయి మొదలగు నూదెడు వాద్యములలో నేమి జరుగునో చూడుడు. ఒకగొట్టము నూదుటచే నందలి గాలిలో నొకకంపనము బయల్దేఱి ఆకంపనము గొట్టముయొక్క రెండవద్వారమునుండి బయటకువచ్చినపుడాధ్వనులు జనించుచున్నవి. కావుననే మనము పిల్లనగ్రోవిధ్వని ననుకరించదలంచినపుడు, మొట్టమొదట, మన ధ్వన్యనుకరణ సాధనమైనముఖమును, దానిలో నొకగొట్టము ఆకారమువంటి ఆకార మేర్పడునట్లుగను, గాలిపోవుటకై మనపెదవులవద్ద నొకద్వారమేర్పడులాగునను సవరించుకొనవలసియుండును, అప్పుడు నోటిలోనిగాలి కంపనసహితముగ మనపెదవుల

తో చేసినద్వారముగుండా బయటకువచ్చినపుడు పిల్లనగ్రోవియొక్క ధ్వనివంటి ధ్వని యుత్పన్నమగును. కావున మననోటిలో నట్టియాకారమేర్పడుట చేతనించి న 'స' కారము పిల్లనగ్రోవిధ్వనిని, అనుకరించుటలో తప్పనిసరిగా సహాకరించును. అందుచే పిల్లనగ్రోవి ధ్వనిని "సకార" శబ్దసహాయము లేనిదే అనుకరించుట అసంభవము. అటులనే ఒకలోహపుపాత్రి లేక పళ్లెరమును ఒకవైపున గట్టిగా కొట్టుటచే జనించునట్టి ఘంటానాదమును అనుకరించుటకై, ఏదైననొక మూర్ధస్థానీయవర్ణమును ప్రయోగించవలసియుండును. ఏలననగా, మూర్ధన్య వర్ణోచ్చారణనిమిత్తము నాలుకకొనతో మూర్ధస్థానమును కొట్టినపుడే, మన నోటినుండి దెబ్బకొట్టినట్లుగా శబ్దముబయల్వెడలును. అందువలననే ఘంటానాదమును ఆంగ్లభాషలో "డింగ్ డాంగ్" అనియు, హిందూస్తానీ బాషలో 'టంట' ధ్వనియు నందురు. ఈ రెండుమాటలలోను మొదటివర్ణము మూర్ధన్యము, రెండవది అనునాసికవర్ణమును అని గ్రహింపదగును. దీనినిబట్టి నోటితో బాహ్యధ్వనుల ననుకరించుటకై కొన్నిప్రత్యేకవర్ణములనుపయోగించుట అవసరమని సిద్ధించును. ఈ నియమమువనుసరించి, చైతన్యభండారము చైతన్యధారయొక్క యుక్రియల వెంట నుత్పన్నమైనశబ్దములవంటిశబ్దములను నోటితో నుచ్చరించునిమిత్తమై ఏయక్షరములువరీతిని ఉపయోగించవలసియుండు ననువిషయము నిపుడు విమర్శించుదము. చైతన్యశక్తిక్రియ యించుమించు చుంబకశక్తియొక్క క్రియను పోలి యుండునని యిదివఱకే చెప్పియుంటిమి. కావున, చుంబకశక్తిక్షేత్రములోని పరిస్థితులను పరిశీలించుటచే మనయుద్దేశ్యము నెఱవేరగలదు. ఆకాశతత్త్వము సృష్ట్యారంభమున నుత్పన్నమైనపుడు, దానికిఉన్నట్టి సహజావస్థలో, నది ఒక ఏకజాతీయపదార్థముగా (Homogeneous) ఉండి, దానిసూక్ష్మపరమాణువులు (ions) ధనాత్మకములు (positive) ఋణాత్మకములు (negative) అనెడి రెండు విధములుగా విభజనచేయుబడుటకుతగిన యోగ్యతగల్గియున్నవి. శక్తియొక్క మతొకఘట్టమునుండి ఆశక్తి ఆకాశతత్త్వము మీదప్రభావముచూపినపుడుదానిసూక్ష్మపరమాణువులు (ions) పైనచెప్పిన రెండుభాగములలోనికి వేఱుచేయబడును. కాని సృష్టినియమములు ఆవేశితైన అణువులను (ions = సూక్ష్మపరమాణువులు) తిరిగి తమసహజమైన పూర్వస్థితికి తెచ్చునిమిత్తమై ప్రయత్నము చేయుచునేయుండును. చుంబకముయొక్క ధనాత్మక, ఋణాత్మకధ్రువములు పరస్పరాకర్షణగలిగియుండుటకును వానిమధ్య నొకశూన్యస్థానము (Neutral Zone) ఏర్పడుటకును ఇదియేకారణము. చుంబకశక్తిక్షేత్రములో

నీరెండుధ్రువములును, నిజమునకు, ఆశక్తి యొక ప్రక్కన నధికముగను రెండవ ప్రక్కన శూన్యముగను ఉండుటవలననే యేర్పడినవి. ఇపుడు మనము చుంబక శక్తి క్షేత్రములోని అయనములను (ions) గమనించినచో వానిపైన రెండు శక్తులు పరస్పరవిరుద్ధముగ పనిచేయుచున్నట్లును, అందుచేతనే ఆఅయనము (ions) లన్నిటిలో నొకసూక్ష్మకంపనము గల్గుచున్నట్లును తెలియగలదు. ఆకర్షణశక్తి తనకార్యక్షేత్రములోగల్గించు మొట్టమొదటి ప్రభావమిదియే. పిమ్మట నొకేవైపునకు ఒరిగియున్న కంపములపరంపర కలిసి ఏకస్వరమగుటచే క్షేత్రమునవ్యాపించిన ఆకర్షణశక్తి ఒకధారారూపమును ధరించును. చైతన్యశక్తి యొక్క ధారగూడ నించుమించు ఇదేవిధముగ ప్రకటమైనది. కావున, మన ధ్వనికారకయంత్రమైన నోటిలో పైనుదహరించినపరిస్థితి గల్గించుటకు ఏఅక్షర సముదాయము నుచ్చరించవలసియుండునో విమర్శింపవలసియున్నది. 'ర' కారము అట్టి అక్షరము. ఏలననగా 'ర' కారమునుచ్చరించుటకై నాలుక యత్యంతముగ కంపించవలసియున్నది. గనుక నొకబిందువుపైన చైతన్యధారగలుగ చేయు క్రియాప్రభావమువలన (ఈక్రియ యేమనగా కంపనము పుట్టించుటయే) గలిగెడి ధ్వనిని నోటితోఅనుకరించుటకై మొట్టమొదట 'ర' కారము నుచ్చరించవలసి యుండును. అటుపిమ్మట కేంద్రమువైపునకు లాగుచున్న ధారలయొక్క ఆకర్షణమును, అనగా కేంద్రాభిముఖమైన ధారాప్రవాహమును అనుకరణ చేయవలసి యుండును. ఇందుకొఱకై దంత్యవర్ణమగు 'ధ' కారమును ప్రయోగించవలెను. ఏలనన నీవర్ణముచ్చరించునపుడే ఊపిరిని లోనికి లాగికొనవలసినపరిస్థితి యేర్పడును. అందుచే చైతన్యశక్తియొక్క ధారనుండి ప్రకటమైనధ్వనికి మానవ భాషలోనత్యంతసన్నిహితమైన యనుకరణము "రాధా" శబ్దమని స్థిరపడుచున్నది.

## 68. రూపములయుత్పత్తి

ఆత్మకు నిజభండారము నిజపరమసర్వేశ్వరుడేయని యిదివరలో చెప్పియుంటిమి. ఆభండార మపారమైనదై సమస్తమునావరించి యున్నది. ఆకసమున నొక మేఘఖండమున్నట్లే, యీసమస్తసృష్టియు నాభండారములో నొక తిలప్రాయముగ నున్నది. ఈ సృష్టిలోప్రకటమైనసమస్తరూపములును రచనారంభమున పరమసర్వేశ్వరునిచే మొట్టమొదటధరింపబడిన యపారస్వరూపము

శక్తిపరిభావముచే నేర్పడిన క్రమమేగదా! ఆదిశక్తి నిజపరమసర్వేశ్వరుని నుండియే ప్రకటమైనదికావునను, ఆయాదిశక్తినుండియే సృష్టిలోని సమస్త రూపములకు హేతుభూతములైన యితరశక్తులన్నియు ప్రకటమైనవిగనుకను, ఈరచనలోనిరూపములన్నియు పరమసర్వేశ్వరుని ఆదిరూపమున కనుకరణము లేయని యంగీకరించవలసియున్నది.

## 69. ఆదిస్వరూపము.

నిజపరమసర్వేశ్వరు డనంతుడు, అనగా, హద్దుబులేనివాడుఅని చెప్పినపుడు వారికొకరూపమును కల్పించుట కవకాశమేలేదనుట యుక్తమే. కాని, ఆయపారసింధువులో ఆదిచైతన్యధార ప్రకటమైనపుడు ఏఆకారమేర్పడెనో, అట్టి ప్రథమాకారమును ఆనిజపరమసర్వేశ్వరుని ఆకారముగా నెంచుట పొరపాటుకానేరదు, చైతన్యధార ప్రకటమగుటకుముందు చైతన్యభండారములో నొకతరంగముద్భవించినదని యిదివరలో చెప్పియుంటిమి. ఈతరంగము, భండారములో నేస్థానమునబుట్టెనో అదే ఆదికేంద్రమయ్యెను, అనగా, చైతన్యశక్తియొక్క క్రియాశీలమైన మొట్టమొదటి కేంద్రముగ నేర్పడెను. ఈసృష్టిలోని యితరశక్తుల కేంద్రములుఅండాకారమైన రూపములలో నున్నట్లే ఈయాదికేంద్రముగూడ అండాకారరూపమునే దాల్చెను. ప్రాపంచికశక్తులక్రియలమూలమున నీసృష్టిలోనేర్పడిన అనేకమైన అండాకారములన్నిటిలోను ఆయాదిస్వరూపముయొక్క ముద్రపడినట్లు స్పష్టముగాబోధపడుచున్నది.

## 70. స్వామీశబ్దము.

ప్రప్రథమతరంగము, లేక "మౌజ్" తోకూడ ప్రకటమైన శబ్దమును మానవభాషలో ననుకరించుటచే నేశబ్దమేర్పడు ననువిషయమును దెలిసికొనదలంచియే పైప్రసంగములో మొట్టమొదటలో, క్రియావంతమైన ఆదికేంద్రముయొక్క రూపమునుగురించి మేమువిమర్శించినది. అట్లనుకరించునిమిత్తము పైనచెప్పిననియమమునుబట్టి మనశబ్దోచ్చారణయంత్రమగు నోటిని కొంతవరకు అండాకారరూపములోనికి మార్చవలసియుండును, అటుపిమ్మట నేశబ్దమునుచ్చరించుటచే మననోరు ముకుళీకృతమైపోవనారంభించునో (అనగావాని ద్వారము లోపలిపైపునకు మూసికొనిపోవునో) అట్టిశబ్దము నుచ్చరించవలసియుండును,

స్వామీశబ్దోచ్చారణలో గల్గు మార్పులను విమర్శించగా దాని ప్రథమభాగమైన "స్వా" నుచ్చరించునపుడు నోటిలో అండాకారమైనఖాళీయేర్పడుచున్నదనియు రెండవభాగమైన "మీ" నుచ్చరించుటలో నోరు లోపలివైపునకు లాగబడి మూసికొనిపోవుచున్నదనియు తేటపడగలదు.

రాధాస్వామీనామము ధ్వన్యాత్మకనామమని, అనగా చైతన్యశక్తి యొక్క ప్రథమావిర్భావముతో వ్యక్తమైనశబ్దమునకు మానవభాషలోఅత్యంతసన్నిహితమైన నమూనాయని ఋజువుపఱచుటలో నింక నెన్నియోవివరము లిచ్చుటలోపించియున్నవన్నమాట వాస్తవమే. కాని పైన మేము వివరించిన విషయములన్నిటినిబట్టి చూచినపుడు మానిరూపణము కొంతవఱకు అసంపూర్ణమనుట నిజమే అయినను, అది అసమంజసమనికాని ఆధారరహితమనికాని అనుటకుమాత్రముఏలులేదనియు, మానిరూపణము, మహాపురుషులుచెప్పిన లేక ప్రకటపఱచిన గుప్తవిషయములొక్కటేఆధారముగ చేసికొని చెప్పెడి పవిత్రనామవర్ణనలకన్న నిస్సందేహముగనొకమెట్టుపైననే యున్నదనియు, కొంత వఱకుసాహసించి చెప్పగలము. అదియునుగాక నిట్టినిరూపణముల కధికప్రామాణ్యముండ నేరదనువిషయముకూడా జ్ఞప్తియుంచుకొనవలయును. ఏలననగా కేవలము యుక్తులమీదనే ఆధారపడునట్టి వాచానిరూపణము లెంతచెప్పినను చివరకు వట్టినోటిమాట లేకదా! ఎక్కడచూచినను స్వానుభవముతోకూడిన పరిశోధనవలననే పని తృప్తికరముగాసాగుచున్నది. కాబట్టి ఈపరమపవిత్రనామము విషయములోచేయువిమర్శకార్యమునుకూడా ప్రయోగాత్మకపరీక్ష చేయకుండా యెంతమాత్రమువిడిచిపెట్టవలదని మేముగట్టిగనొక్కిచెప్పెదము. ఈమహనీయ పవిత్రనామముయొక్క మహిమచే నాత్మస్థానమున నెంతప్రబలమైనయేకాగ్రత గల్గునో, బహిర్ముఖమాయికవృత్తులనరికట్టుటలో నెంతయద్భుతసహాయము సేకూరగలదో యెవరైన నీనామమును ఆత్మజిహ్వతో యథావిధిగాస్మరణచేసినచో కొద్దికాలములోనే స్వానుభవసిద్ధముగా తెలిసికొనగలరు.

## 71. కబీర్ సాహబ్ వారి ప్రమాణవచనము

కబీర్ సాహబ్ వారు ఈపరమపవిత్రనామమునుగుఱించి వారిశబ్దములలో నొకచోటనుదహరించిరని యింతకుపూర్వము చెప్పియుంటిమి. అట్లు వారు ఈప్రశంసచేసినచరణము ఈక్రిందపొందుపఱచబడినది:—

కబీర్ ధారా అగమ కీ, సతగురు దయీ లఖాయ్
ఉలట్ తాహి సుమిరన్ కరో, స్వామీ సంగ మిలాయ్ ॥

అనగా సద్గురువు అగమపురుషుని, అనగా గమ్యమునకతీతుడైన పురుషుని ధారను తమకు చూపెట్టిరని కబీరువారు తెలివిచ్చుచున్నారు. "రాధా"ను తిరగ త్రిప్పి, దానికి "స్వామీ"ని జేర్చగా యేర్పడునట్టి శబ్దమును స్మరణ చేయుము.

## 72. మూడు ఆధ్యాత్మిక సాధనలకు సంబంధించిన ముఖ్యవిషయములు.

ఇంతవఱకు ఆత్మయొక్క చైతన్యశక్తిని మేల్కొల్పి ఆత్మ నూర్ధ్వమండలముల కారోహింపజేయునట్టి ఆధ్యాత్మిక సాధనలు మూడింటి యొక్క వివరణము పూర్తియైనది. అంతర్యమున, అనగా ఆత్మయొక్క జిహ్వతో ఆత్మయొక్క నివాసస్థానము వద్ద పరమపవిత్రి రాధాస్వామీనామమును స్మరణచేయు సాధనయు, ఆస్థానము వద్దనే సమకాలికసద్గురురూపమును ధ్యానముచేయు సాధనయు, సామాన్యముగ ప్రారంభములోనే ప్రేమీభక్తులకు ఉపదేశము చేయబడును. ఆయభ్యాసములు చేయుటవలన చిత్తైకాగ్రితగలుగనారంభించి, గుప్తముగనుండిన ఆధ్యాత్మికశక్తులు మేల్కాంచును. ఈ సాధనల నభ్యాసము చేయుటచే నభ్యాసియాత్మకు శబ్దాభ్యాసము చేయుటకు కావలసిన యర్హత అనగా చైతన్యబలము చేకూరును. కాని, శబ్దాభ్యాసమారంభించినపిదప స్మరణధ్యానసాధనల నభ్యాసము చేయుట పూర్తిగ మానకూడదు. ఈ రెండు సాధనలను ప్రతిదినము చేయవలసినయభ్యాసములో నొకభాగముగ చేయుచునేయుండవలెను. కొంత యభివృద్ధిగల్గినపిమ్మట స్మరణధ్యానసాధనలను అఱవచక్రము వద్దగాక, దానిపైస్థానముల వద్ద చేయవచ్చును. అట్లు చేయగా అఱవచక్రములోని గుప్తశక్తుల వలెనే ఆపైస్థానముల గుప్తశక్తులుగూడ ప్రబోధమగును. కాని అట్లు చేయించు సమకాలికసద్గురువు సృష్టిలోని ద్వితీయమహాఖండము వఱకే సిద్ధినొందినవారైన యెడల, వారిరూపమును బ్రహ్మాండదేశమునకు పైనున్న స్థానములందు ధ్యానముచేయుట నిష్ఫలమైపోవును. ఏయభ్యాసియైన నీవిషయములో మొండితనము చేసినచో నట్టిధ్యానమువలన నాంతర్యాభివృద్ధిలో ప్రతిబంధము కలుగగలదు. నిర్మలచైతన్యదేశమును చేరుకొన్న ప్రత్యక్షగురువు అనగా సంత్ సద్గురువాకారిస్వరూపమునే బ్రహ్మాండదేశముకన్న పైనున్నస్థానములలో ధ్యానము చేయవలెను. సంత్ సద్గురుస్వరూపధ్యానము ఒక్క నిర్మలచైతన్యదేశస్థానముల వద్దమాత్రమే చేయవలయునని తలంపరాదు, క్రిందిస్థానములలో కూడా వారి

స్వరూపమును ధ్యానముచేయుటచే పరిపూర్ణఫలితము సిద్ధించును. అభ్యాసి సంత్ సద్గురుస్వరూపమునే ప్రప్రథమమునుండియు ధ్యానముచేయవలసినదని సంత్ మతములో విధించుట కిదియే కారణము. స్వరూపములధ్యానమువిషయములో పైనచెప్పినసిద్ధాంతములు బ్రహ్మయొక్క పవిత్రనామమైన 'ఓం' కార నామస్మరణమును పరమపురుషుని నిజనామమైన రాధాస్వామీనామ స్మరణమునుగూడ (అందుకు తగినమార్పులతో) వర్తించును కావున స్మరణవిషయములోకూడా పరమపురుషుని నిజనామముననే ప్రప్రథమమునుండియు స్మరణ చేయవలసినదని సంత్ మతములో నుపదేశమిచ్చుచున్నారు.

### 73. మధ్యసమయములో నేరూపమును ధ్యానముచేయవలయును.

రాధాస్వామీమతములో ప్రత్యక్షసద్గురువు అనగా జీవించియున్న సద్గురువుయొక్కస్వరూపమునే ధ్యానముచేయవలసినదని విధింపబడినట్లింతకు ముందు చెప్పియుంటిమి. దీనినిబట్టి ప్రత్యక్షసద్గురువు గుప్తమైనపుడు ధ్యానా ధ్యానముచేయుట మానివేయబడునని సహజముగా తోచవచ్చును. కాని అట్లనుకొనుట పొరపాటు. ఒకసంత్ సద్గురువు గుప్తమైనతర్వాత తిర్గి వారిస్థానాపన్నులు ప్రకటమగువఱకునుండుమధ్యకాలములో యథాప్రకారము పూర్వపుసద్గురుస్వరూపమునే ధ్యానముచేయుచుందురు. అట్లుచేయుటచే నాంతర్యమున చిత్తైకాగ్రత గల్గుటలో సహాయము చేకూరును. అయినను, అట్టిధ్యానముచే గల్గినచిత్తైకాగ్రతకును, ప్రత్యక్షగురుస్వరూపధ్యానముచేగల్గుచిత్తైకాగ్రతకును. చాలవ్యత్యాసముండును. ఆభేదము ఒకమృతించినబంధువుని లేక మిత్రునిపటమునుచూచుటచే మనలోబుట్టునట్టియాలోచనలకును అట్టివారు సజీవముగనుండినపుడు వారిని తలంచినపుడుగలుగుభావములకును గలవ్యత్యాసమువంటిదే. మొదటిపరిస్థితిలో అనగాచిత్రపటమునుచూచినపుడు మనస్సున వియోగదుఃఖముగల్గును, రెండవ పరిస్థితిలో ఉత్సాహప్రేమహర్ష భావములుద్భవించును.

### 74. సాధనావిధానములను అందఱకును వెల్లడిచేయకూడదు.

అభ్యాసముచేయువలసిన మూడుసాధనలవిషయములో పైనచెప్పినదంతయు ఆసాధనల మూలసిద్ధాంతములనుగుఱించియు, వానిఫలితములు, మహిమనుగుఱించియు వివరణముమాత్రమే. రాధాస్వామీదయాళురు ఉపదేశించినసాధనలయొక్క అసలువిధానముమాత్రము గురూపదేశముద్వారా

ముఖాముఖిని నేర్చుకొనవలసినరహస్యము. అందుచే నెవరికైన నాగూఢవిషయములు మంత్రోపదేశసమయమందే బోధింపబడును. మంత్రోపదేశసమయములో సాధనాపద్ధతుల గూఢవిధానముమాత్రమే తెలియజెప్పుదురు కాని మరొక బాహ్యాడంబరముగలకార్యక్రమమేమియు జరిగింపబడదు. కాని ఉపదేశముతీసికొనువానికి తా నితరు లేరికిని సాధనావిధానరహస్యముల నెంతమాత్రముబయలుపఱచనని పెద్దమనిషితరహాగా ఒకవాగ్దానమిమ్మని స్పష్టమైనహెచ్చరికచేయబడును. కాని యతనిచే నెట్టిప్రమాణము చేయించబడదు. ఏలననగా, తనమాటనునిలబెట్టుకొనలేనివాడు శిష్టతాశూన్యుడగుటచే, నతనిప్రమాణములపైనమాత్ర మేమి విశ్వాసము పెట్టగలము?

75. ప్రాపంచికబాహ్యపరిస్థితులకును, మనస్సుయొక్క రుచులకు వాసనలకును సాధనపైన గల ప్రభావము.

సాధనల నభ్యాసముచేయువిషయములో నీక్రిందివిషయములకధికప్రభావముండును :—

1, అభ్యాసియొక్క జీవనవిధానమునకును ఈప్రపంచములో ఇతరులతో చేయు సాంగత్యవ్యవహారములకును సంబంధించిన దైహికపరిస్థితులు.

2. అతనిఅలవాట్లు, ఆహారపానీయములును,

3. ఇతరులతో నతనిప్రవర్తన

4. తనగౌరవప్రతిష్ఠలనిమిత్తమై యతనికిగల వాంఛాతిశయము.

5. ధనసంపత్తులయందును, బంధువర్గముయెడలను అతనికి గల బంధనము.

6. అతనికిగల యితరసంసారబంధనములు.

ఈగ్రంథములో జీవులకర్మలనుగుఱించి వివరించినచివరిభాగములో శ్రద్ధాళువైన యభ్యాసి యీపైవిషయములన్నిటిలో నెట్టినియమములను అవలంబించవలసియుండునో వివరించెదము. ఇప్పుడు రచనాక్రమమునుగుఱించియు రచనయొక్క మహోద్దేశ్యము విధానములనుగుఱించియు ముందుగాచెప్పనారంభించెదము. ఏలనన, సృష్టినియమములకు సృష్టిలోనిజీవులకర్మలపైన నధికప్రభావముండును కావున కొంతవఱకీసృష్టినియమములనుగుఱించి తెలిసికొననియెడల కర్మలకు సంబంధించినలెక్కలవిషయము పూర్తిగా బోధపడనేరదు.

# తృతీయ భాగము

## సృష్టి ఆకారము నేవరుసగా ధరించినదియు, అనగా, సృష్టి ఆవిర్భవించిన వాస్తవమైన వరుసక్రమమును గురించియు, దాని విధివిధానములు, దాని మహోద్దేశ్యమును గురించియు వర్ణన.

### 76. రచనకు పూర్వమందు పరిస్థితియెట్లున్నది.

సృష్టియొక్క రూపధారణము చేసినక్రమమును వివరించుటకై, మును ముందు సృష్ట్యావిర్భావమునకు పూర్వమందున్న పరిస్థితిని స్పష్టముగ నవగాహన చేసికొనవలసియుండును కావున, నాపరిస్థితిని గురించి యిచ్చట సంక్షేప ముగ వివరించెదము. విజ్ఞానశాస్త్రసమ్మతమైయున్నట్టియు, మనయింద్రియజ్ఞాన ముపైననే ఆధారపడినట్టియు హేతువాదములును ఊహాలు నే, మనకంగీకారముగ నుండును కావున, సృష్టికంటెపూర్వదశను వివరించునిమిత్తమై మనము ఇంద్రియ గోచరమైనసృష్టినుండియే అందుకు తగిన ఆధారసామగ్రిని కొన్నుకొనవలసి యుండును. సృష్టిలోని ప్రతిపదార్థమును పూర్తిగభిన్నభిన్నములుచేయనారం భించినయెడల నెట్టిపరిస్థితి యేర్పడునో ఆలోచించుడు. అట్లుచేసినచో ఘనపదా ర్థములన్నియు క్రమక్రమముగ మొదటద్రవపదార్థముగను పిమ్మటవాయువదా ర్థము, అటుపిమ్మట నింకనుసూక్ష్మపదార్థముగను తరువాతనింకనుసూక్ష్మతర పదార్థముగను-ఈవిధముగా సకలవిషయములును అతిసూక్ష్మావస్థలలోనికి దిగి పోవుచు(49వ ప్రసంగములో కడపటిభాగమునుచూడుడు)చిట్టచివరకుశక్తిమయా వస్థలోనికి మారిపోవును. నిస్సంశయముగా ఆశక్తిమయావస్థకుగూడ,నీసృష్టిలో తరగతివారీగా ఉండుచున్న భిన్నత్వమును నిలబెట్టగలసమర్థత యుండితీరవలెను. ఏలనన,నట్లుకానిచో సృష్టిలో నిపుడున్న భిన్నభిన్నతరగతులేర్పడుటకే సావకాశ ముండకపోవును. అనగా,సృష్టి ఇపుడున్న రూపములో ప్రకటమగుట యేయసాధ్యమై పోయియుండును. ఈశక్తిమయావస్థను శక్తియొక్క నిమ్నతరఘట్టమని (అంత

Note:— 1. "నిమ్నతరఘట్టము" అను నామమునుపయోగించుటకు కారణము ఈశక్తి లో మూలప్రకృత్యవస్థ కలిసియుండినందుననైనను కావచ్చును, లేదా 11వ. ప్రసంగము (17వ పుట) లో చెప్పినప్రకార మిది శక్తియొక్కనిమ్నఘట్టమై నందువలననైనను కావచ్చును.

కన్న నెక్కువ యుక్తమైన పదము లేనందున) చెప్పవచ్చును. ఆదిదశను గుఱించి మేము నిర్ణయించినవాదము లేక సిద్ధాంతము, ఈరూపవంతముగనున్నసృష్టిని పైనచెప్పినవిధముగాచేసినచో (అనగా చిదుకగొట్టినయెడల) అది అరూపదశ లోనికి మాఱిపోవుననెడి స్వప్రసిద్ధసత్యముపైననే ఆధారపడియున్నదని వేఱుగ చెప్పనవసరములేదు. ఇపుడు మఱొకవిషయమును గమనింపుడు. అదేదియనగా స్థూలప్రకృతిలో, శక్తిలోలేని విశేషమొకటి గలదు, అనగా, జడప్రకృతికి, శక్తి నరికట్టగల సమర్థత గలదు. కావుననే, జడప్రకృతికణములలో (అవి పర మాణువులు (atoms) కానిండు, అయనములు (ions)కానిండు లేదా అంతకన్న నుగూడ సూక్ష్మతరపదార్థముకానిండు) నిమిడిపోయినశక్తి అంతయు అట్లే శాశ్వతముగ బంధింపబడియుండిపోవుచున్నది. జడపదార్థముయొక్క యీలక్ష ణమును దృష్టిలోనుంచుకొని, సృష్టికిపూర్వము శక్తియొక్క యవస్థనుగుఱించి ఇపుడాలోచించవలసియున్నది. సృష్టికిపూర్వము, శక్తియును, దానిలోజడపదా ర్థసంబంధమైన (పైనచెప్పిన) ధర్మమునుతప్ప మఱేమియు లేవు. అప్పుడు శక్తి కూడ సుప్తావస్థలోనుండెను. ఏలననగా, శక్తి క్రియాశీలమైనపిదపనే సృష్టి క్రియ ప్రారంభమయ్యెనుకదా. కావున సృష్టికిపూర్వముపరిస్థితి యెట్లుండెననగా శక్తిక్షేత్రములో నసంఖ్యాకమైనబిందువులపైన నసంఖ్యాకశక్తిధారలు క్రియా శీలములై యుండెను కాని, శక్తిధారలంతర్ముఖములై యుండిపోయినందున నొక శక్తిశూన్యతావస్థ యేర్పడెను (అనగా శక్తి లేనట్లే యుండెను). మఱియు నా (జడ ప్రకృతి) బిందువులకుగల పైనుదహరించిన శక్తిని బంధించియుంచు లక్షణమునకు శక్తితో సంబంధము లేనట్లేఉండెను. అనగా, అప్పుడు శక్తి ఆ (జడ) బిందువుల ద్వారానే యంతర్ముఖమైయుండి, ఆ బిందువులలోనే గుప్తముగ నుండిపోయెను.

## 77. ఆదిశక్తిలో న్యూనాధికధ్రువములు ఏర్పడియుండు లక్షణము.

పైన శక్తియొక్క సుప్తావస్థనుగుఱించిచెప్పిన విషయమును ఇంకను కొంచెమెక్కువ విశదపఱచవలసియున్నది. శక్తి తననివాసస్థానముకానట్టి మఱి యొక ఘట్టమునుండి తననిజఘట్టమునకు మఱలిపోయినపుడు దానికి ఆ రెండవ ఘట్టమునందు ప్రకటముకాగలగుణము, లేక సామర్థ్యముఉండినచో, నాశక్తి మొదటిఘట్టమునందు సుప్తావస్థలోనున్నట్లెంచబడును పైప్రసంగములో నుద హరించిన శూన్యక్షేత్రము ప్రకటమగుటకుకారణ మీప్రకారము శక్తి (తన స్వస్థానమునకు) మఱలిపోవుటయే. ఆదిశక్తియొక్క ధ్రువీయభావములలో

అనగా న్యూనాధిక భావములో న్యూనాంగమిదియే. ఇవ్విధమైన అనాదిన్యూనాధిక భావమే యుండనియెడల ప్రకృతిశక్తులన్నిటిలోను ప్రస్తుతము కనబడుచున్న న్యూనాధిక భావముండకనే పోయెడిది.

## 78. పరమపురుషునిలో అనాదిన్యూనాధిక భావము.

చైతన్యశక్తియే ఆదిశక్తియనియు, ప్రకృతిలో నితరశక్తులన్నియు, మాయాదిశక్తికి వివిధకోశములతో సంయోగముగల్గుటవలన నుత్పన్నమైన వనియు నిదివరలో 11వ ప్రసంగములో చెప్పియుంటిమి. సచ్చిదానందస్వరూపమైన యీ ఆదిశక్తియొక్క భండారము సాక్షాత్ పరమపురుషుడే యనికూడ విశదపఱచియుంటిమి. కావున మాయాదిశక్తిలో న్యూనాధిక భావ మున్నట్లంగీకరించుటవలన సాక్షాత్ పరమపురుషునిలోనే యీ భావమున్నదని పర్యవసానము తేలుచున్నది.

## 79. రెండుధ్రువముల వర్ణనము.

ఏస్థానమునుండి చైతన్యశక్తి కొంతవఱకాకర్షింపబడినదో ఆస్థానమును పరమపురుషుని చరణాంగమనియు, చైతన్యశక్తి పూర్తిగనిండియున్న స్థానమును పరమపురుషుని మస్తకాంగమనియు, సంతుమతపరిభాషలో పేర్కొందురు. వీనినే విజ్ఞానశాస్త్రపరిభాషలో చైతన్యశక్తియొక్క ధనాత్మకధ్రువమనియు, ఋణాత్మకధ్రువమనియు పేర్కొనుచున్నారు.

చరణాంగమునందు, అనగా ఋణాత్మకధ్రువమందు చైతన్యము పూర్తిగ శూన్యముకాలేదు. దానియందుకూడ చైతన్యము చాలవఱకు మిగిలియేయుండెను కాని, దాని తైక్ష్ణ్యము చాలవఱకు తగ్గిపోయెను. అనాదియైన ఈ అవస్థయొక్క లక్షణము స్థూలప్రకృతిలోకూడా ముద్రితమైనట్లు కన్పట్టుచున్నది. ఏలననగా, ఇచ్చట స్థూలాతిస్థూలమైన జడపదార్థములోగూడ కొద్దిగొప్పశక్తి తప్పక యుండుచునేయున్నది.

పైన వ్రాసినప్రకారము న్యూనాధిక భావమున్నట్లంగీకరించినపుడు, అనంతమునకు అంతవత్త్వదోషమాపాదించుచున్నదని సహజముగ నెవరైన నభిప్రాయపడవచ్చును. ఏలననగా, మనకందఱకును సామాన్యముగా రెండు అంతవంతములైన ధ్రువములమధ్యనున్న న్యూనాధిక భావమునుగుఱించియే తెలియును. కాని,

యీన్యూనాధికభావమునుగుఱించి మనకుగల సామాన్యాభిప్రాయములన్నీ, అనంతముయొక్క పరిస్థితినిగుఱించియూహించునపుడు, ఆపరిస్థితికి సర్వాంగత్వేన ఆరోపించుటకు యత్నించక, ఆఅనంతధ్రువముల త్రైక్ష్ణ్యములలో వ్యత్యాసము నవగాహనచేసికొనునంతవఱకే సరిపోల్చిచూచుకొన్న యెడలయుక్తముగనుం డును.న్యూనాంగమును ఆకసమునందలిచలించునట్టి యొక చిన్న మేఘఖండముతో పోల్చి, విశేషాంగమును (అనగా ధనాత్మకధ్రువమును) ఆకసమంతతోను పోల్చినచో, మనము ప్రసంగించుచున్న న్యూనాధికభావముయొక్క స్వరూపము లేక పోలిక, యీదృష్టాంతముమూలముగ దర్శనేంద్రియజ్ఞానమునుబట్టిచూడగా చాలామట్టుకు సరిగనే అవగాహనకువచ్చును.మఱియు నీదృష్టాంతసహాయముచే ఇతఃపూర్వము మనకుగల సామాన్యాభిప్రాయములను ఇందుపైన పట్టించుటచే ఆపాదించిన యంతవత్త్వభ్రమగూడ నొక్కపెట్టున తొలగిపోవును. ఏలననగా, మేఘఖండముమూలమున ఆకాశముయొక్క అనంతత్వలక్షణమున కెట్టిలోపము గలుగ నేరదుకదా !

80. చైతన్యశక్తివిశేషాంగము (మస్తకాంగము) యొక్క అద్భుత తేజఃప్రకాశమును గుఱించిన వర్ణన.

చైతన్యశక్తియొక్క విశేషాంగము (మస్తకాంగము), అనగా, పరమ పురుషుడు, పరమసత్తా పరమచేతనతా పరమానందముల స్వరూపమగుట యేగాక, పరమతేజోమయస్వరూపముకూడా అనగా మహాప్రకాశస్వరూపము గూడ నైయున్నాడు. ప్రకృతిశక్తులన్నియు, వానిఅన్నిటికిని సూక్ష్మదశారూప మైన విద్యుచ్ఛక్తిలోనికిమాఱినపుడు వానిపైనున్నకోశముల అడ్డు తొలగిపోయి నందున నవి మహాప్రకాశమానములైపోవుచున్నవి. దీనినిబట్టి విద్యుచ్ఛక్తి కన్న నెన్నిరెట్లో సూక్ష్మతరమైనట్టియు, విద్యుచ్ఛక్తికి ప్రాణభూతమై నట్టియు చైతన్యశక్తి, యెంతయఖండప్రకాశమానముగ నుండవలయునో యూహించుకొనవచ్చును. వాస్తవమునకు, మనకు సామాన్యజ్ఞానము పొందు టకును ఊహాకల్పనలుచేసికొనుటకును ఉపయోగించునట్టి మనసాధారణ శక్తులు, పరమపురుషుని పరమానందమయస్వరూపముయొక్క ప్రచండ తేజః ప్రకాశముల అద్భుతరూపమునుగుఱించి ఊహామాత్రమైనను చేయుటకు తగ నంత పనికిమాలినవియు మహాతుచ్ఛములు నైయున్నవి. కోటానకోట్లసూర్యుల మహాప్రకాశము ఒకబిందువంతస్థలములో నొకక్షణములో నిమిడి ఏకత్రితమై

పోయినదనుకొనుడు. అప్పుడు గల్గునట్టి మహాప్రచండతేజస్సును చూచి ఆదర్శనమువలన గలిగెడిజ్ఞానానందములను అనుభవించుటకు తగినసమర్థత మనచక్షురింద్రియమున కేవిధముగనో చేకూరినదనికూడా అనుకొనుడు. అట్టి మహాప్రకాశముతోను దానిఆనందముతోను పరమపురుషుని పరమప్రకాశమాన తేజస్స్వరూపముయొక్క అద్భుతశోభను పోల్చుకొనదల్చినయెడల ఒకతుచ్ఛమైన నీటిబిందువునుచూచి దానితో మహాసముద్రముయొక్క మహాతరంగములను దానిశోభను పోల్చుకొనుటవలెనే బహుహీనసాదృశ్యముగ నుండును.

## 81. చైతన్యశక్తిన్యూనాంగముయొక్క ప్రకాశవర్ణనము.

పైవర్ణననుబట్టి పరమచైతన్యశక్తివిశేషాంగము (మస్తకాంగము) యొక్క అపారానంతతేజఃప్రకాశమునుగురించి కేవలము స్థూలముగనే యూహింపసాధ్యమగును. ఇప్పుడు పరమపురుషుని న్యూనాంగమును (చరణాంగమును) గురించికూడ అదేవిధమైన కల్పనారూపములో వర్ణించెదము. పైన 76వ ప్రసంగములో వివరించినట్లు ప్రస్తుతము రూపవంతమైన సృష్టినంతను వెనుకకు తిరగత్రిప్పినట్లూహించుటచే చైతన్యశక్తియొక్క న్యూనాంగమునుండియే యావత్తుసృష్టియు ప్రకటమైనదని విశదపడుచున్నది. ఇపుడు సృష్టినంతనొకసారి విహంగమదృష్టితో జూచినయెడల యీలోకమునందే అనగా మనకు దృగ్గోచరమైన యీసృష్టిభాగములోనే సూర్యచంద్రతారాదినామములుగల యసంఖ్యాకదేదీప్యమానమహాగోళములు ప్రకాశించుచున్నట్లు తెలియగలదు. ఇంతకుముందు 28వ ప్రసంగములో జెప్పినట్లు ఈలోకము విశ్వసృష్టిలో తృతీయమహాఖండమైన పిండదేశములో నొకభాగము. ఈపిండదేశమునకు పైనున్న ద్వితీయమహాఖండములోని అనగా బ్రహ్మాండములోని శక్తియు తేజఃప్రకాశములును పిండదేశముకన్న నెన్నియోరెట్లధికములై యున్నవి. కావున నీయుఖండసృష్టిలోని యీరెండుభాగములలోనే మానవమాత్రుని దర్శనశక్తి విచారణశక్తులకు చూచుటకును ఊహించుటకును శక్యముకానంత ప్రబలతేజఃప్రకాశమున్నట్లు తేటపడుచున్నది. ఇప్పుడు చైతన్యశక్తియొక్క అనాదియపారభండారమునకు క్రిందుగనున్నట్టి నిర్మలచైతన్యమండలముల యద్భుతతేజఃప్రకాశములనుగూడ పిండబ్రహ్మాండదేశముల తేజఃప్రకాశములతో జేర్చినయెడల న్యూనాంగముయొక్క సంపూర్ణతేజఃప్రకాశములనుగురించి సరియైన అభిప్రాయమేర్పడగలదు. స్వతః ఈన్యూనాంగము నిజముగ మానవదృష్టికి

బొత్తిగ భరింపశక్యముకానంత మహాతేజోవంత మేమైనను విశేషాంగముయొక్క అఖండప్రచండ తేజఃప్రకాశముతో బోల్చిచూడగ నది సూర్యుని తేజస్సు నెదుట పూర్ణిమచంద్రుడు వెలవెలబోయినట్లే వసుపువర్ణముగ గన్పించును.

## 82 మానవునిజ్ఞానము భ్రమాత్మకజ్ఞానముగాదు.

పైనచెప్పిన చైతన్యశక్తియొక్క అనాదిస్థానాధికావస్థను గురించిన వర్ణన నిస్సందేహముగ నతితుచ్ఛమైన మానవబుద్ధిఘట్టమునుబట్టియే చేయ బడినదని చెప్పుటలో సందేహములేదు. అందువలన ఇది వాస్తవపరిస్థితియొక్క యథార్థవర్ణన కానేరదని యెవరైనను పూర్వపక్షముచేసినయెడల, మేము చెప్పినవర్ణనమంతయు సందేహాస్పదమైపోవును. కావున ప్రస్తుతవిషయవిమర్శ నమును కొంతఆపుచేసి, ముందుగ నీయాక్షేపణలోని తప్పుటభిప్రాయమును తొలగించుట యవసరము. ఈయాక్షేపణ కాధారభూతమైన హేతువాదము నీక్రిందివిధమున వివరించవచ్చును.

మనదృష్టికి గోచరమైన యీసృష్టిభాగమునుగురించిన, అనగా నీలోక మునుగురించిన జ్ఞానమంతయు మనస్సుమీద నీప్రత్యక్షసృష్టిచే కలిగించబడిన ప్రతిబింబములవలననే చేకూరుచున్నది. మనస్సుపైన జగత్ప్రతిబింబములు పడక పోయినచో దానినిగురించి మనకెట్టిజ్ఞానమును గలుగజాలదు. దీనినిబట్టి ప్రతి బింబములకు జగత్తునకును మధ్య కార్యకారణసంబంధము స్థాపితమైనట్లు ధ్రువ పడుచున్నది. అనగా, ప్రతిబింబములు కార్యములును, జగత్తు వానిసంభవము నకు కారణమునైయుండుచున్నవి. కాని, కార్యజ్ఞానముకల్గినచో కారణజ్ఞానము గూడ నుండవలసిన యవసరములేదు. ఈజగత్తుయొక్క ప్రతిబింబములు పడినట్టి సమస్తజీవులు నశించినచో కార్యమునశించిపోవునుగాని, కారణము యథా ప్రకారముగ నట్లేయుండిపోవును. అప్పుడుండెడి యవస్థ కార్యావస్థ కానేరదు. అందుచే సృష్టినిగురించి మనకిపుడుగల్గినజ్ఞానమంతయు, కేవలము జీవులకు గల్గిన యాభాసయేగాని, యథార్థజ్ఞానముకానేరదు. పైపూర్వపక్షమున కాధారమైన హేతువాద మిదియే.

ఈసృష్టియంతలో నొక్కజీవాత్మకే జ్ఞానసంపాదనార్హత గలదు కాని మరెవ్వరికిని జ్ఞానమును స్వీకరించగలసామర్థ్యము లేదని చెప్పగలిగినపుడే నిస్సం శయముగా పైహేతువాదము నిరాక్షేపణీయమగును. కాని మేమింతకు ముందుకనే చెప్పినట్లు (16 మొ 22 వఱకు ప్రకరణములను చూడుడు) అను

లన్నియు, చైతన్యశక్తికనంతభండారమైన పరమపురుషునినుండి యుద్గతములైనట్టి వేర్వేరుతరహాలుగల కిరణములైయుండి, ఆపరమపురుషుని తత్త్వమునుండియే తమనిజధర్మములైన సత్తా చేతనత ఆనందములను సంపాదించుకొనినవి. ఈయాత్మలు తమకొఱకై రచించుకొనినశరీరములను ఈయఖండసృష్టికి ప్రతిబింబరూపమున రచించుకొన్నవి, అనగా, జీవాత్మయొక్క శరీరము విశ్వసృష్టికొకచిన్నసమూనారూపముగ నున్నదనికూడ యిదివరలోనే చెప్పబడినది. కావున, జీవాత్మయొక్కజ్ఞానగ్రహణశక్తిగూడ నాపరమపురుషుని చేతనతకే అనగా, చిత్స్వరూపమునకే, లేక జ్ఞానశక్తికే బహుస్వల్పపరిమాణములోనమూనా అని తెలును. ఇది సరియైనచో, నీసృష్టి భగవంతుని కేవిధముగకనఁబడుచున్నదో జీవునికిగూడ చాలమట్టుకు ఆవిధముగనే కనబడుననియు, అందుచే మానవునికి కనబడెడిస్వరూపమే రచనయొక్క వాస్తవస్వరూపమనియుకూడా స్థిరపడుచున్నది. కనుక, మానవుడు యథార్థవిషయముల నాధారముచేసికొనియు, సర్వ్యమైన యనుమానపరిమాణముల నాధారముచేసికొనియు సంపాదించినజ్ఞానమును మాటవరుసకైనను భ్రమాత్మకమని యనకూడదు, (దానిని భ్రమాత్మకమని ఆచరణలో నెవరును అనలేఅనరు)

## 83. పరమపురుషుని ఆదిదశయొక్క వర్ణనము.

సృష్టికిపూర్వము పరమపురుషుడొక్కడే యుండెను. కాని న్యూనాధిక (ధ్రువీయ) భావములోనుండెను. ఆదశలోనుండగా ఆయన స్వాత్మానందగతుడై ఆ అపారపరమచేతనతకంతకును ఆపురుషుడొక్కరే అద్వితీయాభిమానిగా ఉండెను. ఆపరమపురుషుడు రూపరేఖావర్ణములులేనివాఁడై, పరమప్రేమానందము, పరమప్రకాశము, పరమజ్ఞానము, పరమసత్త, అనెడినాల్గింటిరముదాయమే తననిజస్వరూపముగా కలవాఁడై యుండెను. అనగా అనేకవర్ణములుకలియుటచే తెలుపుకాంతి యెట్లుతయారగుచున్నదో అట్లే పరమప్రేమానందము, పరమప్రకాశము, పరమజ్ఞానము, పరమసత్తయునసెడి నాల్గును అన్యోన్యముకలిసిపోగా పరమపురుషునినిజతత్త్వమగును. సమస్తచేతనతకును ఏకరాశియైన పరమపురుషునివద్దనుండి, న్యూనతరచైతన్యమగుటచే, కొంతదవ్వునవడియున్న న్యూనాంగముయొక్క పరిస్థితినిగుఱించి పరమపురుషునికిపూర్తిగ తెలిసియేయుండెను. కాని న్యూనాంగమునకుమాత్రము అట్టిజ్ఞానసంపన్నతాలక్షణము లేకుండా అది గ్రుడ్డికసమూర్ఛావస్థవంటియవస్థలో నుండెను. ఈ న్యూనాంగములో నెన్నియో

తరగతులుగలవు. స్థూలాంగ కేంద్రములోను ఆకేంద్రమునకుసమీపమున నున్నట్టి భాగములలోను ఉన్నచైతన్యముకంటే విశేషాంగమునకుసమీపమున నున్నట్టి స్థూలాంగ భాగములో చైతన్యము అధికముగనుండెను. స్థూలాంగ దేశములో చేతనత తక్కువగా ఉండుటకు కారణమేమనగా చైతన్యశక్తి పైనుదహరించినట్లుగా అపరమపురుషుని వైపున కాకర్షింపబడిపోవుటయే.

## 84. ఆత్మాంశలయొక్క ఆదిదశావర్ణనము.

సృష్టికన్న పూర్వము పై ప్రసంగముచివరనుదహరించిన చైతన్యశక్తి యొక్క ఉపసంహారణమే స్థూలాంగమును సూక్ష్మాకర్షణద్వారా అనాదియైన అప్రబుద్ధావస్థలో నుంచివేసెను. ఈ అప్రబుద్ధావస్థనుస్థాపించిన సూక్ష్మాకర్షణ ధారలో ఒకేవైపునకుతిరిగివనిచేయునట్టి అసంఖ్యాకమైనబిందువులు ఉండెను. ఈబిందువుల సంయుక్తక్రియవలన (united action) తయారైన చైతన్యశక్తి ధారకు స్వయముగా పరమపురుషునితో నిరంతరసంయోగముకలదు. పరమ పురుషుని కీధారమూలముననే స్థూలాంగముయొక్క పరిస్థితినిగుఱించినజ్ఞానము కలిగెను. పరమపురుషునికిపుడుగూడ నీవిధముగనే సృష్టిలోనిస్థూలాతిస్థూలభాగ మునుగుఱించినజ్ఞానము దాని (,ఆస్థూలభాగముయొక్క) యంతరతమస్థా నములోనున్న చైతన్యాంశద్వారానే (అదియెంతదుర్బలతమమైననూగాక) కలుగుచున్నది. అనగా, బాహ్యకోశముమాత్రము అప్రబుద్ధావస్థలోనుండు చున్నదికాని, యంతర్గతచైతన్యాంశ యెల్లప్పుడు ప్రబుద్ధమైయే యుండుచున్న దన్నమాట. స్థూలాంగములోని బిందువులు, ప్రత్యేకముగామట్టుకు, అనగా, సంయుక్తధారనుండిభిన్నములుగ నెంచబడినపుడు, అప్రబుద్ధావస్థలోనుండెను. ఈబిందువులే ఆదిదశయందుండిన ఆత్మలు.

“బిందువు” అనుపదము నుపయోగించుటవలన ఆత్మాంశలలోనిశక్తి అత్యంతముహీనమైనదని, అనగాతుచ్ఛమైనదని అపభ్రమలో పడరాదని యిచ్చటమఱొకసారి చెప్పవలసియున్నది. సూర్యకిరణము సామాన్యదీపపు కిరణముకంటె ప్రకాశములోను ఇంకననేకవిషయములలోను అధికశక్తివంత మైనదని యందఱకునుదెలియును. ఈరెండురకములకిరణములును మనకుబాగుగ ననుభవములోనుండుటచే మనమెన్నటికిని వానిపరస్పరతారతమ్యమునుగుఱించి పొరపడనేరము. కాని ఒకవస్తువును మఱొకదానితోపోల్చినపుడు వానిలో నేదో ఒకవస్తువునుగుఱించిమాత్రమే మనకు అనుభవము లేక జ్ఞానముఉండునట్టి

పరిస్థితిలో ఆయుపమానముమూలమున మనకు రెండవవస్తువునుగుఱించి యేర్పడునట్టియూహాలు తఱచు తప్పుగనుండును. బహుసామాన్యపదములనే ప్రయోగించి చెప్పినను కూడా మనస్సులో ఒకమాటకింకొకఅభిప్రాయమే కలుగు చుండును. ఉదాహరణమునకై సూర్యునిగుఱించి ప్రసంగించునపుడు మనము "సూర్యుడు" అను పదమునుపయోగించగా, మనకు వెంటనే మనయనుభవ ప్రకార మొకప్రకాశమానమైనపళ్ళెరముయొక్క ఆకారమువంటిఆకారము గోచరించును. కాని సూర్యుని యథార్థమైన మహావిస్తృతి పరిమాణములను మహాప్రకాశమును,ఉన్నదున్నట్లు, ఒకనారింజపండునుచూచినట్లు సంపూర్ణముగ చూడగల మహావిశాలదృష్టిగల మానవుడెవరైననుండినయెడల నతనికి "సూర్యుడు" అనుపదము చేగలిగెడియర్థమునకును సామాన్యమానవులకయ్యెడి యర్థమునకును చాల వ్యత్యాసముండును. ఏలనన అతనికిగలసూర్యవిషయక జ్ఞానమునకును, మామూలు మానవులకుగల జ్ఞానమునకును చాల వ్యత్యాస ముండును. కావున, బిందుపదము నర్థము చేసికొనుటలో నీవిషయములన్నియు గమనింపదగియున్నవి. ఈబిందువులు లేక ఆత్మాంశలు తమపృథక్క్రియా(individual action)హేతువుచే(ఈపృథక్క్రియ వాని సంయుక్తక్రియకంటె వేఱైనది.) నుత్పన్నమైనకోశములచే నావరింపబడినట్టి మహాప్రబలగుప్తశక్తియొక్కయు ఆకర్షణశక్తియొక్కయు కేంద్రములుగా తెలిసికొనదగును కాని, వానిని కేవలము శూన్యప్రాయమైనట్లుగను తుచ్ఛములుగను ఎంచకూడదు. ఆత్మల యొక్క సంయుక్తక్రియను శబ్దముతో పోల్చినచో వానిపృథక్క్రియను, అనగా, కోశోత్పాదనచేయుక్రియ నాశబ్దము వెనువెంట బయల్వెడలునట్టి ధ్వని యన వచ్చును.సృష్టికిపూర్వము ఆత్మాంశలు, తమ చేతనతలో ప్రధానభాగము ఆది భండారమునందు లీనమైయుండిపోవుటచే, ఈకోశములచేనావరింపబడినవై అప్రబుద్ధావస్థలో పడియుండెను,ఆత్మాంశల సంయుక్తక్రియవలన న్యూనాంగము సంపూర్ణముగా స్థాపితమయ్యెను. వాని పృథక్క్రియవలన నొక్కొక్కయాత్మకే తనకోశము వేఱువేఱుగా యేర్పడెను.

85. <u>ఆదిచైతన్యధార ప్రవహించుటకుముందు ఆదిభండారమునందు తరంగముద్భవించెను.</u>

బిందురూపమైనయాత్మాంశల సంయుక్తక్రియమూలమున అనాది న్యూనాకర్షణరూపమైన ప్రవాహము వేర్పడినదని యింతకుముందు చెప్పియుంటి

ట్టిమి. ఈయాకర్షణచే చాలకాలమువఱకు నేమియు మార్పుగలుగలేదు, కాని యుక్తసమయము రాగానే భండారముపైనున్న కీఆకర్షణయొక్క వేగ మతితీవ్ర మైపోయినందువలన మొదటినుండియు చైతన్యము తక్కువగ నేయున్న న్యూనాంగములో చేతనతాలోపము ఇంకనుఎక్కువై పోయెను. అనగా, విశేషాంగమైన ఆదిభండారములోనికి మొదటలో ఆకర్షింపబడియుండిన చైతన్యముకన్న నెక్కువచైతన్యము ఆకర్షింపబడెను. ఈచైతన్యలోపము న్యూనాంగములో నేభాగమున గలిగెనో, ఆభాగము పరమపురుషునివద్దనుండి. అనగా, విశేషాంగమునుండి మఱింతదూరముకాదొడగెను. ఈపని సృష్టిప్రారంభమునకు సరిగాముందే జర్గుట మొదలిడి కొంతకాలమువఱకు నీప్రకారము జరుగుచునే యుండెను. యుక్తసమయము వచ్చినపుడు న్యూనాంగమునకు సన్నిహితతమమైన ఆదిభండారభాగమునుండి యొక మహాతరంగముదయించి ఆదిచైతన్యధారప్రకటమాయెను. ఆదిశక్తి చేతనతనుప్రబోధముచేయురూపములో (process of spiritualisation) ప్రకటమైనపుడు దానినే ఆదిధారయని చెప్పుదురు. ఆదిశక్తియొక్క ఈచేతనతాప్రబోధము జరిగించుపని చుంబకశక్తి బాహ్యవస్తువులను చుంబకముగా చేయుటవంటిదే. (process of magnetisation), (63వ ప్రసంగము చూడుడు). ఈఆదిధారాప్రకటనముయొక్క యుద్దేశ్యమే మనగా, ఆదిచైతన్యభండారముయొక్క భాగముగాచేయుటకర్హమైన న్యూనాంగభాగమును పరమపురుషుని, అనగా విశేషాంగముయొక్క హద్దులోనే స్థాపితముచేసి, న్యూనాంగముయొక్క యితరభాగములలో చేతనతాలోపము వలనగలుగుచున్న (ముందు చెప్పబోవునట్టి) దుష్టపరిస్థితులు ఈభాగములో (దాని సహజచేతనతాలోపముమూలమున ప్రకటము కావలసియున్న వానిని) ప్రకటముకాకుండా చేయునంతయధికముగా చేతనతను ఈభాగములో వృద్ధిచేయవలయుననియే.

## 86. శబ్దధారయు, సురత్‌ధారయు.

చైతన్యశక్తియొక్క ధారాంగమును చైతన్యశబ్దధారఅనియు, "భండార్" అంగమును సురత్‌ధారఅనియు చెప్పుదురు. ఈరెండు అంగములును ఒకదానినొకటి ఆశ్రయించి యున్నవి. చైతన్యశక్తియొక్క క్రియాశీలరూపమును శబ్దమనియు, కేంద్రకాకర్షకరూపమును (అనగా భండారరూపమును)

సురత్ అనియు చెప్పవచ్చును. ఆకర్షణము (అనగా దగ్గరకు లాగుకొనుట) శబ్దముయొక్క కార్యము. కేంద్రనిర్మాణము సురత్ యొక్క కార్యము. ఈ రెండుధారలయొక్క, ఈ రెండు విశిష్టలక్షణములే క్రిందిమండలములలో జంతువులలోని స్త్రీపురుష భేదమునకు కారణభూతమైనవి.

## 87. నిర్మలచైతన్యదేశము, దాని ఆఱుస్థానకములును.

పరమపురుషుడు స్వయముగ అనాదిధ్రువీయ భావములోనుండి, విశేష చైతన్యమురొయొక్క అపారాంగమొకటియు, (దీనినే మస్తకాంగమందురు) మధ్యాంగమొకటియు (దీనిని కాయము లేక శరీరము అనవచ్చును) న్యూన చైతన్యాంగమొకటియు (దీనిని చరణాంగమనికూడ చెప్పవచ్చును.) అని మొత్తము మూడు వేర్వేఱు అంగములుగలిగియుండెను. ఆ కారణముచే పరమ పురుషునినుండి సృష్టికిప్రారంభములో (జంతువులలో లోనికిపోవునట్టి ప్రాణ వాయువు బయటకు వచ్చు అపానవాయువువలెనే) బయల్వెడలిన శబ్దధార సురతధార అను రెండుధారలుగూడ, పరమపురుషునిలోనున్న వ్యవస్థననుసరించి, పరమపురుషునికి తిన్నగా యెదుటనున్న న్యూనాంగభాగములో, నొక్కొక్కటి మూడేసిభాగములుగా తమంతటతాము విభజనమైపోయెను. జంతువులలో లోనికిపోయినప్రాణవాయువు తిరిగి బయటకువచ్చునపుడు శరీరములోని పదార్థములతోగలిసి (బొగ్గుపులుసుగాలిగామాఱి) యీవలకువచ్చును. కాని పరమపురుషునిలో పరమోత్తమతరగతికిచెందిన నిర్మలచైతన్యమేతప్ప మఱేమియు లేనందున, ఆయనవద్దనుండిబయటకువచ్చిన ఉచ్ఛ్వాసరూపమైనసురత్ ధార పరమనిర్మల చైతన్యశక్తితోనే మిళితమైవచ్చును. అందుచే నదికూడ లోనికిపోయి ఆయనలో లీనమైపోవునట్టి శబ్దధారతో సమానముగనే చైతన్యపూరితమై యుండును. శబ్దధారయొక్క ధ్రువీయభావముమూలమున నుత్పన్నమైన మూడుమండలములును రాధాస్వామీధామము, అగమలోకము, అలఖలోకము, అనిపేర్కొనబడుచున్నవి. సురత్ ధారయొక్క ధ్రువీయ భావముమూలమున నేర్పడిన మూడులోకములును అనామి, సత్యలోకము, భఁవరగుఫా యను నామములచే పేర్కొనబడుచున్నవి. సురత్ ధారకృత్యము, చేతనతను ప్రబోధముచేయు నిమిత్తమై, (process of spiritulisation) బాహ్యమునకు ప్రవహించుటయగుట వలనను శబ్దధారకృత్యము భండారము వైపునకాకర్షించుటయొక్కటే అగుట వలనను లోనికిఆకర్షించుకార్యము నెరవేర్చు శబ్దధారయొక్క నివాస స్థానముకన్న బయటకువ్యాపించుకార్యము చేయుసురత్ ధారనివాసస్థానము

కొంతక్రిందుగనున్నది. కావున పైనచెప్పిన సురత్ ధారస్థానములు మూడును శబ్దధారాస్థానములు మూడింటికన్న క్రిందుగనుండి వానిచైతన్యశక్తికూడ శబ్దధారాస్థానముల చైతన్యశక్తి కన్న కొంత తక్కువతరగతికే చెందియున్నది. ఈఆయుస్థానములలో నీరెండు ధారలునుకలిసి యేకరూపముగామాఱి చుంబకశక్తియొక్క, లోహమునుచుంబకముగా మార్చుటయు లోహమును దగ్గఱకు ఆకర్షించుటయు, అనెడి సంయుక్తక్రియ లెట్లుసామరస్యముతో సాగుచున్నవో అదేవిధముగా, సహకారముతో పనిజరుపుకొనుచున్నవి. ఎట్లైనను, ఈధారలు రెండింటిమూలముననే నిర్మలచైతన్యదేశములో ఆయుస్థానములు ఏర్పడినవి. ఈమండలాధిపతులను గుఱించియు నీమండలములలోని నివాసులయొక్కయు పరిస్థితినిగుఱించియు నిపుడు కొద్దిగా వివరించబోయెదము.

## 88. నిర్మలచైతన్యస్థానములలోని నివాసులు.

న్యూనాంగము విశేషాంగమువైపునకు తగినంతవేగముగా ఆకర్షింపబడినపుడు ఆత్మాంశలపైన వానికేంద్రనిర్మాణధర్మమూలమున నేర్పడినకోశములు, లేక చర్మములు, జారిపోయి, దూరముగాతొలగిపోయినవి. ఆదిజడకోశము లీతీరున పోవుటచే ఆత్మలు అనాదినిద్రనుండి మేల్కాంచెను. ఏలనన కోశములుపోవుటచే నాత్మాంశలచైతన్యధారల కాకోశములను యథాస్థితిలో నుంచి కాపాడవలసిన బాధ్యతవదిలిపోయి, అవిముందుకన్న నెక్కువ యుత్తమ తరగతికిచెందిన చైతన్యఘట్టములమీదికి ఆకర్షింపబడుటచే వానికి విశేష చైతన్యలాభము కలిగెను. ఆత్మల కీప్రబోధముగలుగుట జీవులకు సుషుప్తి నుండి సమాధ్యవస్థలోనికిమాఱుట యెట్లుండునో చాలమట్టుకు అదేవిధముగానే ఉండును. సమాధ్యవస్థలో ఉచ్ఛ్వాసనిశ్వాసలును, శరీరములోరక్తప్రవాహమును కట్టుపడిపోవును. ఏలనన, నప్పుడు జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలను కలిగించునట్టి ముఖ్యచైతన్యధారలు మఱొక సూక్ష్మతరఘట్టముమీదికి ఆకర్షింపబడిపోవును.మృత్యుసమయములోగూడ నీవిధముగనే జరుగునుకాని,అప్పుడు విశేషమేమనగా, ఆసమయమున చైతన్యధార లంతకన్న నెక్కువయూర్థ్వతరమైన ఘట్టము మీదికాకర్షింపబడిపోవును. సూక్ష్మతరఘట్టముమీదికి జేరుకొనిన తోడనే జీవుడు తనస్థూలశరీరమును పోలినసూక్ష్మశరీరము నొకదానిని నచ్చటి పదార్థముతో నెట్లు తయారుచేసికొనునో అట్లే ఆత్మాంశలుగూడ నాదిలో తమ ఆదిజడకోశములు విడిపోయినతోడనే తాము జేరుకొన్న ఉన్నతచైతన్య మండలముల పదార్థముతో తమకొఱకై నూతనచైతన్యదేహములను నిర్మించుకొనెను. ఈయున్నతమండలము లేపదార్థముతో నేర్పర్చబడినవి?

ఆదిభండారముపైపున ఆకర్షణవేగమెక్కువయైనపుడు తమతమస్థానములు నుండి జారి క్రిందికిపడిపోయిన జడకోశములపదార్థముతోనే ఈయూర్థ్వమండలములు తయారయ్యెను. ఈతబ్బిబ్బులవలన క్రిందికిపడిపోయిన కోశములకు కూడ ఆత్మల సంయుక్తచైతన్యధారయొక్క క్రియాత్మకశక్తివంటి శక్తిగలిగి ఆకోశములుగూడ సంపూర్ణరూపముగా చైతన్యాత్మకమైపోయినవి. అట్టివిధమైన పదార్థముతో తయారుకాబడినవగుటచే నాశరీరములు ఆయాత్మాంశలయొక్క చైతన్యక్రియాకలాపమున కెట్టియాటంకమును కలుగజేయునవికానేరవు. చైతన్యవంతమైన శరీరములుగల యీఆత్మలు వాని వాని నివాసస్థానముల తరహానుబట్టి హంసలనియు, పరమహంసలనియు వేఱువేఱుగా పేర్కొనబడుచున్నవి.అనగా పైమూడుమండలములలో నివసించువారిని పరమహంసలనియు, క్రింది మూడుమండలములలో నుండువారిని హంసలనియు పేర్కొందురు. నిర్మలచైతన్యలోకవాసులలో లింగభేదము ప్రకటరూపమున లేనేలేదు. కొన్నిఆత్మలలో శబ్దాంగమును కొన్నిఆత్మలలో సురత్ అంగమును ప్రధానముగనుండుటవలన శబ్దాంగము ప్రధానముగనున్నఆత్మలను పురుషవర్గమనియు సురత్ అంగము ప్రధానముగనున్నఆత్మలను స్త్రీవర్గమనియు చెప్పవచ్చును.కాని యీఆత్మలలో,నీభూలోకములోనున్నవిధముగ, స్త్రీపురుషవ్యవహార మింతమాత్రము లేదని తెలిసికొనదగును.

## 89. ఆదిధారయొక్క ప్రధమకేంద్రమైన అగమపురుషునివర్ణనము.

ఆదిచైతన్యధార నిజభండారమునుండిబయలువెడలినపిమ్మట స్థాపించిన ప్రథమకేంద్రముపరమపురుషరాధాస్వామిదయాళుని యపారధామముక్రిందనున్న మొట్టమొదటిమండలాధిపతిగ నేర్పడెను. ఈమండలాధిపతి పేరు అగమపురుషుడు. రచనకు పూర్వము న్యానాంగమునుండి ఆకర్షింపబడి పరమపురుషుని విశేషాంగములో (అనగామస్తకాంగములో) కలుపుకొనబడిన మహాచైతన్యపుంజమే యీఅగమపురుషుడు. పరమపురుషునితో కలయిక కలుగుటచే నీమహాచైతన్యపుంజమునకు ఇంక నెక్కువవిశేషత చేకూరెను.మఱియు నది, దాని చైతన్యముయొక్క పరిపూర్ణవిశిష్టతకు ఎన్నటికి నెట్టిలోపములేకుండా అట్టేయుండునట్లుగా, ఆదిధారయొక్క సంయోగప్రభావమువలన పోషింపబడుచుండెను. ఆదిధారప్రవహించుటకు కారణము క్రిందిమండలముల చేతనతను మేల్కొల్పుట యొక్కటేగాక మఱొకగొప్పకారణమేమనగా సృష్టికిపూర్వ

ముందున్న అనాదిన్యూనాధిక భావముయొక్క ఫలితముగా పరమపురుషుడు విశేషాంగమునకు క్రిందుగా నివాసమిప్పించిన చైతన్యమును, తన అనాదిఅవస్థ యొక్క సహజపరిస్థితినిబట్టి తనలో శాశ్వతముగా కలుపుకొనుటకు వీలు లేకుండుటయే. అందుచేత యుక్తకాలమువచ్చినపుడు పరమపురుషుడా చైతన్యమును తనసారతత్త్వముయొక్క ప్రభావముతో పూర్తిగానింపి (అనగా ప్రసాదముగ నొసర్చి) తిరిగి వెనుకకుపంపివేసెను. అట్లుచేయుటలో మహోద్దేశ్యమేమనగా న్యూనాంగమునకును అందుండినట్టి యసంఖ్యాకమైన ఆత్మాంశలకును ప్రబోధముగలుగచేసి . వారలకు ఆనందమయావస్థనుగలిగించుటయే, అనగా, న్యూనాంగములో అప్రబుద్ధావస్థనుపోగొట్టి క్రియాత్మకావస్థను కలిగించుటయే,

నిజభండారమునుండి ఆదిధారప్రకటమైనపుడు దానితోకూడ మహాప్రచండతేజఃప్రకాశములుబయల్దేరి చుట్టుప్రక్కల దేశమంతటను మహాదేదీప్యమానగోళములతోకూర్చిన దుప్పట్లు పఱచినట్లయిపోయెను. ఈగోళములను పారిభాషికపదములలో సూర్యచంద్రులందురు. శబ్దాంగము ప్రధానముగానున్న గోళములను సూర్యులనియు, సురత్ అంగము ప్రధానముగానున్నగోళములను చంద్రులనియు చెప్పుదురు. ఆచుట్టుప్రక్కల ప్రదేశమునకంతకు నీగోళముల ద్వారానే ఆదిభండారముయొక్క చేతనత అందజేయబడెను. మనము నివసించుచున్న దేశములోగూడ, నదేప్రకారము ఇచ్చటనున్న సూర్య, చంద్ర, తారాగణములద్వారానే శక్తి వ్యాప్తముచేయబడుచున్నది. అదిగాకుండ నాచైతన్యగోళము లాదేశములోని ఆత్మలకు నివాసస్థానములుగగూడ నుపయోగపడుచుండెను. నిర్మలచైతన్యసృష్టిలోని యితరభాగములవలెనే ఈగోళములుకూడా చైతన్యవంతములు ప్రబుద్ధములునై యుండెనని గమనింపదగును. పైనచెప్పిన దేశము ఆదిభండారములో నేభాగమునుండి ఆదిధారయుదయించెనో ఆయాదిభండారభాగమును చుట్టియేయున్నది. అగమపురుషుని మండలము అధామము (అనగా ఆ ఆదిభండారభాగము) క్రిందనే ప్రకటమైనందున పరమపురుష రాధాస్వామిదయాళునిధామమునకు అగమలోక ముఖ మహానీయ సింహద్వారముగ నెంచదగును.

## 90. నిర్మలచైతన్యదేశముయొక్క శేషించిననాల్గులోకములు.

ఆదిధారకుడు తనప్రథమ కేంద్రమునేర్పఱచుకొనుటలో సహజముగ కొంతకాలము గడచిపోయెను. అది తయారైనపిమ్మట నిర్మలచైతన్యదేశము యొక్క (పైనుండి) రెండవలోకమునకధిపతియగు అగమపురుషుడు మహా ప్రకాశమానచైతన్యసింధురూపమున ప్రకటమాయెను. ఆదిధార తనమహా చైతన్యము నంతను ఈమహాగాధగంభీరసింధువులో కలిపివేసి తాను గుప్తమై పోయెనోయన్నట్లయిపోయెను. అనగా ఆదిధార యీలోకములఅడుగువఱకును వెళ్ళి మఱిక్రిందికిపోకుండ నంతటితోనే అగిపోయెను. ఆక్రిందిసృష్టికార్య క్రమమును, అగమపురుషుడే ఆదిభండారము చేజరిపించబడిన నమూనాప్రకారము సాగించి, తనలోకమును, అందలిసూర్యచంద్రులను, ఆసూర్యచంద్రులలో నివసించునట్టిఆత్మలను ప్రకటముచేసెను. నిర్మలచైతన్యదేశముయొక్క మిగిలిననాల్గుమండలములసృష్టిగూడ నీతీరుననే జరిగెను. ఇచ్చట మఱొక విషయము చెప్పవలసియున్నది. అదేమనగా, నిర్మలచైతన్యదేశముయొక్క పైమూడులోకములగణములోను, క్రిందిమూడులోకములగణములోనుగూడ అన్నిటికన్నపైలోకము తనక్రిందిరెండులోకములకును, ప్రాణము (అనగా చైతన్య మును) మాత్రమేయిచ్చునుగాని వానిలోనిసృష్టియేర్పాట్లలో నేమియుపాల్గొనదు. ఈనియమము ఆముల్లోకగణములురెండింటిలోనుగూడ వర్తించును. మన శరీరములోగూడ నేర్పాటు ఇదేపద్ధతినిఉన్నది. అనగా, ఆత్మ అవసర మైనశక్తిని, అనగాప్రాణమునుమాత్రమే శరీరమున కిచ్చును గాని శరీర సంరక్షణమును,మిగిలినసమస్తశారీరికకృత్యములును-సూక్ష్మములు, స్థూలములు అన్నియును- మనశ్శరీరముల శక్తులద్వారానే నెఱవేరుచున్నవి.

## 91. మహాసున్నమైదానము - దానిలోని ఆఱు సూక్ష్మస్థానములును.

నిర్మలచైతన్యదేశములోని లోకములన్నియు పరమపురుషునియపార దేశమునకువృద్ధి (Expansion=విస్తృతి) చేసినట్లు రచింపబడినవని యిదివఱలో చెప్పియుంటిమి. అందువలన నవి పరమపురుషునివిశేషాంగములలో నొక భాగముగ తయారైనవి. కావున నీయాఱులోకములకు నెట్టి లయక్షయ వికారములు నెన్నటికిని గలుగనేరవు. ఆదిభండారమునంటియున్న మధ్య దేశములోని (Neutral zone) పైభాగమును నిర్మలచైతన్యస్థానములుగ

కూర్పు వేసినట్టి (పైనుదహరించిన) రచనాత్మకక్రియ ఆస్థానములక్రింద అనగా ఆమధ్యదేశములోని (Neutral zone) మధ్యభాగమునందు ఒకమహా శూన్యతావస్థను కలుగజేసెను, ఈమహాశూన్యతయొక్క మహామైదానమును సంతుమతపరిభాషలో మహాసున్న (మహాశూన్య) దేశమందురు. ఈమైదానము నిర్మలచైతన్యలోకములకును (మధ్మదేశములోనినిమ్న భాగమునుండి ప్రకటమైన) బ్రింహ్మాండీమనస్సుయొక్క లోకములకును నడుమ నొకహద్దు లేక అడ్డుగట్టు పనిచేయుచున్నది. ఈమహాసున్న మైదానమునకు, నిర్మలచైతన్యలోకములను ప్రకటముచేసినరచనాత్మకక్రియ యొక్క వత్తిడి నిరంతరము గలుగుచుంచుటచే దీనిమీదకూడా నిర్మలచైతన్యస్థానములసూక్ష్మముద్రిలు పడినవి. అందువలన ఈమైదానములోకూడా నిర్మలచైతన్యలోకముల కనుగుణముగా ఆయుపభాగ ములు ఏర్పడెను. ఈఉపభాగములను నిర్మలచైతన్యలోకములయొక్క ఛాయలని చెప్పవచ్చును, నిర్మలచైతన్యదేశములో నిమ్నతమమండలమైన భంవరగుహ లోకముయొక్క అధిపతియైన సోహంపురుషుడే ఈభాగములనురచించెను.

## 92. కాలపురుషుడు, ఆద్యయు ప్రకటమగుట.

నిర్మలచైతన్యలోకములసృష్టి పూర్తికాగానే, ఆదిశక్తియొక్క రచనాత్మకవేగము బాహ్యముగ సమాప్తమైపోయినందున కొంతకాలమువరకు రచనాత్మకక్రియ ఆగిపోయెను. ఈవిరామకాలములో భండారముపైపునకు ఆదిశక్త్యాకర్షణము మరింతయెక్కువతీవ్రమైపోయెను. ఏలననగా, ఆయాకర్షణ మునకు నిర్మలచైతన్యదేశములోని క్రిందిమండలముల ఆకర్షణప్రభావముగూడ గలిసెను. ఈక్రిందిస్థానములు ఆభండారములో కలసిపోగల్గునంత అధికముగా చైతన్యవంతములయ్యెనుగాని, వానిలోనింకను నిమ్నతరశ్రేణి చేతనతగూడ కొంతవరకుకలిసి యుండిపోయెను. ఏలననగా, మహాసున్నస్థానముల నేర్పాటు చేయునిమిత్త మారంభమైన రచనాత్మకక్రియ ఆనిమ్నశ్రేణిచేతనతను పూర్తిగబహిష్కరించుటకు చాలకపోయెను. అందువలన రచనాత్మకక్రియ తిరిగిప్రారంభమైనపుడీ మిగిలియుండిపోయినలోటు తీర్చివేయబడెను.

ఆయుమండలములుగలప్రతిగణములోను అయిదవమండలమే యెప్పుడును ఉత్పత్తిచేయుస్థానముగ నుండుననువిషయము నీసందర్భములో చెప్పుట యసమంజసముగనుండదు, దాని ఉదాహరణగా మనుష్యశరీరమందు ఆత్మ

స్థానమునుండి క్రిందివైపునకు అయిదవచక్రములోనే సంతానోత్పాదకశక్తి యున్నది. అటులనే బ్రహ్మాండములోగూడ నైదవస్థానమైన బ్రహ్మకే ఉత్పత్తి కార్యక్రమము ఒప్పగించబడెను. పిండబ్రహ్మాండదేశములనివాసులలో స్త్రీ భావముయొక్క కార్యములకును, పురుషభావకార్యములకును ప్రత్యక్షమైనభేద ముగలదు. కాని నిర్మలచైతన్యదేశవాసులలో నిదివరలోచెప్పినట్లుగా స్త్రీ పురుషభావములు రెండును ఏకమైపోయి ఈలోకములోనున్నట్టి స్త్రీ పురుష సంబంధమైన క్రియలవంటిక్రియలు అచ్చట కానరావు. నిర్మలచైతన్యదేశము యొక్క అయిదవస్థానమైన సత్యలోకములో, సురత్ ధార శబ్దధారల పరస్పర సమ్మేళనము పరిస్ఫుటరూపమున ప్రకటమాయెను. కావున రచనాక్రమము రెండవసారి ప్రారంభమైనప్పుడు ఈరెండుక్రియాత్మకలక్షణములును వానితో పాటు, రచనావిరామకాలమందు సత్యలోకములో సమ్మిళితమైపోయిన నిమ్నశ్రేణిచేతనతయును రెండు వెవ్వేఱుధారలుగా బహిష్కరింపబడెను. సత్యలోకాధిపతియైనసత్యపురుషునినుండి మొదటబయల్వెడలినధార శబ్దధార యొక్క శాఖయగుటచే, నది సకలవిధాటంకములను త్రోసిపుచ్చగల శక్తి గల్గినదై యుండెను దీనిని కాలపురుషుడు, లేక బ్రహ్మయని పేర్కొందురు. కాని యీధారకు (అనగా కాలపురుషునకు) కేంద్రనిర్మాణశక్తి లేనందున ఆపురుషుడు అనాదిమధ్యదేశముయొక్క (Eternal Neutral Zone) నిమ్నతర ఘట్టములలో సృష్టిని ఒంటరిగాజరుపలేకపోయెను. సత్యపురుషునినుండి ప్రకటమైన రెండవ ధార సురత్ ధారయొక్క శాఖయగుటచే దానికి కేంద్రనిర్మాణశక్తియుండెను. దీనిపేరు ఆద్య. తగినంతచేతనత తమలో లేకుండినట్టి అనగా నిర్మలచైతన్య దేశమునందు నిలిచిపోవుటకు తగినంత నైర్మల్యములేనట్టి, యసంఖ్యా కాత్మాంశలీధారగర్భములో నుండెను. కాలపురుషునిధారయొక్క వర్ణము నిర్మలచైతన్యలోకముల స్వచ్ఛప్రకాశముతో పోల్చినచో దేదీప్యమానసీల వర్ణముగ నుండును. ఆద్య (రెండవధార) యొక్క రంగు కొద్దిగాఆకుపచ్చ రంగుతోగలిసిన పసుపువర్ణముగ నుండును.

## 93. బ్రహ్మాండముయొక్కరచనాసామగ్రియొక్కయు, దానిలోని ఆఱుస్థానములయొక్కయు వర్ణనము.

కాలపురుషునియొక్కయు, ఆద్యయొక్కయు, ధారలు బహిష్కృతమైన తోడనే నిర్మలచైతన్యలోకములో నుండతగని నిమ్నతరశ్రేణిచైతన్యమంతయు

ప్రాప్తిగ సత్యలోకమునుండి యుద్భాసితమైపోయెను. దానితో బ్రహ్మాండదేశరచనకు కావలసిన సామగ్రి యావత్తు చేకూరెను. ఈధారలురెండింటికిని క్రియాక్షేత్రము ఆదిన్యూనాంగధ్రువమునకు (original nether pole) అంటియున్నదేశ మగుటచే, నీధారలరెండిటికి క్రియాశీలత్వము బహిర్ముఖముగా, అనగా, నిర్మలచైతన్యధారాముఖమునకు ప్రతికూలముగా నుండెను. అనగా ఆదిచైతన్యధారయొక్క క్రియాక్షేత్రము విశేషాంగమునకు (positive pole) సమీపముననున్నందున అది విశేషాంగముపైపున కభిముఖమై పనిచేయుచుండెను కాని, కాలునియొక్కయు ఆద్యయొక్కయు క్రియాక్షేత్రము న్యూనాంగధ్రువమునకు దగ్గరగనున్నందున నివి న్యూనాంగముపైపునకు తిరిగియుండెనని తాత్పర్యము. కాలపురుషునియొక్కయు, ఆద్యయొక్కయు క్రియాక్షేత్రమునకు బ్రహ్మాండమని పేరు. బ్రహ్మాండముయొక్కపైకొన, మహాసున్నరచనలో నట్టడుగుభాగమైన అక్షరపురుషస్థానము నంటియున్నది. మహాసున్నలోని అర్ధచైతన్యరచన (sub-spiritual creation) యొక్క అధిపతులలో అక్షరపురుషుడొకరగుటవలన నాయధిపతులందఱితోపాటు అక్షరపురుషునకుకూడ మృత్యురహితుడైనట్లే చెప్పవచ్చును. కావుననే యీయనను అక్షరపురుషుడని పేర్కొందురు. ఈయక్షరపురుషుని స్థానములో కాలపురుషునియొక్కయు ఆద్యయొక్కయుధారలు కొంతవఱకు సమ్మిళితమైన రూపములో వానిప్రథమకేంద్రమును నిర్మించుకొనెను. ఈస్థానములో నీరెండుధారలును వరుసగ "పురుషుడు", "ప్రకృతి" యునని పేర్కొనబడును. అక్షరపురుషుడు నిర్మలచైతన్యదేశముయొక్క కళ అయినందున బ్రహ్మాండమునకు సంబంధించి ఆయనయొక్క పరిస్థితి, శరీరమనస్సులకు సంబంధించి ఆత్మపరిస్థితియెట్టిదో అట్టిదే. అందువలననే, అక్షరపురుషునిలోకమును బ్రహ్మాండమునకు వాస్తవమైన 'యాత్మపద'మని అందురు. ఈపురుషుడు న్యూనాంగముయొక్క "మహాన్ఆత్మ" (గొప్పఆత్మ) కావున, నీయక్షరపురుషునివఱకు జేరుకొన్న అభ్యాసిని "మహాత్మ" (అనగా మహాన్ ఆత్మ అనియే అర్థము) యని పేర్కొందురు. కాలునికిని ఆద్యకును అక్షరపురుషునితో సంయోగముకల్గుటచే నీయిరువురకు నధికప్రాణశక్తి లభించినందున వెంటనే బ్రహ్మాండముయొక్క సృష్టికార్యమము ప్రారంభించబడెను. అనగా నిర్మలచైతన్యస్థానముల సృష్టి జరిగినపద్ధతులప్రకారమే పురుషుడు, ప్రకృతి, అక్షరపురుషుడు ముప్వురినుండియు ధారలు బయల్వెడలి బ్రహ్మాండదేశలోకములను రచింపనారంభించెను.

యను పేరున బరగుచున్నవి. అక్షరపురుషుని నివాసస్థానమునకు క్రిందుగా “మానససరోవరము”ని పేర్కొనబడునట్టి మహావిశాలకేంద్రము అనగా చైతన్యసరోవరమొకటి గలదు. ఇచ్చట ఆధ్యాత్మికాభ్యాసి చేరుకొని యీ చైతన్యసరోవరములో స్నానముచేసినచో, కాలపురుని దేశముమీదుగా (అనగా బ్రహ్మాండమనోదేశము, లేక బ్రహ్మాయొక్క దేశము) అభ్యాసి ప్రయాణముచేయుచుండగా అతనిపైనపడిన సూక్ష్మమాలిన్యమంతయు క్షాళితమైపోవును. ఈమూడుధారలు మొట్టమొదట కలుసుకొన్నస్థానమునకు త్రికుటి అనగా మూడుపర్వతములస్థానమని పేరు. ఈమూడుపర్వతములకును మేరు, సుమేరు, కైలాసము లనిపేర్లు. సత్యలోకమునుండి దిగివచ్చిన కాలుని ధారయు, ఆద్యాధారయు నిచ్చట “బ్రహ్మ”, “మాయ” అను రూపములలో ప్రకటమాయెను. ఈస్థానమునగల ఆదిపదార్థము (అనగా అసలు పదార్థము) స్థూలము అనగా తక్కువచైతన్యవంతముకాబట్టి, రచనాత్మకక్రియాసందర్భములో వేరుచేయబడినపుడు ఈస్థానమునుండి అమితసంఖ్యలో మహాసూక్ష్మపరమాణువులమేఘములు బయల్వెడలెను. ఇచ్చట పరమాణువులనగా మాయభిప్రాయము మానవులకు తెలిసిన పరమాణువులు (atoms) అనిగాని అయనములు (ions) అని గానికాదు. ఆమహాసూక్ష్మపరమాణువులు మానవులకు తెలిసినపరమాణువులు అయనములకన్న అత్యంతసూక్ష్మములు. త్రికుటి చైతన్యములోని న్యూనత సున్నలేక దశమద్వారముయొక్క చైతన్యతతో పోల్చగా బహుప్రస్ఫుటముగనుండుటచే, త్రికుటిస్థానము దర్శనేంద్రియముపైన ఉదయభానునిరక్తిమవర్ణమువంటి ప్రభావమును కలిగించును.

త్రికుటినుండి క్రిందికి ఈమూడుధారలును సమ్మిళితమై వెళ్లినపుడు వీనితోపాటు మాయనుండియు బ్రహ్మనుండియు తలోకధారచొప్పున రెండు ముఖ్యమైనధారలుగూడ ప్రకటమై క్రిందికిదిగెను. ఈరెండుధారలును క్రిందికి దిగి స్థాపించిన తృతీయకేంద్రమునకు సహస్రదళకమలము (వెయ్యిరేకుల కమలము) అనిపేరు. మాయయు, బ్రహ్మయు నిచ్చట జ్యోతినారాయణులరూపమును, అనగానిరంజనరూపమును ధరించిరి.

పైన చెప్పినమూడుధారలును మూడుఉన్నతస్థానములనుండి బయల్వెడలుటచే, వానియుద్ధానస్థానమైనత్రికుటియొక్క ప్రభావము, అవి సహస్రదళకమలము పోవునిమిత్తమై యేర్పడుచుకొన్న మార్గముపైన, పడెను. ఈమార్గ

మును "బంకనాల్" (వంకర సొరంగము లేక వక్రనాళము) అని చెప్పుదురు. ఆధారలుమూడును కలిసి క్రిందకిబయల్దేరినస్థానము మొదలుకొని కొంతదూరమువఱకు, సీమార్గము మొదట పైకివెళ్లి, తరువాత క్రిందికి దిగిపోయెను. ఈమూడుధారలే త్రిగుణములకు సూక్ష్మబీజరూపములని ఈపైన తెలియచేయబోవుచున్నాము. వీనిలో నొకదానియందు ప్రబలసత్త్వాంగమును రెండవదానియందు ఉత్పత్త్యంగమును, మూడవదానియందు సంహారాంగ మును ఉన్నవి. త్రికుటిస్థానములో, ఈమూడుధారలును మాయాబ్రహ్మల నుండి మఱిరెండు ధారలును మొత్తము అయిదుధారలు అండలి మహా సూక్ష్మపరమాణువులను మథనముగావించి, బహుసూక్ష్మమైనట్టి వేవేలు పొరలను ప్రకటముచేసెను. పిమ్మట నీఅయిదు పొరలనుండియే పై 12వ ప్రసం గములోచెప్పిన జడప్రకృతియొక్క పంచమూలతత్త్వావస్థలును ప్రకటమయ్యెను. బ్రహ్మాధారనుండి వెలువడిన యవస్థ ఆకాశతత్త్వమనియు, మాయాధారనుండి వెలువడిన యవస్థ అగ్నితత్త్వమనియు, సత్త్వ, రజస్తమోగుణములనుండి ప్రకటమైనయవస్థలు వరుసగ వాయు, జల, పృథ్వీతత్త్వములనియు, పేర్కొన బడుచున్నవి. రచనాత్మక కార్యక్రమసందర్భములో జరిగిన మార్పులలోత్రికుటి నుండి క్రిందికి త్రోసివేయబడినపొరలు ఈపంచావస్థల ప్రభావమునుకూడ తీసి కొని సహస్రదళకమలములోనికివచ్చి వేవేలుగ పంచమూలతత్త్వములుగ ప్రకట మయ్యెను.ఈతత్త్వములు స్థూలప్రకృతిలోని యుత్పత్తిపరమాణువులైన అయన ముల (ions) కన్నకూడా బహుసూక్ష్మములై శక్తితో పూర్తిగానిండినవై యుండినందున నవి సహస్రదళకమలమునుండి వేవేలురంగులతో ధగధగాయ మానమైనతేజోధారలుగ బయల్వెడలెను. ఆకాశతత్త్వము రంగుశ్యామము గను, అగ్నితత్త్వమురంగు మెఱుపుగను, వాయుతత్త్వమురంగు ఆకుపచ్చగను జలమురంగు తెలుపుగను, పృథ్వీతత్త్వమురంగు పసుపుపచ్చగను ఉండెను.

సహస్రదళకమలమునుండి దిగినతోడనే తిరిగి ఈఅయిదుతత్త్వములకును మథనముజరిగెను. జ్యోతినిరంజనులు, త్రిగుణములును ఒక్కొక్కటే వేలు వేలుగా ఈపంచతత్త్వములకును మథనముచేసి, పంచతత్త్వములకు 25 ఉప భాగములను ప్రకటముచేసెను. ఒక్కొక్కఉపభాగమునకు ఒక్కొక్క ప్రత్యే కాంగము, లేక ప్రత్యేకలక్షణముండెను. ఈ 25 ఉపభాగములను పంచవింశతి ప్రకృతులని పేర్కొనుచున్నారు.

తత్త్వములయొక్కయు, ప్రకృతులయొక్కయు సముదాయములు, పైన చెప్పినవిధమున ఒక ప్రక్కనుండి యేర్పడిపోవుచుండగా, సహస్రదళకమలము యొక్క సృష్టికార్యక్రమము మరొకప్రక్కన అతితీవ్రముగా సాగిపోవుచుం డెను. ఎనిమిది మహాధార లీరచనాకార్యక్రమమును జరిపించుచుండెను. వీనిలో రెండు జ్యోతి నిరంజనులధారలు, తక్కినయాఱును త్రిగుణములకు సంబంధిం చిన ధారలు. త్రిగుణములలో ఒక్కొక్కటి స్త్రీధార, పురుషధారయని రెండేసిచీలికలైనందున, మొత్తము మూడుగుణములనుండియు ఆఱుధారలు ప్రకటమయ్యెను. ఈయెనిమిదిధారలనుబట్టియే సహస్రదళకమలమునకు అష్టదళ కమలమని కూడ నామాంతరమేర్పడెను. ఈయెనమిదిధారలు నొక్కొ క్కటి వేర్వేఱుగ నైదుతత్త్వములపైన తనయాకర్షణశక్తిని ప్రయోగించి అయిదేసిరేకులను సృజించెను. అట్లు ఆపత్రములు (40 పత్రములు) అన్నియు ప్రకటమైనపిమ్మట నవి యొక్కొక్కటి వేర్వేఱుగ 25 ప్రకృతులపైన తన యాకర్షణప్రభావమునుజూపి ఇరువదియైదేసి యుపదళములను (subleaves) నిర్మించెను. ఈప్రకారము ఆయెనిమిదిధారలచుట్టును, ఒకవెయ్యి దళములు నిర్మించబడెను. ఈస్థానమునకు సహస్రదళకమల మనునామకరణము ఈసహస్ర దళముల సంఖ్యనుబట్టియే గలిగెను.

ఈకమలము నిర్మాణమైనపిదప జ్యోతి, నిరంజనులధార లచ్చటనే ఆగి యుండిపోయెను, ఏలననగా సహస్రదళకమలముక్రిందది న్యూనచైతన్యమగుటచే నీధారలశక్తి పనిచేయుటకు ఆన్యూనచైతన్యస్థానము తగియుండలేదు. సహస్ర దళకమలములో నింతవఱకు గుప్తముగానుండిన త్రిగుణములు నిపుడు నారాయ ణునికి పుత్రత్రయముగ ప్రకటమై ఒకరిక్రింద నొకరుగా లోకముల నేర్పాటుచేసి కొని ఆలోకములకు వేర్వేఱుగా అధిపతులైరి. ఈయధిపతులకు విష్ణువు,బ్రహ్మ శివుడు అని పేర్లు. వారిలోకములుకూడ నాపేర్ల క్రమములోనేయున్నవి. ఈముల్లో కములనిర్మాణముతో బ్రహ్మాండములోని ఆఱు ఉపభాగములును పూర్తి యయ్యెను. ఈబ్రహ్మాండ దేశము 91వ పరిసంగములోనుదహరించిన ప్రకారము మధ్యదేశము (Neutral Zone)యొక్క క్రిందిభాగములో నిర్మితమైనది. బ్రహ్మాం డదేశముయొక్క సామగ్రినిగుఱించియు, దాని ఆఱుస్థానముల రచననుగుఱిం చియు,నింతవఱకు ముచ్చటించితిమి. ఇకముందీలోకములచేతనతనుగుఱించియు, నిచ్చట నివసించునాత్మలనుగుఱించియు నించుక చెప్పెదము.

## 94. బ్రహ్మాండముయొక్క చేతనత.

బ్రహ్మాండమునకు శిఖరస్థానమైన సున్నలోకము మొదలుకొని దానిక్రింద స్థానముగు త్రికుటివఱకునుగల చేతనత, సున్నలోకముపైనున్న లోకముల చేతనతతో నించుమించుపోటీచేయగల్గినంత యుత్తమతరగతికి చెందియున్నది. కాని త్రికుటికి క్రింద, సూక్ష్మప్రకృతి అనగా మాయకూడా చైతన్యముతో కలియుటచే, దాని నిర్మలత్వము తగ్గిపోయెను. అందువలననే త్రికుటిక్రిందనున్న చైతన్యమును ప్రాణమనియుందురు. కాని ఇచ్చటప్రాణమనగా వాయుతత్త్వమని మాయర్థముకాదు. సున్నస్థానమునుండి బయల్వెడలిన మూడుధారలును (93వ ప్రసంగము చూడుడు) బంకనాళ్ (వక్రనాళము) చివరకొననుండి దిగువకు పోయినపుడు ఇడ, పింగళ, సుషుమ్నయనెడి మూడుసూక్ష్మధారలుగా చీలిపోయెను. ఆ మూడిటిలో మధ్యన సుషుమ్నమార్గమును, ఎడమవైపునఇడయు, కుడివైపున పింగళయునున్నవి. ఈమూడుధారలమూలముననే బ్రహ్మాండములోని క్రిందిభాగమునకు చేతనత లభించుచున్నది. సున్నలోకమునుండి బయల్వెడలిన మూడుచైతన్యధారలును నిర్మలచైతన్యదేశములోని గోళముల నించుమించు పోలియున్న మహాప్రకాశగోళములను గూడనిర్మించినవి. ఈధారలు వేర్వేఱుగ మూడుస్థానములనుండి బయల్వెడలినందున నిచ్చటనవి రెండురకములకుబదులు మూడురకములగోళములను నిర్మించినవి. వీనిలో రెండు రకములు సూర్యచంద్రులనుబోలినలక్షణములుగలవి. (89వ ప్రసంగములో వీనినిగుఱించి యుదహరించబడినది) మూడవరకముపేరు "తారాగణము". ఈతారాగణము మనము రోజు నాకాశములోచూచుచున్న నక్షత్రములవంటివి కావు. మన కాకసమున ప్రతిదినము కనబడుచున్నట్టి నక్షత్రములు నిజముగ సూర్యచంద్రులే. మేము పైనజెప్పిన తారాగణముయొక్క లక్షణములు గ్రహములయొక్క ప్రత్యేకలక్షణములను పోలియున్నవి.

## 95. సున్నలోకవాసుల వర్ణనము.

నిర్మలచైతన్యదేశములోని యధిపతులును నివాసులును మాత్రమేగాక ఆదేశమంతయు చైతన్యవంతమేఅయినందున, ఆదేశపుపదార్థముతో నేర్పడిన శరీరములలో బాహ్యమండలములనుగుఱించి జ్ఞానప్రాప్తినిమిత్తమై ఒకప్రత్యేకమైన యేర్పాటేమియు నక్కఱలేకుండా, ఆవనిని ఆశరీరములే నెఱవేర్చుచున్నవి. ఆశరీరములే వానిలోనున్న యాత్మలకు నలువైపులనున్న సృష్టినిగుఱించి

సంపూర్ణజ్ఞానమును కలుగజేయుగల్గుచున్నవి. బ్రహ్మాండశిఖరస్థానమైన సున్న లోకములోని నివాసుల పరిస్థితిగూడ నించుమించు అట్లేయున్నది. కావుననే వారినిగూడ "హంసలు" అని పేర్కొందురు. అయినను వారిలో లింగభేదము అనగా స్త్రీ పురుష భేదము కొంతవఱకు ప్రకటమైయున్నది. కాని వారిలో స్త్రీ పురుషులవంటి ప్రవర్తన యెంతమాత్రములేదు. స్త్రీత్వలక్షణములు ప్రధానముగనున్నవారిని హంసినీలనియు, పురుషలక్షణములు ప్రధానముగ నున్నవారిని హంసలనియు చెప్పుదురు.

## 96. త్రికుటిమున్నగులోకములలోని నివాసులును, తన్మాత్రలును.

త్రికుటినుండి బహిష్కృతమైన పరమాణురూపమైనపదార్థము (93 వ ప్రసంగము చూడుడు) అత్యంతసూక్ష్మము, నిర్మలము, బహుశక్తివంతమునై యున్నను, దానిలో జ్ఞానశక్తి శూన్యముగనుండుటచే ఆపదార్థముతో నిర్మించ బడినశరీరములకు స్వాయముగా బాహ్యసృష్టిజ్ఞానము స్వీకరించగల శక్తిసమర్థ తలులేకుండెను. అందుచే త్రికుటినివాసులకును, అంతకన్న క్రిందిలోకముల నివా సులకును తమచుట్టునున్న సృష్టితోసంబంధమేర్పరచుకొని, ఆసృష్టినిగుఱించిన జ్ఞానమును స్వీకరించగల్గుటకై ద్వారములుగనుండునిమిత్తమై పంచజ్ఞానేంద్రి యములు త్రికుటిలో నతిసూక్ష్మరూపమున నిర్మించబడెను. జ్ఞానేంద్రియముల నిర్మాణమునిమిత్తమై ప్రతిజీవునికిని తన్మాత్రలనుపేరుగల మహాసూక్ష్మతమ ములైన పరమాణువులు చేర్చబడి, అవే ప్రతి జీవునికి, అతనిలోకములోని పంచ విధపదార్థములజ్ఞానమును సంపాదించుటకు సాధనమగుచున్నవి,

## 97. తత్త్వములతన్మాత్రలు, రూపములయుత్పత్తి, ఇంద్రియధర్మములు.

ఆకాశతత్త్వముయొక్కతన్మాత్ర శ్రవణేంద్రియములోను. తక్కిన నాలుగుతత్వములు, అనగా, అగ్ని, వాయు. జల, పృథ్వీతత్త్వములతన్మాత్రలు వరుసగ దర్శన. ఘ్రాణ, రసనా, స్పర్శేంద్రియములలోను ఉంచబడినవి. ఆకాశతత్వము జడపదార్థముయొక్క సూక్ష్మతమావస్థయై, శక్తితో పూర్తిగ నిండియున్నదికావున, శ్రవణశక్తిని శక్తిజ్ఞానమునుపొందగలశక్తిగా యెంచుట అసమంజసముకానేరదు, ఏశక్తియైనను ఆకాశతత్త్వఘట్టముమీదికి దిగిన తోడనే దానినిగుఱించినజ్ఞానము జీవునికి శబ్దరూపమున గల్గును. పైన "శక్తి

జ్ఞానమనగా మా అభిప్రాయము శక్తియొక్క క్రియాత్మకమైనధారారూపము యొక్క యనుభవమనియే కాని, ఆధారారూపముమూలమున తరువాతగలిగెడి పరిణామములజ్ఞానమని కాదు. శక్తి ధారారూపమున ప్రవహించుటచే ఒక కేంద్రము స్థాపించబడి అంతవఱకు క్రమహీనముగ చెదిరిపడియున్న ప్రకృతిపదార్థరేణువులు లేక, పరమాణువులు అప్పుడు క్రమబద్ధములు కానారంభించి రూపములేర్పడును. ఆకాశతత్త్వపరమాణువు లివ్విధమున క్రమబద్ధముచేయబడజాలవు కావున నాకాశమును, రూపహీనమనియు, రూపవంతమగుటకసర్వమనియు నెంచుదురు. కాని, యీయభిప్రాయమును కొంతమార్చుకొనవలసియున్నది. మేము 93 వ. ప్రసంగములో ఆకాశము, త్రికుటిరచనాసమయములో నచ్చటి (మహాసూక్ష్మ పరమాణురూపమైన) పదార్థముయొక్క సూక్ష్మమైనపొరగా వేఱుగా ప్రకటమైనదనియు, అందువలన త్రికుటికిక్రిందుగా ఆకాశముయొక్క ప్రత్యేక మండలమొకటి యేర్పడెననియుచెప్పియుంటిమి. కావున (మండలాకారమైన) ఈమండలమునుబట్టిచూచినచో ఆకాశమును సముదాయరూపేణా (as a whole) రూపహీనమని చెప్పుటకువీలు లేదు. సృష్టియేర్పాట్లప్రకారము ఆకాశతత్త్వమునకు ప్రయోజనము ఉత్తమతరగతిశక్తులకు వాహనముగ పనిచేయుటయే. అనగా, ఉన్నతతరగతిశక్తులు ఆకాశతత్త్వముమీదుగనే క్రిందిస్థానములకు దిగివచ్చుచుండును. ఆకాశతత్త్వము కాక మిగిలినతత్త్వములన్నిటిలో ప్రకృతియొక్క సూక్ష్మతమావస్థ అగ్నియే. అగ్నితత్త్వముయొక్క పరమాణువులవలన రూపముత్పన్నమైనది. అనగా శక్తి ఆకాశతత్త్వముద్వారా క్రిందికిదిగివచ్చి (దానికి ఆకాశముతో పరిపూర్ణసంబంధముండియుకూడా, ఆకాశముమీద నెట్టిప్రభావము చూపకుండా) అగ్నితత్త్వముయొక్క పరమాణువులను క్రమపఱచుచు (అనగా, రూపములనేర్పఱచి, ఆకాశతత్త్వముద్వారా నలువైపులవ్యాపించుచున్న కాంతి ధారలమూలమున దానిని (అనగా, క్రమబద్ధమైనఅగ్నిపరమాణువులరూపమును) దర్శనేంద్రియమువఱకు చేర్చి మనకు రూపజ్ఞానము కలుగజేయుచున్నది. కాంతిధారలద్వారా రూపము దర్శనేంద్రియమువఱకు జేరుకొనుకార్యక్రమము, నీరు ఆవిరిరూపమున గాలిద్వారా ఒకచోటునుండి మఱియొకచోటునకు జేరుకొనువిధముననే ఇంచుమించు జరుగుచున్నది, కాంతిలోనుండి ఆకాశతత్త్వము కాక తక్కినతత్త్వములనన్నింటిని తొలగించినచో నీపిండదేశములోని విద్యుచ్ఛక్తియొకటే శేషించును. కాని ఆవిద్యుచ్ఛక్తిని నేత్రములతో చూచుట యసాధ్యము, అయితే ఆత్మమేల్కొన్నపుడు దాని తేజస్సుయొక్క అనుభవమును

పొందవచ్చును. మన కీ సృష్టిలో కనబడుచున్నట్టి సూర్యులు, నక్షత్రములు, మెఱుపులు మొదలగువానివ్రికాశములన్నిటిలోను ఆకాశతత్త్వముయొక్క సూక్ష్మపరమాణువులు (ions) ఒక్కటేగాక తక్కినరకములైనపరమాణువులు గూడ పూటుగనిండియున్నవి. ఆయితరవిధములైన పరమాణువులమూలముననే (ఈపరమాణువులనగా 11. వ. ప్రసంగములో చెప్పిన ప్రకారము విభక్తదశను పొందిన సాధారణ పరమాణువులే) వీనిప్రకాశములలో పరస్పరభేదము లేర్పడుచున్నవి. దీనినిబట్టి దర్శనేంద్రియముకంటె, శ్రవణేంద్రియము ఎక్కువ సూక్ష్మమైనదనియు, శబ్దములన్నిటికిని రూపములతో గుప్తవిధమున (అవ్యక్త రూపమున) సంబంధమున్నదనియు తేటపడుచున్నది. వాయుతత్త్వము, అగ్ని తత్త్వముకన్న క్రిందితరగతికి చెందును. పదార్థము వాయువ్యావస్థలో ప్రవేశించి నపుడు దానిజ్ఞానము నాసికేంద్రియముద్వారా కలుగును.

98. కొన్నివాయువులు గంధరహితములుగను, కొన్నివస్తువులు రుచిహీనములుగను ఉండుటకు కారణమేమి?

ఇపుడు ప్రస్తుతవిషయమునుండి కొద్దిగామళ్ళి, కొన్నివాయువులు గంధరహితముగనుండుటకును, కొన్నిపదార్థములు రుచిలేకుండుటకును కారణములను విశదపర్చెదము. ఒక్కొక్కయింద్రియములో నొక్కొక్కతత్త్వము యొక్క తన్మాత్రచొప్పున పంచతత్త్వములతన్మాత్రలును పంచజ్ఞానేంద్రియములలో నంతర్గతముగనున్నవని ఇంతకుముందు చెప్పియుంటిమి. ఈతన్మాత్రలయొక్కయు, వానికి సంబంధించినతత్త్వములయొక్కయు ఘట్టము లొక్కటే కావున నేతత్త్వములోనైనను బాహ్యమునుండి ఒకవిధమైన కలత గలుగనిచో నాతత్త్వముయొక్క తన్మాత్రకుసంబంధించిన జ్ఞానేంద్రియముపైన, నా తత్త్వము తనంతటతానే యెట్టిప్రభావమునుగల్గించ నేరదు. అందువలననే వాయుతత్త్వము తనంతటతానుగా మననాసికేంద్రియముమీద నెట్టిప్రభావమును చూపజాలకున్నది. అటులనే వాయుతత్త్వముతో సమానసూక్ష్మతగల మఱి కొన్నివాయువులుగూడ మననాసికేంద్రియముపైన నెట్టిప్రభావమును కలుగ జేయలేకున్నవి. పై 97 వ, ప్రసంగములో పంచతత్త్వములును పరమాణువుల యొక్క అయిదువేర్వేఱువిధములైనకూర్పులనియు ('groupings) మన కండ్లకు స్థూలరూపములో కనబడునట్టి అగ్ని, జల, వాయ్వాదులే పంచతత్త్వములు కావనియు చెప్పియుంటిమి. కాబట్టి కేవలము వాయుతత్త్వమునకు (ఇదివరమాణు

వులయొక్క ఒకప్రత్యేకవిధమైన కూర్పు) ఎట్లు మన నాసికేంద్రియముపైనప్రభావము ఉండజాలదో, అటులనే, మిగిలిన తత్త్వములనుగూడ (అవి పరమాణువులయొక్క ఇతరవిధములైన కూర్పులు) వాని వానికి సంబంధించిన జ్ఞానేంద్రియములమీద స్వతహాగా ప్రభావమేమియు నుండ నేరదు.

ఈవిషయమును ఇంక నెక్కువగా విశదపర్చుటకై ఇచ్చట నొక ఉదాహరణనిచ్చెదము. ఉష్ణతావస్థను, లేక తాపావస్థను పొందిన పరమాణువులు ఆకాశతత్త్వములో క్రియాశీలమైయున్న శక్తితో సంబంధమేర్పఱచుకొనగల్గు నంత అధికసూక్ష్మతను పొందనంతకాలము ఆయుష్ణత తనప్రభావమును మనత్వగింద్రియముమీదమాత్రమే గలుగజేయునుగాని, మనదర్శనేంద్రియమునకు ప్రకాశరూపమున కానరాదు. కాని తాపావస్థకు (అనగా, తాపావస్థపరమాణువులకు) పైనచెప్పినంత అధికమైన సూక్ష్మతవచ్చినతోడనే మనదర్శనేంద్రియములోనున్న అగ్నితత్వతన్మాత్రమీద దానిప్రభావముగలిగి మనకు ఆప్రకాశజ్ఞానము గలుగనారంభించును. అనగా సంక్షిప్తముగా చెప్పవలెనన్నచో పంచతత్వములలో వానివానిసూక్ష్మఘట్టములపైన ప్రభావముగల్గునంత యెక్కువగ సంచలనముగలిగినపుడు ఏమానవుడు (అనగా జ్ఞాత) ఆసంచలనావరణములో నాసమయమున నుండునో అట్టిమానవునకు (జ్ఞాతకు) ఆసంచలనము జ్ఞానేంద్రియముల ద్వారా శబ్ద, ప్రకాశ, గంధ, రస (అనగా రుచి) స్పర్శరూపములలో నేదోయొకరూపమున గోచరమగును. శక్తివలన గలుగజేయబడినట్టి ఒకే సంచలనము అనేకజ్ఞానేంద్రియములమీదకూడా ప్రభావము లటుచు కలుగజేయుచుండును. అందుచే అట్లు ప్రభావితములైన అనేకేంద్రియముల కొకేసమయమున విషయజ్ఞానము కలుగుట తటస్థించును. ఎట్లనగా, తుపాకిమందు దెచ్చటనైన పేలినయెడల దానిప్రభావము మనశ్రవణ, దర్శనేంద్రియములమీదను అప్పుడవుడు మననాసికేంద్రియముమీదనుగూడ గలుగుచుండును. పైపైనచూడగా, శ్రవణేంద్రియము, దర్శనేంద్రియముకన్న మోటైనదిగా తోచవచ్చును. కాని యిది సరికాదు. దీనికిముందు ప్రసంగములో నిదర్శనములను చూపెదము.

## 99. శ్రవణేంద్రియము దర్శనేంద్రియముకన్న నెక్కువ సూక్ష్మమైనది.

శక్తి క్రియారూపముగా మాఱి, ఆక్రియ మనశ్రవణసాధనమైన చెవి

శ్రవణసాధనము ఘనద్రవపదార్థములతోను కొద్దిగా వాయువ్యపదార్థముతోను తయారైనట్లు మనకు తెలుసును కనుక, ఆ ఘన ద్రవ వాయువ్య ప్రకృతుల ఘట్టముమీద సంచలనము గల్గించగల్గినశక్తియే మనశ్రవణేంద్రియముపైనకూడా ప్రభావము కలుగచేయగలదు. కాని పైనచెప్పినదంతయు, శ్రవణేంద్రియము యొక్క స్థూలఘట్టములతో మాత్రమే శక్తికి సంబంధ మేర్పడినపరిస్థితిలో వర్తించును. కాని, శక్తులన్నిటికిని, కార్యరూపములో స్థూలఘట్టములమీద కనపడు స్వరూపములుగాక, నంతకన్న సూక్ష్మరూపములు గూడ కలవు. శక్తి యొక్క యీసూక్ష్మరూపమే మనకు శబ్దముగా గోచరమగుచున్నదని క్రింద చెప్పబోవు విషయములనుబట్టి విశదపడగలదు.

మనశారీరికశక్తులన్నియు పుట్టినదిమొదలు నిరంతరము వానినలవర్చుకొనుచుండుటవలననే మేల్కాంచుచున్నవనియు, మన మానసికజ్ఞానము లేక విద్యాజ్ఞానము కూడా మనశరీరముద్వారా గ్రహించినఛాయలు లేక సంస్కారములమూలముననే చేకూరుచున్నదనియు, 8వ ప్రసంగములో చెప్పియుంటిమి. కావున సంస్కారములను గ్రహించునట్టి సూక్ష్మసాధనములగు తన్మాత్రలు, ఆసంస్కారములను తమవద్దకుజేర్పించుకొనుటకు, పూర్తిగ శరీరముపైననే ఆధారపడియున్నవని యిందువలన స్పష్టమగును. అందుచే మొట్టమొదట నేదైనసంస్కారము శరీరముమీదపడినపుడే, అందుకుసంబంధించిన తన్మాత్రలో సంచలనముగలిగి ఆసంచలనము జరిగినపుడే ఆసంస్కారముయొక్క జ్ఞానము తత్సంబంధమైన జ్ఞానేంద్రియమునకు గలుగుచున్నది. దీనినిబట్టి శక్తిప్రభావము మనశ్రవణేంద్రియసంబంధమైన శారీరికపదార్థముపైన గలుగువఱకును తత్సంబంధజ్ఞానము మనశ్రవణేంద్రియమున కెంతమాత్రము గలుగ నేరదని వర్యవసానము తేలుచున్నది. ఏలననగా, ఇంతకుముందే చెప్పినట్లు, ఏదైనశక్తి ప్రభావము మనశరీరముద్వారా మనశ్రవణశక్తివఱకు చేరుకొన్నపుడే కదా మనశ్రవణశక్తికూడ క్రియాశీలముకాగల్గుట. శక్తి శ్రవణేంద్రియమునకు స్థూలసాధనమైన చెవివఱకును జేరుకొనినపుడు, ఆశక్తి అచ్చటినుండి (అనగా శ్రవణేంద్రియస్థూలఘట్టము నుండి) తాఱుమాఱుగా కార్యక్రమము ప్రారంభించి సూక్ష్మరూపములో నాయింద్రియతన్మాత్రలో ప్రవేశించును. శక్తి యెట్టి సూక్ష్మరూపముతో తన్మాత్రలోప్రవేశించునో యీక్రింద చెప్పెదము.

మనము మనస్థూలకర్ణేంద్రియముపైన ప్రభావముగలుగజేసెడి శక్తిని మాత్రమే శబ్దరూపమున వినగల్గుటకు సాధ్యమగునని పైనచెప్పియుంటిమి.

ఈ స్థూలకర్ణేంద్రియసామగ్రియంతయు ఘన, ద్రవ, వాయవ్యపదార్థములతో తయారైనదికనుకను, ఈపదార్థములన్నియు భూమధ్యాకర్షణశక్తిపరిభావము మూలముననే తమతమయవస్థావిశేషములలో నిలబెట్టబడుచున్నవి గనుకను, స్థూలకర్ణేంద్రియముపైన పరిభావము కల్గించుప్రతిశక్తియు వాస్తవములో భూమధ్యాకర్షణశక్తిపైన పరిభావముకలుగజేయుచున్నట్లే చెప్పవలయును. కావున పైనచెప్పినస్థూలప్రకృతిఘట్టములలో (ఘన, ద్రవ, వాయవ్యపదార్థములలో) దేనిపైననైనను శక్తితరంగములువడినచో ఆశక్తితరంగక్రియకు భూమధ్యాకర్షణశక్తి ప్రతిక్రియచేయుట ప్రారంభించి, ఆ ప్రతిక్రియ, మొదటిక్రియ (అనగా ఆశక్తితరంగములక్రియ) తోపాటు నలుదెసల వ్యాపించును. శక్తి యొక్క సూక్ష్మరూపమనగా,భూమధ్యాకర్షణశక్తియొక్క యీప్రతిక్రియఅనియే మాయభిప్రాయము.

మఱికొంచెముగాఢముగా ఆలోచించినచో, పృథివియొక్క మధ్యాకర్షణశక్తికికారణము భూమిమీద సూర్యునియొక్క ఆకర్షణయే అని బోధపడగలదు. సూర్యునియొక్క ఈఆకర్షణము ఇంచుమించు సూదంటురాయి ఆకర్షణశక్తిని పోలియుండి, భూమికి సూర్యునకుమధ్యనున్న ఆకాశముద్వారా ప్రకటమగుచున్నది. కావున ఆకాశతత్త్వములో మధ్యాకర్షణరూపమున పనిచేయుచున్న శక్తియే మనకు నిరంతరము శబ్దజ్ఞానము కలుగజేయుచున్న సూక్ష్మశక్తియని బోధపడుచున్నది. శక్తితరంగములు పంచజ్ఞానేంద్రియములకు సంబంధించిన స్థూలఘట్టములమీద సంచలనముకలుగ జేసినపుడే వానిపరిభావము జ్ఞానేంద్రియములపై పడుననియు, లేనిచో జ్ఞానేంద్రియములకు వానినిగుఱించిన జ్ఞానమేమియు గలుగనేరదనియు, పైన చెప్పినవిషయములన్నిటినిబట్టి సిద్ధాంతీకరించుకొనుట యసమంజసముకానేరదు. కాని రాధాస్వామీమతసాధనలను ఎవరైన నభ్యాసముచేసి, తనఆత్మశక్తులను స్థూలఘట్టములకు బదులు ఉన్నతఘట్టములులేక చక్రములలో ప్రబోధముచేసికొన్న యెడల, అతని జ్ఞానేంద్రియ తన్మాత్రలు సంస్కారములనుగ్రహించుకొనునిమిత్తము, స్థూలశరీరముపైన నాధారపడనక్కఱలేకుండానే, ఈప్రపంచములో నిరంతరప్రవాహముగాప్రసరించుచున్నట్టి వివిధతరహాలైన సూక్ష్మతరంగములన్నిటిని గుఱించిన జ్ఞానమును పొందుచుండును. మానవునిలో నున్నతఘట్టములకు సంబంధించిన యసాధార

మేల్కొలుచును. శ్రవణేంద్రియము సామాన్యముగ నందఱు అనుకొన్నంత స్థూల మైనది కానట్లు యిప్పటికి తగినంతగా విశదమైనదని భావించుచున్నాము.

## 100. బ్రహ్మాండమునందు జ్ఞానేంద్రియములు తయారగుట.

పై ప్రసంగములలో జ్ఞానేంద్రియముల స్వరూపమును, వాని కార్యములను గుఱించి చేసిన విమర్శయంతయు మానవుని స్థూలఘట్టమును బట్టియే చేసితిమి. అట్లు చేయుటచే సామాన్యముగా అనుభవములోనున్న విషయముల నుదాహరణగా చెప్పుటకు వీలుగానుండుననునుద్దేశ్యముతో నట్లు చేయబడినది. అయినను ఈ విమర్శయంతయు, తగుమార్పులతో బ్రహ్మాండనివాసుల సూక్ష్మజ్ఞానేంద్రియములకుగూడ వర్తించును. త్రికుటిలోకనివాసుల ప్రకాశమానశరీరములలోని జ్ఞానేంద్రియములు అతికష్టముమీఁదపోల్చగల్గునంత మహాసూక్ష్మములై గుప్తముగనుండును. సహస్రదళకమలములో జ్ఞానేంద్రియము లంతకన్న నెక్కువ స్ఫుటముగను, దానిక్రింది స్థానములలో ఇంకను మఱింత యెక్కువ ప్రస్ఫుటముగను ఉండును.

## 101. బ్రహ్మాండ దేశముక్రిందనున్న మైదానముయొక్క వర్ణన, పిండ బ్రహ్మాండముల పరిభ్రమణముయొక్క వర్ణన.

విష్ణు, బ్రహ్మ, శివులస్థానములకు క్రింద మహాసున్నవంటి పెద్ద మైదానమొకటి కలదు. కాని దానివైశాల్యము మహాసున్నకంటె చాల తక్కువ. కొంతతక్కువరకమైన సృష్టికూడ నీమైదానములో కలదు. ద్వితీయ, తృతీయ మహాఖండములమధ్య నిది సరిహద్దుగ నున్నది. ఈ సరిహద్దులో నట్టనడుగు భాగమునందు తృతీయమహాఖండమగు పిండ దేశముయొక్క శిఖరస్థానమున్నది. ఆశిఖరస్థానములో, బ్రహ్మాండ దేశములో ప్రవేశించుటకుపయోగపడునట్టి రంధ్ర మొకటి కలదు. దానిని తృతీయ నేత్రమనియు, దివ్యచక్షువనియు, తీసరా తిల్ అనియు పేర్కొందురు. బ్రహ్మాండ దేశములోని క్రిందిభాగమును, ఈరంధ్రము గుండా దూరమునుండి దర్శనము చేసికొనవచ్చును. సురత్, అనగా, జీవాత్మ పిండ దేశమునుండి బ్రహ్మాండ దేశము వెళ్ళుటకిది యొకసింహద్వారము వంటిది. పిండ దేశశిఖరస్థానము, బ్రహ్మాండశిఖరస్థానమగు సున్నలోకమును పోలియున్నది. దీనినే పిండ దేశముయొక్క చంద్రలోకమందురు. పిండ దేశములో దీని క్రింది

లోకములన్నిటికి నిదియే చైతన్యమునిచ్చును. ఈలోకము సూర్యలోకమునకు పైనున్నది. ఈరెండులోకములును బ్రహ్మాండ దేశముయొక్క అట్టడుగుభాగము చుట్టును పరిభ్రమణచేయుచున్నవి, అనగా, తిరుగుచున్నవి. బ్రహ్మాండ దేశమంతయు నిదేవిధమున నిర్మలచైతన్యదేశముచుట్టును పరిక్రమసల్పుచున్నది, కాని ఇట్టిభ్రమణము నిర్మలచైతన్యదేశమునకును, అందలి మండలములకు నెంత మాత్రము లేదు. ఇట్లు తప్పనిసరిగా పరిభ్రమణము చేయువలసిన యీరెండు మహా ఖండములుమాత్రమే యుక్తసమయమువచ్చినపుడు నాశనమునొందవలసినవై యున్నవను విషయము ముందు తెలుపబోయెదము, నిర్మలచైతన్యదేశమునందెట్టిక్షయవికారములుకాని మృత్యువుకాని లేదు. అందుచే నాదేశము నాశరహితమైనది. పైన పిండబ్రహ్మాండములనుగురించి చెప్పినదంతయు మనసూర్యమండల మేపిండదేశములో నున్నదో ఆపిండదేశమునకును దానికి సంబంధించిన బ్రహ్మాండమునకునుమాత్రమే వర్తించును మొత్తము విశ్వసృష్టిలో ఇటువంటి పిండబ్రహ్మాండములు అసంఖ్యాకముగనున్నవి. ఏలననగా, సత్యలోకమునుండి బయల్వెడలి మహాసున్నమైదానములోనికిదిగిన కాలునియొక్కయు, ఆద్యయొక్కయుధారలవలన నసంఖ్యాకములైనబ్రహ్మాండీమనస్సులు ( అనగా బ్రహ్మలును) వారల అర్ధాంగినులు (అనగా ఆద్యలును) అసంఖ్యాకమైన బ్రహ్మాండమండలాధిపతులును, సముద్రమునుండి నీటిబొట్లవలెనే, బహిర్గతమైనవి. తృతీయమహాఖండమైన పిండదేశములో మనకగుపడుచున్న యసంఖ్యాక సూర్యమండలములుగూడ, నటులనే వివిధబ్రహ్మాండములలో నొక్కొక్క బ్రహ్మాండమునుండియు ప్రకటమైనవి.

## 102. గుణములుప్రకృతులయొక్క సమ్మేళనము,చౌరాసీధారల ఆవిర్భావమును.

గుణములుమూడును క్రిందికిదిగివచ్చినపుడు అవి త్రోవలో 93. వ. ప్రసంగములో చెప్పిన యిరువదియైదుప్రకృతులతో సమ్మేళనమగుటయేగాక, తమలోతాముకూడా పరస్పరముసమ్మిళితమైపోయెను. ఈవిధముగా తొమ్మిది (కేవల) గుణధారలును 75 ప్రకృతిధారలును కలిసి, మొత్తము 84 మిశ్రమ ధారలుగా యేర్పడి పిండదేశమునకు దిగినవి. ఈ 84 సూక్ష్మధారలనే చౌరాసీలక్ష[1] (అనగాచతురశీతిలక్ష్యలేక సూక్ష్మచతురశీతియని అర్థము.)

1. లక్ష- అనగా లక్ష్య అనుసంస్కృతపదమునకు హిందీరూపాంతరము. ఇచ్చట లక్షఅనగా "సూక్ష్మ" మనిఅర్థము.

అనియందురు. పిండదేశములోని చేతనాచేతనరూపమైన యావత్తుసృష్టిలోని శరీరములను తయారుచేయుసామగ్రియు, యీ సృష్టిలోని శక్తులన్నియును ఈయెనుబదినాల్గుసూక్ష్మధారలనుండియే లభించినవి.ప్రకృతిధారలు 75ను ఇచ్చట మూలపదార్థముల (elements) రూపములో ప్రకటమైనవి. ఏలననగా, ఒక్కొక్కమూలపదార్థము (element) మూలతత్త్వములలో (అనగాభూమి, జల, అగ్ని, వాయు, ఆకాశములు) నేయేతత్త్వములసామగ్రితో నిర్మితమయ్యెనో ఆప్రత్యేకమూలతత్త్వమునుబట్టియు, ఆప్రత్యేకమూలతత్త్వముపైన నేయేశక్తులు ప్రభావముచూపినవో ఆప్రత్యేకశక్తులనుబట్టియు, ఆయా మూలపదార్థములలో వెవ్వేఱులక్షణములు ఏర్పడినవి.

## 103. పిండదేశములో చతుర్విధయోనుల సృష్టి.

ఆకాశతత్త్వముయొక్క ముఖ్యోపయోగము అది శక్తిధారలకు వాహనముగపనిచేయుటయే అనియు,నాకాశతత్త్వము అదికాకుండా మఱేయే ధర్మములను నెఱవేర్చుచున్నదో తెలియదనియు 97 వ. ప్రసంగములో చెప్పియుంటిమి. మిగిలిననాల్గుతత్త్వములును జీవుల స్థూల సూక్ష్మశరీర నిర్మాణమునకవసరమైనసామగ్రిని అందజేయుచున్నవి. బ్రహ్మాండదేశములోని అయిదు తత్త్వమండలములకుక్రిందనున్నరచనాభాగములోని చేతనాచేతనాత్మకసృష్టియంతయు, జరాయుజములు, అండజములు, స్వేదజములు, ఉద్భిజములును అను నాల్గురాసులుగా విభజితమైయున్నది. మొదటిమూడు రాసులలోను జంతువులుమాత్రమే యున్నవి. ధాతువులును, భూమినుండి యుద్భవించునట్టిపదార్థములన్నియును నాల్గవరాశిలోజేరును. జరాయుజరాశికి చెందినశరీరములలో అగ్నితత్త్వము ప్రధానముగనున్నది.మిగిలినమూడురాసుల శరీరములలోను వరుసగ వాయు, జల, పృథ్వితత్త్వములు ప్రధానములై యున్నవి. ఈనాల్గురాసులనామములకును శబ్దార్థములు:- (1) జరాయుజ అనగా జరాయువు లేక మావినుండి పుట్టినవి. (2) అండజ, గ్రుడ్లనుండిపుట్టినవి. (3) స్వేదజ- స్వేదము అనగా జలమునుండి పుట్టినవి. (4) ఉద్భిజ-భూమిని బ్రద్దలుచేసికొని పుట్టినవి. పిండదేశములో సృజింపబడిన సూర్యులయొక్కయు తారాగణములయొక్కయు ప్రధానకార్యము శరీరములనిర్మాణమే (ఉత్తమ తరగతిజీవులలోనుండెడి బోధనాత్మకధర్మము, అనగా జ్ఞానస్వీకరణాత్మక ధర్మము అనునది వేఱువిషయము) ఆప్రకారముచూడగా సూర్యులు తారా

గణములలోని సామగ్రి మననాడి కేంద్రములలోనున్న, సామగ్రివంటిదే అయి యున్నది. మనశరీరములోనినాడులు శరీరమంతకు నెట్లు శక్తిసామర్థ్యముల నందజేయుచున్నవో అట్లే యీతారలు సూర్యులును తమతమకుటుంబముల లోని మండలములకు జీవులకును, శక్తిసామర్థ్యములనందజేయుచు జీవనాధార ములైయున్నవి. ఈలోకములయొక్క అధిపతులు లేక అధిష్ఠానదేవతలు ఆయా లోకముల స్థూలపదార్థములోనుండక, ఆలోకములతోకూడనున్న సూక్ష్మమండ లములలో నివసించుదురు. మనుష్యశరీరములోని నాడీకేంద్రములు తమకుసంబం ధించిన గుప్తచైతన్యఘట్టములకు (అనగాచక్రములకు) ఎట్లువశమైయుండునో, అట్లే యీలోకములుకూడా తమతమయధిష్ఠానదేవతల కధీనమైయుండును. పిండదేశముయొక్క అట్టడుగులోకములలో చైతన్యము చాలహీనమై యున్నందున, ఆలోకములలోని రచనాత్మకకార్యము వనస్పతియోనులసృష్టి కార్యమునుపోలి యుండును.

## 104. పిండదేశములోని ఆఱుస్థానములు, వానియధిపతులు.

ఇంతక్రితముదహరించిన తొమ్మిదినాల్గు లక్ష్యధారలుకాక జ్యోతినిరంజ నులధారలకూడా పిండదేశములోనికి దిగివచ్చెను. వీనిసూక్ష్మతమరూపములకు సంబంధము పిండదేశశిఖరస్థానముయొక్క అధిపతితో గలదు. వీనియొక్క తక్కిన అంతకన్నతక్కువసూక్ష్మమైన రెండురూపములును పిండదేశశిఖర స్థానముక్రిందనున్న రెండుస్థానములకు నధిపతులైరి. అటులనే విష్ణు, బ్రహ్మ, శివులధారలు పిండదేశములోని అట్టడుగుమూడులోకములలోనికి యథాక్రమ ముగా దిగి, నిలచిపోయునవి. జ్యోతినారాయణులధారలు మానవశరీరములో ఇచ్ఛారూపమునను మనోరూపమునను ప్రకటమై హృదయచక్రమువద్ద నంశ రూపముననున్నవి. అచ్చట (హృదయచక్రమునందు) ఇచ్ఛయు, మనస్సును తమ తమ కార్యములను ప్రకటరూపమున సాగించుచున్నవి. వీనిసూక్ష్మరూపములు కంఠచక్రమువద్దను, ఆజ్ఞాచక్రమువద్దను (అనగా ఆత్మనివాసస్థానము) ఉన్నవి. (18. వ. ప్రసంగముచూడుడు) కాని యీచక్రములలో వానిక్రియలు ప్రకట రూపమునజరుగుటలేదుకావున ఆత్మయొక్కగుప్తశక్తులు ప్రబుద్ధమైనపుడే ఆక్రియలజ్ఞానము (అనగా ఈరెండుచక్రములలో ఇచ్ఛామనస్సులకార్యముల జ్ఞానము) గలుగగలదు. ఇవ్విధముగ మనుష్యశరీరములో క్రిందిమూడుచక్ర ములలోను వరుసగ విష్ణు, బ్రహ్మ మహాదేవుల శక్తులుండి శరీరముయొక్క

పాలన, పోషణలను, సంతానోత్పత్తికార్యమును మలమూత్రవిసర్జనకార్యమును నెఱవేర్చుచున్నవి. మనుష్యశరీరములోని ఆఱుచక్రములకు సరిపోయెడి పిండ దేశలోకములాఱింటికిని నామములు, యథాక్రమముగ (1) చంద్రలోకము, (2) సూర్యలోకము (3) పృథివి (4) బృహస్పతి (5) శని (6) వరుణుడు (Neptune) నైయున్నవి. ఇవిగాక, వ్యావహారికములో గ్రహములని పేర్కొన బడు కొన్ని యితరమండలములు కూడ గలవు. కాని అవి నిజమునకు, ఉప గ్రహములుమాత్రమేకాని గ్రహములుకావు. ఆయుపగ్రహములు తమకత్యంత సామీప్యముననున్న ప్రధానగ్రహములకు సహాయకములుగనున్నవి. మనుష్య శరీరములోని నాడీమండలములోగూడ ముఖ్యకేంద్రములకు సమీపమున నున్నట్టి చిన్న కేంద్రములు ఈయుపగ్రహములరీతినే పనిచేయుచున్నవి. మానవశరీరములోని అట్టడుగుమూడుచక్రములును, పైమూడు చక్రములతో సంబంధములేకుండా వేఱుగా ఉన్నట్లే పిండదేశములోని క్రింది మూడులోకము లునుగూడ పైమూడులోకములనుండి చాలవఱకు స్వతంత్రముగ నుండుచున్నవి. విష్ణువు అంశమైన బృహస్పతిగ్రహముకూడ, తన యధిపతివలెనే (అనగా విష్ణువు వలెనే) సూర్యునినుండి యించుమించు స్వాతంత్ర్యమైయున్నది. చంద్ర లోకమునుండి దిగి పిండదేశములోనట్టడుగులోకమువఱకువచ్చిన చైతన్యధారయే పైమూడులోకములగణమునకును, క్రిందిమూల్లోకముల గణమునకును సంబం ధము కలుపుచున్నది. మనుష్యుని ఆత్మఘట్టము చంద్రస్థానమేకావున, జోతి ష్కులు చంద్రస్థానమునుబట్టి రాశినిర్ధారణచేసి, మానవుని స్వాభావికగుణము లను నిర్ణయముచేయుచున్నారు. ఈచంద్రలోకమే పిండదేశములోని సమస్త జంతుజాలమునకు నాడిలో చేతనతను చెందజేసిన భండారము. పిండదేశము యొక్క స్థూలపదార్థములోనికి దిగివచ్చిన జడచైతన్యము (అనగా జడప్రకృతి యొక్క ప్రాణము) అనెడి మతాలకధారకునుమూలభండారమిదియే. భూలోకములో ప్రసిద్ధికెక్కిన విద్యుచ్ఛక్తి యీజడచైతన్యధారయొక్క ప్రకటనమే ఈ జడ చైతన్యధారను సంతులపవిత్రగంథములలో విద్యుచ్ఛక్తియని పేర్కొందురు. పంచతత్త్వముల ధారలును అయిదు సూక్ష్మమండలములుగా పిండదేశము యొక్క చంద్రలోకముక్రింద వెవ్వేఱురంగులతో ప్రకాశించుచున్నవి. పైన చెప్పినవిషయములే యీక్రింది పద్యచరణములో వర్ణించబడినవి:—

పాంచ రంగ నిరఖే తత్త సారా ! చమక బీజలీ చంద్ర నిహారా !

ఫోడా తిల కా ద్వారా పారా !

అనగా, నేను పారతత్త్వముల పంచవర్ణములు చూచితిని. చంద్రలో
ములో విద్యుత్ప్రకాశమునుగూడ చూచితిని. పిమ్మట తృతీయనేత్రమును
అనగా బ్రహ్మాండ దేశముయొక్క ద్వారమును పగులగొట్టితిని (101 వ ప్ర
గము చూడుడు)

## 105. పిండదేశనివాసులు

పిండదేశనివాసుల శరీరములు వారివారినివాసస్థానములలోని జడప్రకృ
పదార్థముతో నిర్మించబడినవి. ఎట్లనగా పృధివిలోని ప్రాణులశరీరము
భూలోకములోని స్థూలసూక్ష్మపదార్థములతోనే నిర్మించబడినవి. భూలోకమ
కన్న నున్నతతరగతికి చెందిన సూర్యచంద్రలోకములు భూలోకముకన్న నెక్కు
శ్రేష్ఠతరము సూక్ష్మమునైన పదార్థముతో నిర్మితమయ్యెను. అందువలన
అవి మహాప్రకాశమానముగనుండి భూలోకముకన్న మహావిశేషమైతన్మా
తోను శక్తులతోను నిండియున్నవి. ఈకారణమువలననే ఆలోకములలో
నివాసులుగూడ భూలోకవాసులకన్న నెక్కువప్రకాశమానములును సూక్ష్
ములునైన శరీరములుగలిగి యిచ్చటికన్న నెక్కువ యానందమయజీవితముల
గడుపుచుందురు. 102 వ ప్రసంగములో చెప్పబడిన చౌరాసీలక్ష్యధారలు
పంచతత్త్వములును బ్రహ్మాండమునుండి పిండదేశములోనికి దిగివచ్చునప్పు
మెట్టుమెట్టునకు నెక్కువస్థూలములై పోవుచు వచ్చెను. ఈధారలు చంద్రసూ
లోకములలో అతిసూక్ష్మముగనుండి, తక్కినలోకములలో చంద్రలోకమును
ఆయాలోకములెంత యెక్కువదూరముగనున్నవో అంతయెక్కువస్థూలమైపో
చుండెను. మనకు పృధివిలోకములో గల యనుభవమునుబట్టి, అన్నిలోకవ
లోను ఘన, ద్రవ, వాయువ్యరూపమైన జడప్రకృతిలోనే జీవులు నివసిం
చుందురని సహజముగా మనకనిపించును. కాని అది సరికాదు. ఏలనన, ప
గోళముతాలూకు సూక్ష్మప్రకృతిలోను జీవులు అందుకు తగిన సూక్ష్మశరీర
లను ధరించియుండుచున్నారు. మానవునికి ఈపృధివిలో స్థూల సూక్ష్మ కా
శరీరములని పేర్కొనబడు మూడుశరీరములు కలవు. ఈమూడు శరీరములు
బ్రహ్మయొక్క రూపత్రయమునకు చిన్నచిన్న ప్రతిబింబములవంటివి. కా
జీవునికి స్థూలశరీరములోనున్నపుడే సూక్ష్మశరీరముకూడా ఉండుచున్నప్పు
జీవులు ప్రత్యేకముగ నొక్కసూక్ష్మశరీరముమాత్రమే ధరించియుండగల
మేము చెప్పునది వట్టిమాటకానేరదు. మనము స్థూలఘట్టముమీదనున్న

మాత్రము మన సూక్ష్మశరీరము కొంతవఱకు అచేతనావస్థలోనుండును కాని, స్వప్నము, సమాధియున్నగు అవస్థలలోనికి మాఱినపుడు అది మేల్కాంచు చుండును. ప్రేతజీవులలో (అట్టిజీవులయస్తిత్వమును గుఱించి ప్రస్తుత కాలములో నెట్టిసందియమును లేదు) మానవుల పరిస్థితికి ప్రతికూలముగా, సూక్ష్మశరీరమే యెల్లప్పుడు క్రియాశీలముగనుండుచు, స్థూలశరీర మప్పుడప్పుడు మాత్రమే వ్యక్తమగుచుండును. పిండదేశములోని లోకములన్నిటి తాలూకు సూక్ష్మమండలములలోను జీవులు ఇంచుమించు ప్రేతజీవులపరిస్థితులవంటి పరిస్థితులలో నివసించుచున్నారు.

పృథివికన్న క్రిందిలోకములలో నివసించుచున్నజీవులు పృథివిలోనిజీవుల కన్న చాల యధమతరగతికి చెందినవారని వేఱుగ చెప్పనవసరములేదు. ప్రేత జీవులెల్లప్పుడు, వారికిగల ప్రాపంచికబంధనలు నైహికవాసనలమూలముననే, భూమిమీద కనబడుట తటస్థించుచుండును. వారలబంధనలు కోరికలననుసరిం చియే వారలకృత్యములు, ఉపకారముగాని అపకారముగాని గలుగజేయునవై యుండును. క్రిందిమూడుచక్రములకు సంబంధించినక్రియలు మానవులకు పశువు లకునుకూడ సమానమే గనుక, ఆక్రియలలో తుచ్ఛాలోచనలునీచభావముల యొక్క దుర్వాసనకొట్టుచుండును. ఉత్తమాలోచనలకును ఉత్తమ భావములకు నెట్టిప్రసక్తియు నాక్రియలలో నుండనేరదు. కావున, క్రిందిమూడు లోకములలోని జీవులుకూడా యెక్కువగా, కేవలము పాశవికకృత్యములనే చేయుచుందురు. ఆలోకములలోని సూక్ష్మశరీరజీవులు సామాన్యముగా దుష్ట స్వభావముకలవారై అపకారములు చేయుచుందురు. వారల సంతోషములు భోగములుకూడ చాలతుచ్ఛములై మానవులసుఖములు భోగములతోను ఎట్టిపోలికలేకుండ నుండును. ఈసూక్ష్మశరీరజీవుల నైజస్వభావము క్రిందవర్ణించ బోవునట్టి నరకజీవులస్వభావమునే యించుమించు పోలియుండును.

## 106 నరకలోకము, అచ్చటి నివాసులు.

సృష్టికిపూర్వము ఋణాత్మకధ్రువము అనగా న్యూనాంగముయొక్క అసలుకొనభాగము పిండదేశముయొక్క అట్టడుగుస్థానమునకు క్రిందుగనున్నది. ఇచ్చట నెట్టి క్రమబద్ధమైనసృష్టియు లేదు. దీని నొకచైతన్యశూన్యమైన మహా మైదానమని పేర్కొనవచ్చును. ఇచ్చటనున్న కొద్దిసృష్టికూడ తుచ్ఛమైనదై మహాసున్నలోని నీచతరగతిసృష్టికిని, బ్రహ్మాండముయొక్క అట్టడుగు

భాగములోని సృష్టికిని బహుమారసాదృశ్యము గల్గియున్నది. ఈహీనతరగతి సృష్టికే నరకలోకమని పేరు. ఈస్థానము పూర్తిగా దుఃఖక్లేశములతో నిండి యున్నది. ఇచ్చటి నరకజీవులు మహాదుర్వృత్తులుగలవారై, యేజీవుడైనను పైలోకములనుండి దురదృష్టవశమున నీదండనశిక్షణముల స్థానములో వచ్చి పడినచో, ఈనరకలోకనివాసులు అట్టిజీవునికి నిరంతరము హింస కలుగ జేయు చుందురు,

రచనాక్రమమునుగుఱించిన వర్ణనము ఇప్పటికిపూర్తియైనది. ఈవర్ణనము నిస్సంశయముగ నసంపూర్ణమేకాని, దీనిలో సృష్టియొక్క నిర్మలచైతన్య దేశమందలి ఆదియవస్థమొదల్కొని, నరకలోకములోని యంత్యావస్థవఱకును వివరణచేయబడినది. సృష్టిలోనిమహాఖండములయుత్పత్తినిగుఱించి చెప్పు సందర్భములో సమస్తసృష్టియొక్క విధివిధానముల ప్రబంధమును గుఱించి కూడ కొంతవఱకు విస్తరించి చెప్పితిమి.ఇంకనిపుడు ఈమూడుమహాఖండములలో పరస్పరసంబంధము నిలబెట్టునిమిత్తమును, ఆయాఖండములక్రియాకలాపము నిరాటంకముగజరిగిపోవునిమిత్తమును చేయబడిన సామాన్యప్రబంధమును గుఱించి చెప్పుటమాత్రమే మిగిలెను.

## 107. మూడుమహాఖండములకు సంబంధించిన సామాన్యప్రబంధము.

సృష్టిలోనిప్రథమమహాఖండములోని అనగా నిర్మలచైతన్య దేశములోని లోకములయొక్కప్రబంధమునుగుఱించి కొద్దిగా చెప్పవలసియున్నది. ఈనిర్మల చైతన్యస్థానములన్నియు నాయపారపరమపురుషునికి ఎట్టయెదుటనే యున్నవై, ఆపరమపురుషుని సొంత దేశములో కలిసిపోయెను. సురత్ ధారయు శబ్దధారయు నీమండలములను, ఇంక ముందెన్నటికి నెట్టిదైనసహాయముకోరవలసిన అవస రము లేకుండునంతసంపూర్ణముగా, చైతన్యముతో నింపివేసెను. సృష్టికిపూర్వము నిర్మలచైతన్యముతో సమ్మిళితమైయున్న మాలిన్యములోచాల భాగము, ప్రథమ రచనాత్మక క్రియజరిగినపుడు, బయటకుత్రోసివేయబడినదికాని, కొంత మాలిన్యమింకను ఈమండలములలో శేషించియుండుటచే, ఆశేషించినమాలిన్య ముకూడా రెండవరచనాత్మకక్రియ ప్రారంభమవగానే బహిష్కరింపబడినది. అం దువలననిపుడు, పైన ఇంతకుముందు చెప్పినప్రకారము, నిర్మలచైతన్యదేశము లోనిమండలములన్నియు సంపూర్ణముగానిర్మలమైపోయి, వానిలో నెంత కాలము

గతించిపోయినను యెట్టిక్షయవికారములుకాని హెచ్చుతగ్గులుగాని గల్గుటకు నావకాశములేదు. నిర్మలచైతన్యదేశముయొక్క విస్తృతివైశాల్యములు తక్కిన రెండుమహాఖండములతో పోల్చినచో నూహింపశక్యముకానన్నిరెట్లు అధికముగనుండును. నిర్మలచైతన్యదేశముయొక్క పరిస్థితివంటిపరిస్థితి తక్కిన రెండుమహాఖండములలో లేదు. బాహ్యసహాయమేమియు నక్కరలేకుండగనే, తమపనులనవి నెఱవేర్చుకొనగల్గునంతసంపూర్ణమైన నిర్మలచైతన్యము ఆరెండు మహాఖండములలో లేదు.అందువలననే బ్రహ్మాండదేశములోని ప్రతిభాగమును అందలిఅసంఖ్యాకములైన బ్రహ్మాలు, ఆద్యలును, చేతనతాసహాయముపొందు నిమిత్తమై, ఒకరివెంటమఱొకరు వరుసగా నిర్మలచైతన్యదేశమున కెదురుగా కొంపోబడవలసి వచ్చుచున్నది. బ్రహ్మాండదేశము సత్యలోకముచుట్టు ప్రదక్షిణముచేయుటకు కారణమిదియే. ఈప్రదక్షణముచేయుసమయములో బ్రహ్మాండముక్రిందిదేశములు, అనగా పిండదేశములు తమఆకర్షణవేగముచే బ్రహ్మాండమును సత్యలోకమునుండితగినంతదూరములోనుంచునట్లు చేయుచున్నవి. బ్రహ్మాండమునకు నిర్మలచైతన్యదేశమునకునుగల పైనుదహరించినసంబంధము వంటిసంబంధమే పిండబ్రహ్మాండదేశములమధ్యనకూడ నొప్పారుచున్నది.అనగా పిండదేశము బ్రహ్మాండముచుట్టును తిరుగుచు దానివలన సహాయసంపత్తును తీసికొనుచున్నది. కాని బ్రహ్మాండదేశపిండదేశములురెండును న్యూనాంగము చివరనున్న ధ్రువమువైపునకే పూర్తిగా ఉన్ముఖమైయున్నవి. ఏలననగా, సృష్టికిపూర్వముండిన మధ్యదేశముయొక్క(Neutral zone) ఆదిన్యూనాంగము నంటియున్నభాగములో బ్రహ్మాండమున్నది. (91 వ. ప్రసంగమునుచూడుడు) ఇట్లు బ్రహ్మాండము నిరంతరము న్యూనాంగముచివరి ధ్రువమువైపునకే ఒరిగి యుండుటచే బ్రహ్మాండములోని చైతన్యము క్రిందికేప్రవహించుచున్నది. న్యూనాంగముయొక్క అధోలోకములు ఇసుకవలె పొడిఆరిపోయినట్లు చైతన్యశూన్యములైయుండుటచే నీచైతన్యమును అత్యాతురతతో అవిపీల్చుకొనివేయుచున్నవి. అయినను ఈలోకములప్రకృతియే సృష్టికిపూర్వమునుండియు వాని తిరహానతిక్రమించినతీక్ష్ణతగలచైతన్యము నెంతోకాలము తమలో జీర్ణించుకొన జాలనిదగుటచే బ్రహ్మాండమునుండి క్రిందికిస్రవించి యీఅధోలోకములలో ప్రోగగుచున్నచైతన్యమంతయు తిరిగి సూక్ష్మరూపముతో అనగా ధారారూపముగా పైకిపోవుటప్రారంభించెను.అట్లుజరుగుటవలన జీవసంస్కరణదృష్ట్యా, ముఖ్యముగాపిండదేశమునకు మహోపకారమే చేకూరుచుండెను. ఏలననగా

ఈధారద్వారా నరకలోకజీవులును, పిండదేశములోని క్రిందిలోకముల జీవులును ఉన్నతస్థానముల కెక్కిపోగలుగుచున్నారు. కాని యీధార పిండదేశముయొక్క శిఖరస్థానమును దాటివెళ్ళలేకపోవుటచే జీవులీధారనుపట్టుకొని పిండదేశము యొక్క శిఖరస్థానమైన చంద్రలోకమువఱకుమాత్రమే జేరుకొనగల్గుచున్నారు. ఈధారఅచ్చటచేరుకొన్నపిమ్మట తిరిగినుఱొకఅధోముఖధారతో కలసిపోవుచు నీవిధముగా క్రిందినుంచిపైకి పైనుంచిక్రిందకును ఒకచక్రముతిరిగినట్లు తిరుగుచున్నది. దీనినే "చౌరాసీచక్ర" మని యందురు. ఏజీవునికైనను ఈచంద్రస్థానమునుదాటి పైకివెళ్ళవలెనన్నచో అట్టిఊర్ధ్వలోకములకుజేర్చగల్గినట్టి ప్రత్యేకాధ్యాత్మికసాధనలను అభ్యాసముచేయనిదే సాధ్యముకాదు. ఇంతవఱకీప్రసంగములో నన్నిపిండదేశములు అన్నిబ్రహ్మాండదేశములకును సంబంధించిన సామాన్యవిషయములనుగుఱించి చెప్పితిమి. ఇప్పుడు ఈరెండుమహాఖండములలో నొక్కొక్కభాగము అనగా ఒక్కబ్రహ్మాండమునుగుఱించి ఒక్కపిండదేశమునుగుఱించియు, వివరముగాచెప్పెదము.

## 108. మహాప్రళయమును ప్రళయమును గుఱించి వర్ణన.

ఏదైననొకబ్రహ్మాండము తన భ్రమణమును సత్యలోకముచుట్టు నొకసారిపూర్తిచేసినపుడు (ఈమధ్యకాలములో తనకధీనమైయున్న పిండదేశములన్నిటికిని చైతన్యసహాయము నిచ్చుచుండుటచే ఆబ్రహ్మాండముయొక్క చైతన్యము చాలవఱకప్పటికి క్షీణించిపోవును.) అది సత్యలోకమునకతిసమీపముగా వచ్చును. అనగా, ఆబ్రహ్మాండమును సత్యలోకమును పరస్పరాభిముఖముగనైపోవును. అందువలన ఆబ్రహ్మాండము తనకుసంబంధించిన సకల పిండదేశములతోసహితముగా సత్యలోకముయొక్క ఆకర్షణచే నూర్ధ్వముగ లాగబడి, సృష్టికాకముందు తనకెట్టి పరిస్థితి యుండెడిదో ఇంచుమించట్టి అవస్థలోనికే మాఱిపోవును. అట్లు తన ఆదియవస్థలోనికి మార్పుగల్గుటనే మహాప్రళయమని యందురు. తిరిగి దానిపునర్నిర్మాణమునకు కావలసినంత చైతన్యము సేకూరువఱకు నామహాప్రళయావస్థ అట్లే నిల్చిపోయి,అట్లు చైతన్యములభించినతోడనే తనకుసంబంధించినపిండదేశములతోసహా బ్రహ్మాండము మొదటిలోవలెనే పునస్సృష్టి చేయబడును. బ్రహ్మాండమునకు జరిగినపద్ధతినే పిండదేశముయొక్క ప్రళయముకూడా అగుచుండును కాని, పిండప్రళయముమూలమున బ్రహ్మాండముపైన నెట్టి ప్రభావము కలుగనేరదు. మహాప్రళయానంతరము

బ్రహ్మాండమునకు పునస్సృష్టియైనట్లే, ప్రళయానంతరము తిరిగి పిండదేశము కూడ పునస్సృష్టిచేయబడును. పిండదేశము నాశనమైపోవుటయే ప్రళయమని చెప్పఁబడుచున్నది.

## 109. మానవులు కాక ఇతరజీవుల శరీరప్రకృతి.

ఈ యావత్సృష్టిలో, శిఖరస్థానము మొదలుకొని అట్టడుగుస్థానమువఱకునుగల మనుష్యేతర దేహములన్నిటిలోను శరీరనిర్మాణము, తాము నివసించు లోకమునకు సంబంధించిన మూడుచక్రములుమాత్రమే క్రియాశీలమైయుండి, తక్కినమూడుచక్రములు నేవిధమునగూడ ప్రబోధము చేయశక్యములేకుండా చిహ్నమాత్రముగనే ఉండునట్లుగను, వానిద్వారా విశ్వసృష్టిలోని ఇతరలోకములతో నేట్టిసంయోగము కూర్చుకొనశక్యముగాకుండులాగునను ఉన్నది. ఇంతియగాక ఆశరీరముండిన మహాఖండముగాక తక్కిన రెండు మహాఖండముల స్థానములలో దేనికిని ఆనవాలుగూడ (ఆమహాఖండములు ఈశరీరమున్న మహాఖండముకంటెపైనవైనసౌగాక క్రిందివైనసౌగాక) ఆశరీరములో నుండుటలేదు. ఉదాహరణార్థము, సర్వోపరిస్థానములైన రాధాస్వామిధామము, అగమ, అలఖ లోకములలోని నివాసులకు ఈముల్లోకములకును వర్తించెడి మూడుకోశములు మాత్రమే యుండును. మఱియు నీమూడుశరీరములలో, నాయాత్మయొక్క నివాసలోకమునకు సంబంధించిన శరీరము తక్కినరెండుశరీరములకన్న నెక్కువ క్రియాశీలమై యుండును. తక్కిన రెండుశరీరములును క్రియాశీలశరీరమునకధీనములై యుండును. అయినను అవి పూర్తిగా నిరుపయోగములు కావు. ఈపైమూడులోకములనివాసులకును వారి బాహ్యతమకోశములో నట్టడుగు భాగములో నొకచోటున నొకబిందురూపముగమాత్రమే క్రిందిమూడులోకములును (అనగా అనామీ, సత్యలోక, భంవరగుఫలు) సూచితమైయుండును. కాని అందువలన వారలకేమియు ప్రయోజనముండదు. ఏలననగా, నిర్మల చైతన్యదేశములోని యున్నతలోకనివాసులు సంపూర్ణానందమయమైన తమ లోకములలో వారల సహజప్రకృతిని బట్టి పరిపూర్ణానందమగ్నులై పూర్ణ సంతృప్తులైయుండుటచే వారలకు క్రిందిలోకములకు దిగుట కవకాశమెంత మాత్రము లేదు. అటులనే వారికి తమలోకముకన్న నున్నతలోకములలోనికి ఎక్కుటకుకూడా నవకాశములేదు. ఏలననగా సృష్టిఆరంభసమయములో నేయేజీవులకు వారివారి ఆత్మీయచైతన్యతైక్ష్ణ్యము ననుసరించి యేయేలోక

ములలో నివాసమేర్పర్చబడెనో, ఆయాజీవు లెల్లపుడు నాయాలోకములలోనే యుండవలసియున్నది. నిర్మలచైతన్యదేశవాసులకు చేసిన విధముననే బ్రహ్మాండదేశవాసులకుగూడ నేర్పాటు చేయబడినది. అయితే తృతీయమహాఖండమైన పిండదేశములోనియూర్ధ్వముఖధార పిండదేశవాసుల శరీరములుమాఱినపుడెల్ల, వారి నూర్ధ్వముగ తీసికొనిపోవుచున్నదికావున వారు పిండదేశశిఖరస్థానమగు చంద్రలోకమువఱకు నారోహించగల్గుచున్నారు. బ్రహ్మాండదేశమునుండి పిండదేశములోనికి దిగిపోవుచున్న అధోముఖధార మహాప్రళయకాలమువఱకు తిరిగి యూర్ధ్వముగపోనేరదుకావున అనేకులు బ్రహ్మాండదేశపుజీవులు ఈధార మీదుగా పిండదేశములోనికి దిగివచ్చుచున్నారు.

## 110. బ్రహ్మపురుషునియొక్కయు, పరమపురుషునియొక్కయు అవతారములు.

పైనుదహరించినవిధముగా క్రిందిలోకములకు దిగివచ్చుచుండిన బ్రహ్మాండదేశవాసులను తిరిగి బ్రహ్మాండమునకు తీసికొనిపోవునిమిత్తమును, పిండదేశముయొక్కస్థితిని సంస్కరణచేయునిమిత్తమును. బ్రహ్మపురుషుడు అప్పుడప్పుడు ఈభూలోకమున అవతారమెత్తవలసినయవసరముగల్గుచుండును. అప్పుడపుడు బ్రహ్మపురుషుడు తననిజపుత్రులనుగాని లేక ప్రతినిధులనుగాని (అనగా బ్రహ్మపురుషుడు ఏఆత్మలకిని తన చైతన్యముతో ప్రత్యేకముగ మేల్కొల్పునో అట్టి ప్రత్యేకమైన ఆత్మలను) ఈయుద్దేశ్యముతోనే భూలోకమున కంపుచుండును. అదేవిధముగ నా యనంతసర్వోత్తమచైతన్యధామము యొక్క మహాప్రభువును చైతన్యశక్తియొక్క అగమ్యాపారభండారమును అగు సత్యస్సృష్టికర్తకూడా ఈపృథివియం దవతరించుమహానుగ్రహము చేయుచుందురు. ఈత్రిలోకి నిర్మలచైతన్యదేశమున కభిముఖముగవచ్చినపుడే అట్టి పరమపురుషునియవతారము ఈలోకమునకు దిగివచ్చుట జరుగును. అట్టి మహాశుభసమయమున నిర్మలచైతన్యదేశమునుండి క్రిందికివచ్చెడి మహావిశేషచైతన్యమునకు అంతుపొంతులుండవు. నిర్మలచైతన్యదేశము క్రిందనున్న సమస్త సృష్టికి నందువలన మహాలాభము సేకూరును. జీవులందఱకును పరమపురుషుని ధామమందు పరమపురుషుని నిజభవనమందును నివాసముచేకూర్చగల ఆధ్యాత్మికశిక్షణపొందుటకు అదేసమయము. పరమసర్వేశ్వరుడవతరించినందువలన పిండబ్రహ్మాండదేశములురెండును సర్వోత్తమతరగతికిచెందిన చైతన్యముతో నిండిపోయి, వానినుండి యూర్ధ్వముఖముగాపోవునట్టి చైతన్యధార యొక్కట్టి

యేర్పడినది. ఈధారయే పరమార్థిజీవులు రచనయొక్క ప్రథమమహా ఖండమగు నిర్మలచైతన్యదేశమున ప్రవేశించి అచ్చటసదాస్థాయియైన పరమా నందమునసుభవించునిమిత్త మవలంబించవలసినమార్గము. ఉన్నతలోకవాసులు (ముఖ్యముగా బ్రిహ్మాండదేశవాసులు) పరమపురుషరాధాస్వామీదయాళుని పరమశుభావతారమమూలమున గలిగిన స్వర్ణావసరమును తఱుచుగ నుపయోగించుకొనుచు, వారివెనువెంట నీలోకమునకు దిగివచ్చుచుందురు. ఈలోకములో నట్టిజీవులకే సత్యలోకము తదుపరిలోకములయొక్కయు చైతన్యబీజములను స్వీకరించగల యర్హతగలదు. వారికిఆబీజములను జీర్ణించు కొనినసేగాని ఊర్ధ్వగామియైనచైతన్యధార మీదుగా నిర్మలచైతన్యదేశము వైపు పైకెక్కగలసామర్థ్యమునేకూడఅనేరదు. అట్టివారికిఆధ్యాత్మికసాధనల నభ్యాసముచేయుట మిక్కిలిఆనందదాయకమగనుండి అభ్యాసముకూడా యెప్పుడు జయప్రదముగనే సాగిపోవుచుండును. ఇవ్విధమున సత్యలోకమునకు ఆరోహింపజేయునిమిత్తమైన యేర్పాటు మానవజన్మయెత్తినవారొక్కరికే చేయబడలేదు. పిండదేశములోని వివిధమండలములలోనున్న యధికారిజీవు లందరిలోనుగూడ (మానవులైననేగాక, మఱొకజీవులైననుసరేగాక) నీయుత్త మోత్తమచైతన్యబీజము నాటబడుచున్నది. క్రమక్రమముగ వీరందఱిలోను రాధాస్వామీదయాళురుచెప్పినయభ్యాసయుక్తి ననుష్ఠించగలచైతన్యశక్తియు నాత్మబలమును బయల్దేరి వీరుకూడ చివరకు నిజమైనముక్తిని మరణరాహిత్య మును పొందుటకు అధికారముగలవారగుచున్నారు. 52. వ. ప్రసంగములో నుదహరించబడిన సంత్‌సురతులు రాధాస్వామీదయాళుని నిజపుత్రులు. ఏలననగా, సంతుఆత్మలచైతన్యసారము రాధాస్వామీదయాళునియంశయే. ఈత్రిలోకి నిర్మలచైతన్యదేశమున కభిముఖముగ వచ్చిన మహాశుభసమయమున సంతుజీవులుకూడ తఱుచుగ నీజగమున నవతరించి, ఇంచుమించు పరమపురుష రాధాస్వామీదయాళుని మహనీయావతారము నెఱవేర్చువిధముననే జీవులపై మహానుగ్రహముతో జీవోద్ధారకార్యముసాగించుచుందురు. ఈత్రిలోకి నిర్మల చైతన్యదేశమున కభిముఖముగనుండుసమయము ఆఖరైపోగలకాలమునకు, 108. వ. ప్రసంగములోనుదహరించినప్రకారము మహాప్రళయముసంభవించును. అప్పటికి జీవోద్ధారకార్యమును, జీవులకుచైతన్యదానమిచ్చి వారలనుచైతన్య వంతులుగాచేయుపనియు కూడా సంపూర్తియైపోవును.

111. మానవశరీరము విశ్వసృష్టి కొరకు చిన్నప్రతిబింబము. మానవశరీరములో నాధ్యాత్మికసాధనలను జయప్రదముగ సాగించుకొనుమహాసావకాశమున్నది.

మూలాధారము మొదలుకొని నేత్రద్వయము మధ్యనున్న ఆజ్ఞాచక్రము వఱకునుగల మనుష్యశరీరములోని ఆఱుచక్రములును క్రియాశీలములై యున్నందున, పిండదేశములోని ఆఱుఘట్టముల ప్రతిబింబములును మానవశరీరములో క్రియాత్మకరూపమున నేర్పడియున్నవి. మానవుని నివాసస్థానము పిండదేశములోని పైమూడులోకములలో నట్టడుగుదియగు పృథివిలోకముకావున, సృష్టిలో నందఱిజీవులకును వర్తించు సామాన్యనియమమునసరించి మానవశరీరములో పైమూడుచక్రములుమాత్రమే క్రియాశీలమై యుండవలసియున్నది. కాని బ్రహ్మాండమునుండియు, చంద్రలోకమునుండియు, సూర్యలోకమునుండియు క్రిందికిభూమిపైకి దిగివచ్చుచున్నధారలవేగము ఇచ్చట మహాతీవ్రముగనుండుటచే, బ్రహ్మాండ నిర్మలచైతన్యదేశములలోవర్తించునట్టి సామాన్యనియమమునకు ప్రతికూలముగా, పిండదేశముయొక్క క్రింది మూడుస్థానములకు సరియైనట్టి మానవశరీరములోని క్రిందిమూడుచక్రములునుగూడ క్రియాశీలముగనేయున్నవి. ఈకారణముచే పృథివిలోకములో మానవులు, పశువులు, నీయిరువురిలోను క్రిందిమూడుచక్రములు చాలయధికముగా ప్రబుద్ధములై యున్నవి. ఈభూలోకములోని ప్రాణులందఱిలో నుత్తమచైతన్యవంతమైన (అనగా చేతనతావిషయములో నితరజీవులకన్న నెక్కువశ్రేష్ఠమైన) మానవశరీరములో, పైమూడు చక్రములే క్రిందిమూడుచక్రములకు చైతన్యము పంపుచుండినను కూడా, ఆచక్రములెక్కువ శిథిలమైపోవునంత యధికముగా వానిచైతన్యము క్షీణించిపోలేదు. కాని, ఇతరయోనులలో నట్లుగాక, వానిచైతన్యము తక్కువతరగతికిచెందినదగుటచే నీ యధోముఖప్రవాహము వానిలోని పైచక్రముల చైతన్యము నెక్కువగాక్షీణింపజేయుటచే ఆజీవులమానసికశక్తులు (అందులో ముఖ్యముగ విమర్శనశక్తి)పూర్తిగా ధ్వంసమైపోయినవి. అనేక జంతువులలోనయితే, వానిహృదయచక్రమే వానిఆత్మయొక్క నివాసస్థానమైయుండుటచే, వాని మెదడుతీసివేసినపిమ్మటగూడ నవి యథాప్రకారము జీవించుచునేయున్నవి. పైనజెప్పినఅధోముఖప్రవాహము అత్యంతమహావేగముతో ప్రవహించుచున్నది. అందుచే ఈధారమూలమున పుష్టినొందుచున్నకామక్రోధాదివికారములన్ను

కొద్దిగొప్పఅణచిపెట్టియుంచుచు లోకవ్యవహారమును సాగించుకొనునపుడుకూడా వ్యర్థముగను అయుక్తముగను ఈవికారములలోపడిపోకుండా నిరంతరజాగరూకతతో నుండిననేదప్ప నేజీవునకు నీధారవేగమును వెనుకకుతిప్పివేయుటకు సాధ్యముకాదు.

పైనజెప్పినవిషయములనుబట్టి బ్రహ్మాండలోకముల ఆయాప్రతిబింబములును, మానవశరీరములో క్రియాత్మకరూపముననున్నవని స్పష్టమగుచున్నది. ఈప్రతిబింబములను గ్రహించగలయంత్రము మానవునిమెదడులో నున్నదనియు మానవుని మెదడులోని ఛిద్రములద్వారానే బ్రహ్మాండలోకముల ప్రతిబింబములు వచ్చుచుండుటచే ఆఛిద్రములలో బ్రహ్మాండలోకశక్తులు ఇమిడియున్నందున, మానవుడు తగినయాధ్యాత్మికసాధనచేసి ఆఛిద్రములద్వారా బ్రహ్మాండములోప్రవేశించగలడనియు 23, 24 వ ప్రసంగములలోనే చెప్పియుంటిమి. బ్రహ్మాండము కూడా నిర్మలచైతన్యదేశముయొక్క ఛాయయే కాబట్టి బ్రహ్మాండలోకముల ప్రతిబింబములను మానవశరీరములో ప్రకటింపజేయుధారలలో నిర్మలచైతన్యదేశముయొక్క ఛాయాప్రభావము ఉండును. ఆకారణముచే మానవునిమెదడులో, నిర్మలచైతన్యదేశస్థానముల ఛాయలు కూడా ఉండి, ఆస్థానములతో సంబంధ మేర్పాటుచేసికొనగల్గుటకును అచ్చట ప్రవేశించగల్గుటకును తగిన ఛిద్రములు తయారైయున్నవి. కావున పర్యవసానమేమనగా మానవునకు, అతని నివాసస్థానముయొక్క విశిష్టతనుబట్టియు అతని సొంతవిశిష్టచేతనతమూలముననను, చైతన్యశక్తియొక్క నిజభండారము మొదలుకొని న్యూనాంగములో సృష్టివిహీనమైన అట్టడుగుకొనవఱకునుగల సృష్టిలోనిసమస్తస్థానములకు నమూనాలుగల్గినట్టియు, మానవాత్మకు సర్వోన్నత స్థానమువఱకుజేరుకొనగల్గుటకుపయోగించునట్టి ఛిద్రములు గుప్తశక్తులును గల్గినట్టియు, (శరీరరూపమైన) ప్రత్యేకసృష్టియొకటి లభించినట్లు తేలుచున్నది. కాబట్టి నీవిశ్వసృష్టికి మానవశరీరము అల్పపరిమాణములో నొకయథార్థమైన నమూనాయైయున్నది. మానవునకుగల యీనిరుపమానమైనసంపత్తుమూలముననే దేవతలకన్నను, బ్రహ్మాండవాసులకన్ననుకూడ మానవయోని శ్రేష్ఠతరముగా పరిగణింపబడుచున్నది. పరమపురుష రాధాస్వామిదయాళుడును, వారి ప్రియమైననిజపుత్రులగు సంత్ ఆత్మలును, బ్రహ్మపురుషుడు, ఆయనకళలును ఈపృథివిలోనవతరించినపుడు వారు మానవశరీరమునే ధరించుటకుకూడ నిదియ ముఖ్యకారణము. బ్రహ్మాండదేశవాసులకుకూడ నిర్మలచైతన్యదేశములో

నివాసముపొందగోరినట్లైతే భూలోకమున మానవశరీరమును ధరించవలసియున్నది. (మానవశరీరధారణమునకు సావకాశము ఒక్క భూలోకములోనే ఉన్నది.) ఏలననగా, సంతులయాధ్యాత్మికసాధనలయనుష్ఠానము విశ్వసృష్టికియొక్క పరిపూర్ణసూక్ష్మప్రతిబింబములోనే చేయుటకు సాధ్యమైనపని. సంతుఆత్మలు బ్రహ్మాండదేశనివాసులకు నిర్మలచైతన్యదేశమునుగుఱించియు, సచ్చటియానందమునుగుఱించియు తెలియజేయుటకై బ్రహ్మాండదేశములోని వివిధలోకములకు సప్పుడప్పుడు వెళ్ళుచుందురు. బ్రహ్మాండనివాసులు విశేషనిర్మలమైనవారును, విశేషచైతన్యముగలవారునగుటచే వారికి సంతులయుపదేశముల నవగాహన చేసికొనుటలో కష్టమేమియునుండక నిర్మలచైతన్యదేశమునకు వెళ్ళవలయునను కోరికగూడ వారిలో త్వరగనే యుత్పన్నమగును. ఆయాసక్తి వారిలోనధిక తీవ్రముగాబయల్దేరినపుడు వారు మానవరూపమును ధరించుచుందురు. బ్రహ్మాండదేశములోనియానందమే ఉత్తమప్రభావముగల్గించునదియును అతి హృదయాకర్షకమునైయుండునుకాబట్టి అంతకన్న అత్యుత్తమమైన చైతన్యదేశముయొక్క సందేశమొక్కటే వారలకు తమదేశమువిడిచి పైకిపోవలయుననెడి ఆసక్తిని పుట్టించగల్గును.

112. మానవులు ఇతరజీవులును భూమిమీద కెక్కడనుంచి వచ్చుచున్నారు?

బ్రహ్మాండజీవుల యాయుఃప్రమాణము బహుదీర్ఘమైనది. అందులో పెక్కుమంది మహాప్రళయసమయములో బ్రహ్మాండమునంతరించిపోవువఱకు నట్లే జీవించియుందురు. బ్రహ్మాండదేశమునుండి పిండదేశమున కొకఅధోముఖ ధార దిగివచ్చుచున్నదని యింతకుముందు చెప్పియుంటిమి. బ్రహ్మాండముయొక్క క్రిందిమూడులోకములనుండి చాలమందిజీవులును, పైమూడులోకములనుండి కొద్దిమందిజీవులును ఈధారద్వారా పిండదేశములోనికి దిగిపోవుచుందురు. వారు భూమిమీదకువచ్చినపుడు సామాన్యముగ మానవశరీరమునే ధరించుచుందురు. ఏలననగా, వారు ఈశరీరముద్వారానే తగినసాధనచేసికొని తిరిగి బ్రహ్మాండమునకుగాని అంతకన్న నుత్తమస్థానములకుగాని యెక్కిపోగలరు. మఱొకకారణమేమనగా పైనచెప్పినయధోముఖధార దానిప్రథమకేంద్రమును ముందుగా పృథివియందే యేర్పఱచుకొని పిమ్మట నింకనుక్రిందికి దిగిపోవును. అయిన నీధారమీదుగ దిగివచ్చెడి బ్రహ్మాండవాసులసంఖ్య అంతయెక్కువగ నుండదు. పిండదేశముయొక్క వివిధస్థానములలోనిజీవులే విశేషముగా భూమండలమందు జన్మనెత్తుచుందురు.

105 వ ప్రసంగములో చెప్పినవిషయములనుబట్టి పిండదేశములో ప్రతి లోకముచుట్టు నగ్నితత్త్వసూక్ష్మమండలమొకటియు ఆకాశతత్త్వసూక్ష్మ మండలమొకటియును ఆవరించియున్నవనియు, నాసూక్ష్మమండలములలోగూడ జీవులున్నారనియు, వారివాసనలు వృత్తులును ఆలోకముయొక్క పృథివీజల వాయుతత్త్వములమండలములలో నివసించుజీవులవాసనావృత్తులనే పోలియుండు ననియు తెలియుచున్నది. ఒకలోకమునకుసంబంధించిన ఆకాశఅగ్నితత్త్వముల సూక్ష్మమండలములలోని జీవుల ఆలోచనలు, భాష, దైనికవ్యవహారమును ఆలోకమునకుసంబంధించిన తక్కినమూడుస్థూలతత్త్వమండలములలోని జీవుల కున్నట్లే యుండును. ఆసూక్ష్మమండలవాసులు అచ్చట తమజీవితమైపోయిన పిదప తమలోకమునకునంబంధించిన స్థూలశరీరములోనే తఱచుగ జన్మించు చుందురు. మానవులనుపోలినజీవులొక్కరేగాక పశువృత్తులు పశుశరీరములు గలజీవులుకూడ నాసూక్ష్మమండలములో నుందురు. పృథివిమీాదనివసించుచున్న మానవపశ్వాదులైన వివిధజీవకోటులన్నియు చాలవఱకు పృథివికిసంబంధించిన అగ్నితత్త్వఆకాశతత్త్వములనుండియే వచ్చుచున్నారు. పృథివీలోకముక్రింది మూడులోకములకును పృథివీలోకమునకుపైనున్న రెండులోకములకునుగూడ నించుమించు ఈనియమము లేవర్తించును. ఈరెండువిధములుగానేకాకుండా, చౌరాసీధారలుగూడ (చతురశీతిలక్ష్యధారలు 102. వ. ప్రసంగముచూడుడు) జీవులను తీసికొనివచ్చి యీభూలోకములోను, పిండదేశముతాలూకు యితర లోకములలోను పడవేయుచున్నవి.

ఇంతియగాక, 107, వ. ప్రసంగములో తెలిపినట్లుగా, పిండదేశము బ్రహ్మాండముచుట్టును, బ్రహ్మాండదేశము నిర్మలచైతన్యదేశముచుట్టును తిరుగు చున్నవి.అట్లుతిరుగుటలో మనభూమియు,పిండదేశముయొక్క ఇతరలోకములును వానిలోసృజింపబడినజంతువనస్పతివర్గములకన్న వేఱువిధములైన జీవులు గల యితరలోకములకు దగ్గఱగా తఱచుపోవుచుండును. అట్టిపరిస్థితి తటస్థించినప్పు డొకలోకముయొక్క సూక్ష్మమండలవాసులు మఱొకలోకముయొక్క సూక్ష్మ మండలములలోనికి వెడలిపోవుచుందురు. ఈకారణముచే మనపృథివిలోకూడా అనేకనూతనవిధశరీరములుగలజీవులు ప్రకటమగుచుండెను. అందువలన భూమిం త్రవ్వగా నెన్నియో విచిత్రరూపమైనజంతువులఅస్థిపంజరములు ఫాసిల్ (Fossil) రూపమున, అనగాశిలారూపమైపోయినట్టివి, లభించుచున్నవి.

## 113. జన్మమెత్తకపూర్వము ఆత్మలెట్టి యవస్థలోనుందురు?

నిర్మలచైతన్యదేశము నాశరహితముగావున నాదేశవాసులకు మరణము లేనేలేదు. సృష్టిలో ద్వితీయమహాఖండమైన బ్రహ్మాండములోకూడ భూలోకములోనున్నపద్ధతిగా మరణము లేదు. బ్రహ్మాండములోనివసించువారు చాలమంది మహాప్రళయమువఱకు జీవించుదురు. బ్రహ్మాండమునకు మహాప్రళయమువచ్చి అది నశించినపుడచ్చటిజీవులు రచనకుముందున్నయవస్థలోనికి మాఱిపోయి తిరిగి బ్రహ్మాండమునకు పునస్సృష్టియైనపుడు జన్మించుదురు. బ్రహ్మాండములోని జీవులెవరైనను పిండదేశమునకువచ్చినపుడు వారలకు మృత్యుసమయములో కలిగెడిమార్పువంటిమార్పు కలుగదు. అయినను, అట్టిసమయములో మానవునికి పుట్టకపూర్వమెట్టియవస్థయుండునో, అట్టియవస్థలోనే వారుకూడా ఉండవలసియుండును. ఈయవస్థ అనగా మాయభిప్రాయము జన్మమెత్తెడి ప్రతిజీవుడును జన్మించకముందుధరించవలసిన చైతన్యసమాధిఅవస్థయనికాని, గర్భవాసావస్థయని కాదు.

శిశువు తల్లిగర్భములోనున్నంతకాలము శ్వాసతీసికొనదనియు, గర్భమునుండిబయటపడిన పిమ్మటనే శ్వాసతీసికొనుట ప్రారంభించుననియు, నందఱకును తెలిసినవిషయమే. గర్భవాససమయములో శిశుపోషణము తల్లిరక్తము వలన జరుగుచుండును. కాబట్టి గర్భస్థశిశువుయొక్క శరీరనిర్మాణకార్యమంతయు తల్లియొక్కరక్తే జరిగించుచుండును. ఆశరీరమును ముందుధరించవలసియున్నజీవునకు గర్భవాససమయములో, నాశరీరముతో బహుదూరపు సంబంధము మాత్రమే యుండును. శ్వాసహీనమైన యీగర్భావస్థను మూర్ఛావస్థతో పోల్చవచ్చును. మూర్ఛితజీవునకు తనశరీరముతో సంబంధము ఒక అతి సూక్ష్మచైతన్యతంతువుద్వారానే నిల్చియుండును కాని చాలమట్టు కతడుమృతజీవునివలెనే శరీరముతో సంబంధము లేకుండనుండును. జన్మకు పూర్వము జీవుడుండెడి ఈయవస్థను చైతన్యసమాధియందురు. మనుష్యశరీరమును ధరించవలసినజీవుడీసమాధిలోనున్నపుడు జ్యోతిర్నారాయణస్థానమున నుండును. ఏలననగా, మానవునిఆత్మ శరీరములోనిఆజ్ఞచక్రస్థానములో నివాసముచేయును. కావున ఆత్మకు మృత్యుసమయములో శరీరముతో సంబంధవిచ్ఛిత్తి, అది ఆజ్ఞచక్రము దాటి బ్రహ్మాండములోనేదైననొకస్థానమువఱకు వెళ్ళిననేగాని, కలుగనేరదు. అయితే, బ్రహ్మాండదేశముయొక్క క్రింది మూడులోకములలోను అధోముఖ

ప్రవాహవేగ మతితీవ్రముగనుండుటచే ఆలోకము లట్టిసమాధిధరించుటకు తగి
నవి కానందున మానవజన్మ ధరించవలసిన జీవునియునికికి బ్రహ్మాండములో
క్రిందిమూడులోకములకన్న నెక్కువ నిలకడగల జ్యోతిర్లోకమే యోగ్యతర
ముగ నుండును. మానవజీవుడు శరీరత్యాగము చేసినపుడు కూడ జ్యోతికభిముఖ
ముగ నాకర్షింపబడును. ఈవిషయమును గురించి ముందు ప్రసంగములో
సవిస్తరముగ చెప్పెదము,

పిండదేశముయొక్క ప్రళయములు బ్రహ్మాండదేశముకన్న నెక్కువ
తఱచుగగల్గుచుండును. దీనినిబట్టి, రచనలోని తక్కువచైతన్యముగల దేశము
లలో నచ్చటిచైతన్యలోపమును పూరించుకొనునిమిత్తమై సవరణలు మార్పు
లును, ఉత్తమచైతన్యదేశములలోకన్న నెక్కువతఱచుగా చేయవలసివచ్చు
చుండునని సహజముగా తేటపడుచున్నది. ఆకారణమువలననే పిండదేశనివాసులకు
తఱచుగ మరణముపొందవలసిన యావశ్యకత గలుగుచున్నది. అందుచే నీపిండ
దేశము మృత్యులోకమనిగూడ పేర్కొనబడుచున్నది.

## 114. మానవునకు మృత్యువుకలిగెడి విధము.

జీవునకి మృత్యువుకలుగవలెనన్నచో ఆజీవుడు పిండదేశములో ధరించు
కొనియున్న, స్థూలములు సూక్ష్మములునగు మాయికకోశములన్నియు నశించి
పోవలసియున్నది. కావున, ఏజీవుని ఆత్మస్థానము పిండదేశ శిఖరస్థానమునకు
అనుగుణ్యముగ నుండునో, అట్టిజీవునికి, ఆమాయికకోశములనుండి విచ్ఛిత్తి
గలుగునిమిత్తము అతని ఆత్మ బ్రహ్మాండదేశములోని కాకర్షింపబడవలసి
యుండునని విశదమగుచున్నది. మరణమునకుత్తరువనతగినట్టి ఆయాకర్షణ
నారాయణుడు (అనగా నిరంజనుడు) అధిపతిగాగల సహస్రదళకమలమునుండి
వచ్చును. ఇందువలన ఈనిరంజనపురుషుడు బ్రహ్మాండాధిపతియైన బ్రహ్మ
యొక్క రూపములలో నన్నిటికన్న తక్కువ తరగతి రూపము (విరాట్స్వరూ
పము) అగుటయేకాక, కాలపురుషుడుకూడనైయున్నాడు. బ్రహ్మాండములోని
క్రింది మూడుస్థానములగు విష్ణు, బ్రహ్మ శివులలోకములు వానికి ఛాయా
రూపములైన మానవశరీరములోని నాభి, ఇంద్రియ, మూలాధార
చక్రములవలెనే బ్రహ్మాండదేశములోని క్రిందిభాగముయొక్క మాయిక
రచనను సంరక్షించుకార్యము నెఱవేర్చుటలోనే యెక్కువగా లగ్నమైయున్నవి.
అందుచే నీమూడింటికిని స్థిత్యుత్పత్తులును, ఆరెండువనుల్లకు బాధకరమైనట్టి

నిరుపయోగపదార్థమును బహిష్కరించుటయును అనెడి మూడుపనులే ప్రధానమైన కృత్యములని తేటపడుచున్నది. కావున నాలోకాధీశులకు మానవశరీరనాశమునిమిత్త మాజ్ఞనిచ్చుటకుగాని, అట్టియాజ్ఞను నెఱవేర్చుటకుగాని యధికారములేదు. జ్యోతిర్నారాయణులు బ్రహ్మాండీమనస్సు (అనగా బ్రహ్మాండమునకు సంబంధించిన మనస్సు) బ్రహ్మాండీయిచ్ఛయునైయుండుటచేతను, వారే జీవులభాగ్యములను నిశ్చయించి నియామకముచేయువారగుటవలనను, పైనచెప్పినఆజ్ఞను వారేజారీచేయుదురు. విశ్వసృష్టికి సూక్ష్మప్రతిబింబమైన మానవశరీరములో ప్రతికార్యముకూడ అదేవిధముగా వ్యక్తిగతమనస్సుయొక్కయు, వ్యక్తిగతేచ్ఛయొక్కయు ఆజ్ఞలననుసరించియే జరుగుచున్నది.

సత్యలోకమునుండి బయల్వెడలిన ప్రథమధారయగు కాలునిధార యున్నతతరగతిశక్తిచే పూరితమైయున్నను, దానిలో రచనాత్మకశక్తి శూన్యముగనుండుననియు రెండవధారయైన ఆద్యాధార నిర్మలచైతన్యదేశపు సురత్ధారయొక్క శాఖయగుటచే దానికి కేంద్రనిర్మాణశక్తియుండెననియు 92. వ. ప్రసంగములో చెప్పియుంటిమి. అందువలన ప్రథమధారయగుకాలునిధార జీవునియొక్క మాయికకోశములను నాశముచేయుయేర్పాట్లు చేయును. రెండవధార గుప్తమైయున్నబీజములకు మొలకలెత్తివృద్ధినొందుటకుతగిన చైతన్యము నొసంగును. ఆకారణముచే మరణసమయమున సహస్రదళకమలమునుండి ముందుగా ఒకసంహారకార్యకర్తయగుధార ప్రకటమై మానవునిమాయికకోశములనన్నిటిని నాశనముచేయగా, పిమ్మట మరొకధారవచ్చి ఆత్మసూర్ధ్యముగ తనసమక్షమునకు లాగికొనును. యమధర్మరాజు అనిపేర్కొనబడు దేవతయొకరు తృతీయనేత్రస్థానమువద్దనుండి పైనుదహరించినప్రకారము కాలపురుషునిఆజ్ఞలను నెఱవేర్చును. కాలునిధార తనసంహారకార్యము నేకేంద్రముద్వారా నెఱవేర్చుకొనునో, అట్టికేంద్రమునే యమధర్మరాజు అని యందురన్నచో నెక్కువశాస్త్రీయముగనుండును.

పైనచెప్పినపద్ధతిని స్థూలశరీరమునశించిపోగా జీవునియొక్క స్థూలమైన మాయికకోశములుమాత్రమే తొలగిపోవును. కాని అతనిమనస్సుపైనను, ఇచ్ఛలపైనను అందుమూలమున నెట్టిప్రభావమును కలుగనేరదు. ఏలననగా అతనిమనస్సుస్వయముగ నాకాలపురుషునిఅంశమే కావున బ్రహ్మాండమువైపున కాకర్షణగలిగినపుడు అతనిమనస్సు సకలసూక్ష్మవాసనలు సూక్ష్మేంద్రియములున్న

జీవునితోకూడ పైకివెళ్ళిపోవును. ఇవన్నియు ప్రాపంచికభావములు కోరికల తోను నిండియుండినపుడు, ఐహికమోహములు ఐహికబంధనలును మనస్సు లోలోపలనుండి తొలగింపబడకుండ నుండిపోయినచో అవన్నియు నాత్మకు మహా భారముగలిగించుటచే, బ్రహ్మాండప్రవేశద్వారముగుండ పోవుటలో జీవునికి మహా శ్రమగలుగును. ఏలననగా, బ్రహ్మాండప్రవేశద్వార మత్యంతసూక్ష్మరంధ్రము అగుటచే దానిద్వారాపోగల్గుటకు జీవుడు మిక్కిలిసూక్ష్మమైనస్థితిలో నుండ వలయును. జీవునకు మృత్యుసమయములోగలిగెడి ప్రథమదండనము ఈశ్రమయే. జీవునిపై నుండి పాపకర్మలభారము చాలవఱకు ఈదండనమూలమున తొలగి పోవును కాని, బ్రహ్మాండములో నతడు శాశ్వతముగనుండిపోగల్గునంతటి నైర్మ ల్యముమాత్రము చేకూరదు. ఏలననగా, సంసారికమోహాదుల మహాసూక్ష్మ బీజములు జీవునితోకలిసి బ్రహ్మాండములోనికి ప్రవేశించును. బ్రహ్మాండములో ప్రవేశించగనే జీవునికి జ్యోతిర్దర్శనమగును. అయితే పిండదేశపు మోహబీజ ములు అతనిలోనశించిపోకుండినచో నత డచ్చట చాలకాలముండలేడు. అతని లోని సాంసారికవాసనాబీజములు జ్యోతియొక్క చైతన్యప్రకాశముచే వెంటనే సజీవములై వృద్ధినొందనారంభించి, సృష్టినియమములప్రకారము బ్రహ్మాండములో నవి నివాసముచేయుటకుతగినవికావుకావున, క్రిందికి మహావేగముతో త్రోసి వేయబడును. ఆదెబ్బకు జీవుడు, తనప్రాపంచికవాసనలు ఇచ్ఛలు మనస్సుతోను సమేతముగా బ్రహ్మాండమునకు అడుగుననున్న ఒకపెద్ద మైదానములో పడి పోవును. అచ్చట నాజీవుడు స్మృతిలేకుండా నిశ్శబ్దముగా కొంతకాలము పడి యుండును. అట్లు కొంతకాలమైనపిదప, మృత్యుసమయమున యమధర్మరాజు ఇచ్చిన ఆజ్ఞానుసారముగా, తిరిగి ఆజీవునికి జన్మగలుగును. పునర్జన్మలభించు నియ మములను గుఱించి, యీ గ్రంథముయొక్క కర్మభాగములో వివరించెదము.

## 115. నిమ్నతరగతిజీవుల మృత్యునియమము.

పైప్రసంగములో వర్ణించిన మృత్యుపద్ధతి మానవులకుమాత్రమే వర్తిం చును. మిగతజీవులవిషయములో, ఆయాయాత్మల నివాసస్థానములనుబట్టి, వారలమృత్యునియమములలో కొంతవ్యత్యాసముండును. పృథివిలోని పశువర్గ ములలోకొన్నికొన్ని దేహములును, పృథివికిక్రిందనున్నయుల్లోకములలోని రచన యును, మహాతుచ్ఛముగనుండుటచే వానికి మరణముగల్గునిమిత్తమై ఆఆత్మలను బ్రహ్మాండమున కాకర్షింప నావశ్యకములేదు. ఈనీచజీవులకు నాడాయణ్నాని

ఘాయమైన శివుడు లేక పశుపతి యనిపేర్కొనబడు, పిండదేశములోని చతుర్థస్థానాధిపతియే, తనతోకూడనున్న జ్యోతియొక్క ఛాయసహాయముతో జ్యోతిర్నిరాయణములు జరిగించెడి పద్ధతినే మరణము గలుగజేయును.

## 116. మానవశరీరధారణమునకు యోగ్యులగు జీవుల మృత్యువు.

ఊర్ధ్వముఖధారమీదుగ నుత్తమవర్గములలోనికి ఆరోహించుచున్న జీవులకు, వారు భావిజన్మమున మానవశరీరమును ధరింపనర్హతగల స్థితికి వచ్చినపుడు, మరణము మహలోకవిధముగాగల్గును. అట్టివారిఆత్మలు మరణానంతరము బ్రహ్మాండమునకాకర్షింపబడి, మనుష్యశరీరమును ధరించుటకుముందుగా అవలంబించవలసిన చైతన్యసమాధ్యవస్థలో ప్రవేశపెట్టబడును. పిండదేశము యొక్క సూర్యచంద్రలోకములలోని ఆత్మలు మరణానంతరము బ్రహ్మాండమునకాకర్షింపబడి, తగిన సమాధ్యవస్థధరించినపిదప భూలోకమునజన్మనొందుదురు.

## 117. ఆత్మశక్తికిని, భౌతికశక్తులకునుగల విరోధము.

పిండదేశములోని సకలభౌతికశక్తులయొక్క గతియు చైతన్యశక్తియొక్క గతికి ప్రతికూలముగనుండుటచే, నాత్మకు పిండదేశములో ప్రతిరోధమెక్కువ ప్రబలముగ నుండును. భౌతికశక్తులప్రవాహము న్యూనాంగధ్రువమువైపునకు పోవుచుండును. చైతన్యశక్తియొక్క సహజప్రవృత్తి (ఈప్రవృత్తి ప్రతిజీవుని లోలోపలనుండును) నిర్మలచైతన్యధామమువైపునకు, అనగా విశేషాంగము వైపున కుండును. కొంతకాలమువఱకు భౌతికశక్తులపైన చైతన్యశక్తియే విజయముపొందుచుండును. కాని, చిట్టచివరకు, చైతన్యశక్తిపైన భౌతికశక్తులకే విజయముసేకూరి, ఆత్మ తననివాసమునిమిత్తమై రచించుకొన్న స్థూలశరీరము తనకు వసతియోగ్యముకాకుండునంత యధికముగా చెడిపోవును. అట్టి పరిస్థితి కలిగినపుడు కాలునిధార 114 వ. ప్రసంగము లోచెప్పినట్లు క్రిందికివచ్చి స్థూలశరీరమును నాశనముచేయును.

## 118, పునర్జన్మయుద్దేశ్య మేమి.

పైనుదహరించినవిధమున శరీరము నశించుటచే జీవునికి సాంసారిక వాసనలు, ప్రవృత్తులును తొలగిపోనేరవని గ్రహించవలెను, దేహపతనానంతర

ముందు తిరిగి జీవుడు తనవాసనలకు సంబంధించినస్థానాలమండలములపైపునకు ఆకర్షింపబడి, అచ్చట తనవాసనలన్నిటిలో బలవత్తమమైనవాసన కనుగుణమైన లక్షణములుగల యోనిలో జన్మించును. ఇట్లొకయోనినుండి మఱొకయోని లోనికిమాఱుచు జన్మలెత్తుచుండుటకు పునర్జన్మ యనిపేరు. పిండబ్రహ్మాండము లలోనున్నశక్తులన్నియు మహావేగముతో న్యూనాంగధ్రువముపైపునకే ప్రవహించుచున్నందున, ఈదేశములనుండి విముక్తి సంపాదించుకొనుటకై జీవుని యొక్క స్వప్రయత్నములెవ్వియు నెందుకు పనికిరావు. 107 వ ప్రసంగములో వివరించిన సృష్టినియమానుసారము, జీవుడు పైకి కొంతవఱకెక్కిన నెక్క వచ్చును, కాని అతనికి యథార్థమైన ముక్తి,నిజమైన సంతసద్గురువు లభించి వారి సహాయముతో నిర్మలచైతన్యదేశములోనికి ప్రవేశము కలుగజేయగల యాధ్యాత్మికసాధనలను నియమప్రకారమభ్యాసముచేసినపుడే లభ్యముకాగలదు. రచనారంభమునుండియు,నాత్మయొక్క శరీరములనుగుఱించియు ఇతరవిషయములనుగుఱించియు యేర్పాట్లు ఏపద్ధతులునియమములననుసరించి జరుగుచున్నవో, ఆనియమములు పద్ధతులనుగుఱించి యీగ్రంథముయొక్క కర్మభాగములో నెక్కువ విశదముగావివరించెదము.

నిర్మలచైతన్యదేశమును అందలినివాసులును జరామరణరహితులు కావున, అనగా, వారిలో నెట్టివృద్ధి క్షయరూపమైన మార్పులుకాని, మృత్యువు కాని కలుగనేరవు కావున, నాదేశపు వ్యవస్థలో పునర్జన్మకు తావేలేదు. జీవులకు మాయాదాస్యమునుండియు మనోదాస్యమునుండియు విముక్తిగలుగజేయు నిమిత్తమును, అధోలోకములసృష్టిలోచైతన్యమున కభివృద్ధిగలుగజేయు మహాదయతోను, నిర్మలచైతన్యదేశమునుండి సంతుఆత్మలు పిండబ్రహ్మాండదేశములలోనికి వచ్చుచుందురని యింతకుముందు చెప్పియుంటిమి. కాని, సంతుఆత్మ లట్లువచ్చుచుండుట సాధారణమైన పునర్జన్మనియమానుసారము కాదు. ఏలననగా, ప్రపంచమున సంతురూపమును ధరించినపిదపకూడ వారికి పరమపురుష రాధాస్వామీదయాళునితో సంబంధముగలుగునట్టి చైతన్యసూత్ర మెప్పటియట్ల అవిచ్ఛిన్నముగనే యుండిపోవును. సాధారణజీవులు, జన్మయెత్తగనే, తమ పూర్వజన్మవిషయములను, పూర్వజన్మబంధుత్వములను సామాన్యముగ మఱచిపోవుదురు. అయినను కొంతమందికి పూర్వజన్మలోని విషయములు కొన్ని జ్ఞాపకమున్నట్లు స్పష్టముగారుజువుచేసెడి విశ్వాసపాత్రమైన నిదర్శనములుకూడా యుండుచునేయున్నవి. వైజ్ఞానిక శాస్త్రపద్ధతిని పరిశోధన

చేయునిమిత్తమై అట్టివృత్తాంతములు చాలాఉపయోగకరముగ నుండును. అట్టినిదర్శనములను వెదికి తెలిసికొని పరిశీలనచేసినపిదప నీవిషయము నొక వైజ్ఞానిక సిద్ధాంతరూపమున శాశ్వతముగ స్థిరపఱచుట చాలబాగుగనుండును. ఈవిషయమును పరిశోధనచేయుటచే చైతన్యశక్తిధర్మములవిషయములో చాలరహస్యములు బయలుపడుటయేగాక, పునర్జన్మ సిద్ధాంతమునుగుఱించి ఒక రూఢియైన ప్రత్యక్షప్రమాణముకూడా లభ్యమగును. ఇంతకుపూర్వము పిండ బ్రహ్మాండముల రచనాప్రబంధమునుగుఱించి చెప్పిన విషయములనుబట్టి ఈసిద్ధాంతమును సమర్థించుటకు చాలా ఉపపత్తులు నిస్సంశయముగా లభించగలవుకాని పైనుదహరించిన ప్రత్యక్షప్రమాణము సిద్ధించినచో నెక్కువ నమ్మకముగా నుండును.

బ్రహ్మాండ దేశములో పిండ దేశములోనున్నట్లు శరీరములను పదేపదే మార్చవలసినపని లేదు. పునర్జన్మయుద్దేశ్యమేమనగా :

(i) జీవులకు క్రొత్త శరీరమును ధరించినపుడెల్ల కొంతనూతన చైతన్యము లభింపచేయుటయు,

(ii) జీవులకు మధ్యమధ్య నిజమైనసంస్కరణగల్గుటకు సావకాశమును చేకూర్చుటయు,

(iii) జీవులు తమదుష్కర్మలఫలితములను స్వానుభవముచే తెలిసికొనుటయు,

(iv) నీచదేశములో నివాసహేతువుమూలమున జీవులశిరమున అనివార్యముగాపడునట్టి మాయికబంధనముల భారమును, తిరిగి తిరిగి వారు మృత్యువేదనాభయము సహించుకొనుటవలనను దుఃఖక్లేశముల బాధలను అనుభవించుట మూలముననను, కొంతవఱకు నశింపజేయుటయును.

## 119. జీవితములో నాలుగు అవస్థలు.

సమస్తజంతుకోటికిని, అందులోప్రధానముగ మానవులకు, జీవితము నాలుగుప్రధానభాగములుగా విభజింపబడినట్లందఱకు తెలియును. పుట్టినది మొదలు యౌవనారంభమువఱకునుగల యవస్థ అందులో మొట్టమొదటి భాగము. జీవునికి ఈకాలములోనుండు ముఖ్యలక్షణములు సహజోల్లాసము,

చింతావిచారరాహిత్యము, స్త్రీపురుషభావశూన్యతయును. పైపైనఅసాధారణ పరిస్థితులలోదప్ప జీవులకు సామాన్యముగ నీయవస్థలోనున్నపుడు నిష్పాప సుఖశాంతులయానందానుభవమే గల్గుచు, అతిస్వల్పవిషయములుగూడ నానంద దాయకమైయుండును. ఈయవస్థాకాలములో మానవునకు సమాధ్యవస్థలోనికిని, హిప్నాటిజమ్‌యొక్క (Hypnotism) నిద్రావస్థలోనికిని సులువుగ ప్రవేశించగల శక్తి మిగత అవస్థాసమయములలోకన్న నెక్కువగ నుండును. జీవితముయొక్క ద్వితీయావస్థ యౌవనముప్రారంభమైనదిమొదల్కొని జీవితముయొక్కక్షీణదశ ప్రారంభమగువఱకునుండును. మొకటి రెండుదశలనుకలిసి జీవితముయొక్కవర్ధమానదశయని చెప్పవచ్చును. ఈవర్ధమానదశవలెనే జీవితముయొక్కక్షీణ దశనుకూడ రెండుభాగములుగా విభజింపవచ్చును. అవెవ్వియనగా, (1) మొదటిది జీవితక్షైణ్యముయొక్క ప్రభావము ఎక్కువగపైకి తెలియకుండా యౌవన శక్తులన్నియు బాగుగ సేవచేయుచుండిన దశ. (ii) రెండవది స్థూలశరీరము విస్పష్టముగకృశించిపోవుటయు యౌవనశక్తులు ఉడిగిపోవుటయు ముఖ్యలక్షములుగాగల వార్ధక్యదశ. యౌవనావస్థలో కోరికలు,ఉత్సాహములును, మహావేశపూరితమై తీవ్రముగనుండును. యౌవనోత్సాహ మెట్టికష్టములను ఆటంకములనైనను సరకుసేయదు, ఏదైననొకవిరుద్ధపరిస్థితి తనశరీరముమీదికివచ్చిపడినను యౌవనముయొక్క ఉత్సాహశక్తిమూలమున చిత్తమునకు వెంటనేస్థైర్యముచేకూరును.ఇవ్విధముగాయౌవనదశలో మానవునిజీవిత మించుమించుఆనందమగ్నతలో గడచిపోవును. తృతీయావస్థాకాలములో యౌవనావేశముచల్లాఱి, దానిస్థానే, విచక్షణశీలతయు ననుభవజ్ఞానమును అంకురించి ఉదారబుద్ధియు, స్వతంత్రాలోచనశక్తియు ప్రకటముకానారంభించును. సామాన్యముగ జనులకీయవస్థలోనే తమతమయుద్యోగవ్యాపారములలో జయముచేకూరుటయు,గౌరవైశ్వర్యప్రతిష్ఠలు లభించుటయు జరుగుచుండును,జీవితములో చతుర్థావస్థయగు కడపటియవస్థ తిరిగివచ్చినబాల్యదశవలెనేయుండును.కాని జీవితమును సద్వృత్తిగను, ఆహారవ్యవహారములలో మితముతప్పకుండగను గడిపియుండినయెడల నీ చతుర్థావస్థలోగూడ నొకవిధమగు ప్రత్యేకానందము లేకపోలేదు.ఈయవస్థలో బాల్యముయొక్కనిష్పాపసుఖములొక్కటేగాక వివేకానుభవముల కోమలానందముగూడ గలుగును. ఈసమయములో శరీరశక్తులన్నియు చాలతొందరగా ఉడిగిపోవుచుండుటచే శరీరమంతయు నీరసమైపోయి చాల చిన్నవిషయములకు కూడా శరీరముపైన మిక్కిలిఅధికప్రభావము కలుగుచుండును,రోగములుకూడా

ఈకాలములో మొదుగవచ్చుచుండును. కాని పారమార్థికదృష్ట్యా యీశక్తుల యుదుగుదల యధికలాభదాయకమే. ఏలననగా, నీయుదుగుదలమూలమున నాత్మశక్తి తృతీయనేత్రముపైవునకు(దీనిని దాటిపోయిన పిమ్మటనే మరణము గలుగును) ప్రవహించుటకనుకూలపరిస్థితు లేర్పడి, తనయిచ్ఛవచ్చినపు డెల్ల తృతీయనేత్రిద్వారమున ప్రవేశించునట్టిసాధన నభ్యాసము చేయుటలో చాలసహాయముచేకూరును. జీవితముయొక్క నాలుగవస్థలనుగురించి పైన చెప్పినదంతయు మానవజీవితమునే ప్రధానాదర్శముగతీసికొని చెప్పితిమి. అయినను, ఇతరజంతువులపరిస్థితికూడ నట్లేయుండును. అయితే, ప్రకృతివలన గలిగెడివిపత్తులమూలమునను, అసాధారణసంఘటనలవలనను కొంతవఱకు హెచ్చుతగ్గులుండుటకు సావకాశమున్నది.

## 120. జీవులకువలెనే సృష్టికిగూడ నాలుగవస్థలుగలవు.

ఈసృష్టియంతయు, చైతన్యధారలమూలముననే ప్రకటమైనదిగనుకను, యీసృష్టిలో ప్రతిపదార్థమునకును ఆచైతన్యధారలే అనేకవిధములుగను అనేక తరహాలుగను శక్తినిచ్చుచున్నవికావునను,అల్పప్రపంచమగుమానవశరీరమునకు వలెనే అఖండప్రపంచముయొక్క వివిధఖండములకుగూడ నాలుగవస్థలుండునను కొనుట తప్పుకానేరదు. అయితే, మానవశరీరమున కీనాలుగవస్థలును చైతన్య ధారలవృద్ధిక్షయములమూలమున గల్గుచున్నవనికూడ సూచనగా తెల్పియుంటిమికదా:అందుచే,నీవిశ్వసృష్టిలోనీయవస్థాప్రకటనము,చైతన్యధారలవృద్ధిక్షయములకు సావకాశమున్న ఖండములలోమాత్రమే జరుగవలసియుండును. నిర్మల చైతన్యదేశమండలములలో సృష్టి నాశరహితమును నిర్వికారమునగుటచే, నచ్చట నీయవస్థలుగల్గుటకు తావులేదు. నిర్మలచైతన్యదేశముతరువాత బ్రహ్మాండపిండదేశములున్నవి. బ్రహ్మాండము మహాప్రళయకాలము లోనే క్షయవికారములనొందునుకావునను, మహాప్రళయ మూహింపశక్యము కానంత మహాదీర్ఘకాలానంతరమే సంభవించుచుండునుకావునను, యీనాల్గు అవస్థలును బ్రహ్మాండములోకూడా అంతయెక్కువగా వ్యక్తముకానేరవు.

## 121. చతుర్యుగముల వర్ణనము.

పైనచెప్పిననాల్గవస్థలును, ప్రళయములు తఱుచుగాగలుగునట్టి తృతీయ మహాఖండమగు పిండదేశములో నెక్కువప్రకటరూపమున కానవచ్చును. ఈ

నాలుగవస్థలనే నాలుగుయుగములని చెప్పుచున్నారు. సత్యయుగము (కృత యుగము) త్రేతాయుగము ద్వాపరయుగము, కలియుగము అని ఈనాల్గుయుగములపేర్లు. ఈనాల్గుయుగములలో మానవశరీరముయొక్క నాల్గవస్థలలోవలెనే పిండదేశములో వేర్వేరుపరిస్థితులు గల్గుచుండును. సత్యయుగములో రచనాత్మకధార, పిండదేశమునకది అప్పుడే క్రొత్తగా దిగివచ్చినందున, సంపూర్ణముగా చైతన్యపూరితమైయుండెను. అందుచే నీ చేతనాచేతనాత్మకమైనయావత్సృష్టియు నాధారయొక్క మహాచైతన్యముతో పూరితమై, ప్రఫుల్లతాభివృద్ధుల కున్ముఖమై యుండెను. అప్పటిజీవులపైన శీతోష్ణములదుష్ప్రభావము తక్కువగనుండి జీవులందరు నత్యంతసంతుష్టులై సుఖముగ నుండెడివారు. అక్కాలమున శారీరికదుఃఖములు, రోగములు, దుష్కర్మలు, దురాలోచనలు, అహంకార గర్వములు నించుమించు లేనట్లే యుండెడివి. మానవులేమి జంతువులేమి అందరును పూర్ణారోగ్యవంతమైనశరీరములతో జీవితసుఖమును పూర్తిగ ననుభవించుచు బహుశాంతియుతజీవనములను గడుపుచుండిరి. ఆకాలములో జీవులకు మరణము పరిపూర్ణవార్ధక్యముగలిగినపిమ్మటనే సంభవించెడిది. అపుడు వారు పండినపండ్లు చెట్లనుండి సహజముగ రాలిపోయినట్లు చాలవృద్ధాప్యమువచ్చిన పిమ్మట నేశ్రమయు లేకుండగనే శరీరములను విడిచిపెట్టుచుండెడివారు అప్పటి వారికి ఆయుఃప్రమాణముకూడ నిప్పటికన్న మహాదీర్ఘముగనుండెడిది. వారు తమచిత్తశుద్ధి విశిష్టచేతనతలమూలమున నప్పుడప్పుడు అతిసులభముగ నూర్ధ్వసూక్ష్మమండలములకు వెళ్ళి తమపూర్వులతో కలసికొనుచుండెడివారు. సత్యయుగప్రమాణముగూడ తక్కినయుగములకంటె చాలయధికముగనుండెను. ఆకాలములో పిండదేశనివాసులు సృష్టిచేయుటలోనంతర్గతమైన మహోదయ యొక్క మహానందమును ననుభవించెడివారు. పిండదేశముకన్న బ్రహ్మాండదేశము యొక్కమహాశోభ అగణితగుణితముగా హెచ్చుగనుండుటచే బ్రహ్మాండదేశ వాసులయానందాతిశయము అసలేవర్ణనాతీతము. రెండవయుగమైన త్రేతా యుగములోగూడ పరిస్థితులించుమించు సత్యయుగములోవలెనేయుండి జీవిత మత్యంతసుఖశాంతులతో గడచిపోయెడిది. అయినను, అధోముఖధారయొక్క ప్రభావము దట్టముగా ప్రకటమైనందున నది కొంతవరకు సుఖశాంతులకు ఆటంకముకలుగజేయుచుండెను. కాని శ్రీరామచంద్రుడు ఆ ధారయొక్క ప్రభావము తొలగించునిమిత్తమైయే అవతారమెత్తెను. ద్వాపరయుగములో జీవితానందమునకు విఘ్నకారకపరిస్థితులు ఇంకనెక్కువగ నభివృద్ధినొందినందున

వాని ప్రభావమును తొలగించునిమిత్తము బ్రహ్మాండదేశవుటవతారపురుషులలో సర్వోత్తమావతారమైన శ్రీకృష్ణభగవానుడీభూమియందవతరించెను. కాబట్టి పైనచెప్పినవిషయములనుబట్టి జీవులకీమూడుయుగములలోను, పిండదేశములో జీవనమొక మహావరప్రసాదముగనుండెననియు, అందునుగురించి యాక్షేపణ చేయుటకెట్టిసావకాశములేకుండెననియు చెప్పవచ్చును. పిండదేశముయొక్క ఆయుఃప్రమాణములో 7/8 వ భాగముకన్న నెక్కువకాలము ఈమూడు యుగములలోనే గడచిపోయెను.

## 122. కలియుగము - అందలియాపత్కష్టములు - జగదుద్ధారముయొక్క మహోదయు.

110. వ. ప్రసంగములో సంతుమహాత్ముల శుభాగమనసమయమును గురించి చెప్పినసిద్ధాంతమునుబట్టి. కొంతకాలముక్రితమే చతుర్థయుగమారంభ మైనదని తెలిసికొనదగును. భూకంపములుతఱుచుగల్గుచుండుటయు, ప్రాణహాని ధననష్టములనుకలుగజేయు మహాదుర్ఘటనలు హెచ్చుగాతటస్థించుచుండుటయు పైగుమున్నగు మహాభయానకములు ప్రాణాంతకములునైన అంటువ్యాధులు ప్రబలముగవ్యాపించుచుండుటయు, క్షామములు త్వరత్వరగావచ్చుచు ఆహార సమృద్ధినశించి లక్షలాదిజీవులు నిరాహారతాదారిద్ర్యరూపమైన హృదయ విదారకభయానకమహావిపత్తులలో చిక్కుకొనిపోవుచుండుటయు, పూర్వము కన్న నెక్కువతఱచుగా సూర్యమండలములో మహాసంక్షోభములుగల్గుచుండు టయు, మున్నగువిషయములన్నియు మనపిండదేశము నాల్గవయవస్థయగు వృద్ధావ్యదశలోనికి వచ్చినట్లు స్పష్టముగా విశదీకరించుచున్నవి. భూలోకము లోని వెవ్వేఱుభాగముల శీతోష్ణస్థితు లాయాభాగములలో నివసించు మాన వులయొక్కయు నితరజంతువులయొక్కయు శరీరవికృతిమీదను, శరీరాకార ముమీదను, వారలయులవాట్లపైనను ఎట్లుమహాప్రభావముచూపునో అటులనే కలియుగముయొక్క ప్రత్యేకపరిస్థితులుగూడ పిండదేశములో సమస్తచేతనా చేతనాత్మకసృష్టిపైనను వానిప్రభావము చూపుచుండును. పిండదేశముయొక్క ప్రధానచైతన్యధార బ్రహ్మాండముపైపున కాకర్షించబడిపోయినందున పిండ దేశముయొక్క శరీరమునకు అనగాస్థూలభాగమునకు గల్గుచున్నరుగ్ణతలును కృశత్వావస్థయే ప్రస్తుతకాలమున జీవులకుగల్గుచుండిన యాపత్తులకును కష్టములకును కారణము, అయినను పరమార్థదృష్టికోణమునుబట్టి చూచినచో

కలియుగకాలము ఉత్తమతరగతి యాధ్యాత్మికసాధనల నభ్యాసముచేయుటకు మహోన్నతకాలసమయము. ఏలననగా, పిండ బ్రహ్మాండములు రెండుదేశములు, నిక్కాలమున నిర్మలచైతన్యదేశమునకు నికటతమసాన్నిధ్యమున నుండును. పైనుదహరించిన ఆపత్కష్టము లింకను కొంతకాలమువఱకు నిప్పటికన్న నెక్కువతీవ్రముగనే సంభవించవచ్చునుకాని, సంతుమహాత్ములయవతరణ మహత్త్వముచే నాయాపత్కష్టముల అంతరంగికప్రభావము (అనగా జీవులనుభవించవలసినది) చాలమట్టుకు ఇంతకుముందే హ్రస్వముచేయబడెను. ఇంతియగాక నీదురవస్థలు కల్యాణకారకములుకూడ నైయున్నవి. ఏలననగా, యీకరవులు, అంటుజాడ్యములు, భూకంపములు, దుర్ఘటనలుమున్నగువానివలన జీవుల మనస్సున కొకపెద్దఅంకుశపుపోటు తగిలి అనగా ఒక ఆటంకముగలిగి, ఈఆపత్తులలోచిక్కుగొనిపోయినవారి కీ ప్రపంచములో నెట్టిసహాయము దొరకక పోవుటవలనకాని, లేక, దొరికినసహాయము నిరుపయోగముగనుండిపోయినందునకాని, సహజముగా వారిదృష్టి సృష్టికర్తవైపునకు తిరుగును. ఇక నీయాపత్తులలో పడకుండా దాటిపోయినవారు తక్కినవారిపరిస్థితిని జూచికాని లేక వినికిడివలన తెలిసికొనికాని నిస్సంకోచముగా ప్రాపంచికధారతోగలిసి ప్రవహించిపోకుండా కొంతవఱకు పస్తాయించెదరు. మఱియు ప్రాపంచికానంద సౌఖ్యముల నాశమానస్వభావమును ప్రాపంచికజీవితముయొక్క నిస్సారతయు వారికి ప్రత్యక్షముగ కన్పించును. ఇట్టిభావములు ప్రపంచములో మహాఘోర బాధల ననుభవించినపిమ్మటనే జనించినను, అవి జీవులమనమున తమంతట తామే యుదయించినందున జీవునియంతరతమస్థానమున (పిండదేశపు చైతన్యధార పైకిలాగివేయబడియుండుటచే ఈయూర్ధ్వాకర్షణ దానిప్రభావమును అంతకుముందే జీవులఅంతరతమస్థానమున చూపుచుండును) కొంతసంచలనము గల్గించును. ప్రస్తుతకాలమున లోకములో ప్రతిదేశములోని ప్రజలలోప్రకటమగుచున్న పరమార్థాసక్తి అంతయు యీచైతన్యధారయొక్క యూర్ధ్వాకర్షణఫలితమే. మన మిక్కాలమున చూచుచున్న అద్భుతాధ్యాత్మికశక్తులయొక్కయు, అద్భుతపరిస్థితులయొక్కయు ప్రకటనమునకుగూడ నిదియే కారణము. మా సిద్ధాంతము ప్రకారము, కొద్దికాలములో నీ త్రిలోకి తిన్నగా చైతన్యదేశమునకెదురై పోగలదు అపుడు నిర్మలచైతన్యదేశముయొక్క చైతన్యధార యీ ప్రపంచములో మహాబలవత్తమమైపోయి, జీవులు ప్రస్తుతమనుభవించుచున్న ఆపత్కష్టములన్నియు

ఇప్పుడింతనిగూఢగుప్తముగనున్న యాధ్యాత్మికశక్తు లప్పుడు బాహుళ్యముగా ప్రకటమై అంతర్యాభ్యాస మిక్కువ శ్రమకష్టములు పడకుండగనే జయప్రదముగ సాగిపోవుచుండును. అభ్యాసిపురుషుల కాంతర్యమున నాధ్యాత్మికానుభవములు చాలయధికముగను తఱచుగను గల్గుచుండుటవలన జీవితకాలములోనే వారికి తమపరిపూర్ణోద్ధారమును గుఱించియు, తమకు నిర్మలచైతన్యధామమున నివాసప్రాప్తినిగుఱించియు నిస్సందేహమైన ప్రమాణములు లభించును. ఈవిధముగా పిండబ్రహ్మాండదేశములలోని జీవులకు ప్రబోధముగల్గించి చైతన్యాభివృద్ధినిగలుగజేయు ప్రబంధమంతయు పూర్తియైనపిమ్మటనే మహాప్రళయకాలము వచ్చును. కాని మహాప్రళయమురాకముందే పెక్కుజీవులు నిర్మలచైతన్యదేశముచేరుకొని యమరులైపోవుదురు. మహాప్రళయముసంభవించినపుడు శేషించినజీవులకును, పిండబ్రహ్మాండదేశములసృష్టికిని మహాలాభము సేకూరును. మహాప్రళయానంతరము పునస్సృష్టిప్రారంభమగును. అప్పుడుసృజింపబడు పిండబ్రహ్మాండదేశములకుగూడ చైతన్యలాభముగలుగజేయునిమిత్తమై దయామయమైన ప్రబంధము పూర్వమువలెనే తిరిగి చేయబడును.

## 123 సృష్టిలో భిన్నత్వమెట్లుగలిగెను.

ఈగ్రంథములో రచనారంభమునుగుఱించియు, రచనయొక్క పాలన పోషణప్రబంధమునుగుఱించియు వర్ణించినపుడు రచనోద్దేశ్యమునుగుఱించికూడ కొద్దికొద్దిగా కొన్నిచోట్లస్పష్టముగను, కొన్నిచోట్లసూచనారూపముగను, చెప్పబడినది. ఈఖండప్రతిపాదనలను క్రోడీకరించి, రచనచేయుటలోగల మహాదయామయోద్దేశ్యమునుగుఱించి సాకల్యముగ నొకేస్థలమునవర్ణింపబూనుకొనుటకుముందు, మఱొకవిషయమును అనగా, ఈరచనయావత్తును, చైతన్యశక్తిలో మొదటినుండియునున్నట్టి అనాదిన్యూనాధికభావము తీవ్రరూపముదాల్చుటమూలముననే ప్రకటమైనపుడు దీనిలో అసంఖ్యాకమైనభిన్నవర్గము లేలయేర్పడె ననువిషయమునుగురించి ఇచ్చటవిమర్శించుట యుక్తమనితోచుచున్నది.

న్యూనాధికభావమనగా చైతన్యశక్తి యొకవైపున ననంతాధిక్యములో నేకత్రితమైయుండి, రెండవవైపున మహాన్యూనతాదశలోనుండుపరిస్థితియే అని 77వ ప్రసంగములో చెప్పియుంటిమి. దీనినిబట్టి సృష్టిలో ప్రస్తుతమున్నదంతయు

కేవలము చైతన్యములో వెవ్వేఱుతరహాలహెచ్చుతగ్గుల ప్రకటనమే అనియు,
సృష్టిఅయినపిమ్మట అంతకుముందులేనట్టి అనేకచైతన్యతరగతులుమాత్రమే
యేర్పడినవికాని, మఱొక పదార్థమెద్దియు క్రొత్త ప్రవేశపెట్టబడలేదనియు,
పర్యవసానము తేలుచున్నది. రచనవిషయములో మాసిద్ధాంతము ఈరెండు
మాటలలోనే ఇమిడియున్నది. ఇపు డింక మామాటప్రకారము రచనలో
భిన్నవర్గములెట్లేర్పడెననువిషయమునుగుఱించి క్లుప్తముగా వివరించెదము.

అనాదిపరమపురుషుని యపారాత్మతత్వమని చెప్పదగిన చైతన్యశక్తి
యొక్క అపారవిశేషాంగమునకుగల పరిపూర్ణప్రకాశము, పరిపూర్ణసత్తా,
పరిపూర్ణానందము సంపూర్ణచేతనతతోను పోల్చినపుడు, న్యూనచైతన్యము
గల దేశములలోగల ప్రకాశసత్తానందచైతన్యములు అసంపూర్ణముగ
కన్పట్టుచుండెనని 81వ. ప్రసంగములో వివరించియుంటిమి. పరిపూర్ణతయొక్క
ప్రకటనముతోపోల్చిచూడగా అసంపూర్ణతనుండిప్రకటమైనట్టి లోపభూయిష్ఠ
మైన ఆకారములే చైతన్యముయొక్కతరగతులలో భేదముగల్గుటకు కారణ
భూతమైనవని తెలిసికొనదగును. మాయభిప్రాయమును స్పష్టపఱచుటకై
మేమిచ్చట మహాహీనచైతన్యవంతమగు న్యూనాంగధ్రువముయొక్క పరిస్థితిని
గుఱించి విమర్శించెదము. విశేషాంగముయొక్క మహాసంపూర్ణసత్తతో
పోల్చిచూచినచో నీన్యూనాంగధ్రువమంతయు నించుమించు సంపూర్ణజడ
పరిస్థితిలోనున్నట్లుండును. అందుచే నీరెండుధ్రువములసత్తాను (energy) బట్టి
యాలోచించగా విశేషాంగముయొక్కతరహా యొకకార్యకర్తవలెను సాక్షాత్తు
సృష్టికర్తవలెనుఉండి, న్యూనాంగము ఆసృష్టికర్త చేయుకార్యమున కవసరమైన
ముడిసరుకులువలె నుపయోగపడుచుండును. విశేషాంగముక్రిందనున్న చైతన్య
ఘట్టములన్నియు నిదేపరిస్థితిలోనున్నవి. జ్ఞానమును (Intelligence) బట్టి
ఆలోచించినను న్యూనాంగములో చైతన్యము మహాక్షీణముగనుండుటచే,విశే
షాంగముతోపోల్చినపుడు అది పూర్తిగ అజ్ఞానరూపముగను, అప్రబుద్ధముగను
ఉండి, దానిలో తనసొంతకార్యక్రమమునుసాగించుకొనుట కవసరమైననియమ
ముండుటతప్ప మఱొకజ్ఞానసూచన యెద్దియు కానరాదు. కాని విశేషాంగము
యొక్కపరిస్థితి దీనికిపూర్తిగభిన్నమైయున్నది. న్యూనాంగముయొక్క హీనాతి
హీనచైతన్యకిరణముగూడ సర్వజ్ఞుడైన పరమపురుషునికి, న్యూనాంగములోని
ఘోరాజ్ఞానదశనుగుఱించి తెలియజేయుటకుసరిపడుచున్నది. విశేషాంగమునకును
న్యూనాంగధ్రువమునకునుమధ్యన అనంతసంఖ్యాకమైనచైతన్యతరగతులున్నవి.
ఆతరగతులలో చైతన్యలోపముయొక్క పరిమాణమునుబట్టి జ్ఞానానందప్రకాశ
ములు మూడునుకూడా తగ్గిపోవుచురాగాచిట్టచివరకు, న్యూనాంగములో ఆనంద

ప్రకాశములకు విశుద్ధావస్థయైన దుఃఖాంధకారదశయొక్క ఆవత్తువచ్చిపడినది. అందుచేతనే న్యూనాంగధ్రువముయొక్క ధర్మములు జడత్వము, అజ్ఞానము, దుఃఖాంధకారములు నని నిర్ణయించబడుచున్నది. న్యూనాంగము స్వయముగ నప్రబుద్ధముగావున ఈపరిస్థితులజ్ఞానము దానికిలేదు. కాని, న్యూనాంగ దేశములో నివసించునట్టి ఆత్మాంశలకు తప్పకుండ నీన్యూనాంగధర్మముల జ్ఞాన ముండును. మఱియు నిదివఱలో చెప్పినట్లు న్యూనాంగములో నీపరిస్థితు లన్నియు నున్నట్లు ఆపరమపురుషునకు తెలిసియేయున్నది. పరమపురుషుని జ్ఞానము యథార్థజ్ఞానముకావునను, ఆత్మాంశలా పరమపురుషునియంశలేగావు నను, వారికీపరిస్థితులనుగుఱించిగలుగు జ్ఞానముకూడ ఆవిధమైనదే. అయినను ఆత్మాంశలజ్ఞానము పరిమితమై యల్పపరిమాణములో నుండుననుట నిశ్చయము. ఇందుపైన నెవరైనను ఒకవస్తువునుగుఱించిన నిషేధాత్మకవివరణము ఆవస్తువు యొక్క స్వాభావికలక్షణముల జ్ఞానమును కలుగజేయ జాలదని-అనగా, య్యేదైన నొక వస్తువునుగుఱించి తప్పటభిప్రాయము తొలగించుసందర్భములో దానిలో కొన్నిలక్షణములు లేనట్లుచెప్పినచో నందువలన నావస్తువుయొక్క వాస్తవ లక్షణములజ్ఞానము కలుగనేరదని—పూర్వపక్షము చేసినయెడల నాపూర్వ పక్షమిచ్చట వర్తించదనియే మాసమాధానము. ఏలననగా, మేము అస్పష్టత, కాంతిహీనత, అంధకారము మున్నగుపరిస్థితులనుగుఱించి చెప్పినపుడు, అవి కాంతియొక్క అభావము వెవ్వేఱుతరగతులుగ గల్గినందున ప్రకటమైనవని మాయభిప్రాయముకాదు. అవి కాంతితైక్ష్ణ్యము క్రమక్రమముగా తగ్గుచువచ్చి నపుడు గోచరించెడి యనుభవములని చెప్పుటయే మాఅభిప్రాయము. ఇదేప్రకా రము న్యూనాంగమునుగుఱించి పైనచెప్పిన విషయములు, చైతన్యశక్తిలో వివిధపరిమాణములతగ్గుదలవలనగలిగెడి యనుభవములవర్ణనమై యున్నది. ఇట్టి యనుభవములు యథార్థజ్ఞానమేఅగును.ఏలననగా, సాధారణజాగ్రదవస్థలో జీవున మీదపడునట్టిసంస్కారము లేకదా అతనికిజ్ఞానముకలిగించు సాధనములు.ఈసంస్కా రములకే "అనుభవము" లని పారిభాషికనామము. న్యూనాంగముయొక్క స్థూలతమఘట్టమునందుకూడ నెంతోకొంత చైతన్యము తప్పకయుండితీరును, కావున, ఆచైతన్యముయొక్క యవస్థానుభవమును నిషేధాత్మకజ్ఞానమని చెప్ప కూడదు. ఏలననగా, నిజమునకు ఈజ్ఞానము సృష్టిలోని నీరసతమచైతన్యము యొక్క యనుభవమే అనగా వాస్తవికజ్ఞానమేఅయియున్నది. ఈయను భవము పరపురుషుని జ్ఞానానుసారముగనే యున్నపుడు, దానివాస్తవికతను

యొక్క తనునుగుఱించి ప్రశ్నించుటకే సావకాశములేదు. కాబట్టి మాసిద్ధాంత ప్రకారము, రూపము, వర్ణము, ప్రకాశము, సత్తు, జ్ఞానము, ఆనందమువున్నగు వానిలో భిన్నత్వము వివిధతరగతులచైతన్యముచేగల్గినట్టి వివిధానుభవముల పర్యవసానమే యని తేలుచున్నది. ఇంతియగాక, ఈయనుభవజ్ఞానము జ్ఞేయపదార్థముల యథార్థస్థితినుండిభిన్నము కాదు. ఏలననగా, వస్తువులయథార్థస్థితి పరమపురుషునికి ఆవస్తువులవిషయమైగల్గిన అనుభవములోనే యున్నదికదా. 96, 97 వ ప్రసంగములలో మేమింద్రియజ్ఞానమునుగుఱించి చెప్పినసిద్ధాంతము సరియైనయెడల, మనకుగలిగెడి యనుభవములన్నియు, జ్ఞేయపదార్థ మొక సూక్ష్మరూపములో మనశరీరములోని తన్మాత్రతో సంబంధమేర్పఱచుకొనుట వలననే గల్గుచున్నవని స్పష్టపడుచున్నది. అందుచే మనఅనుభవము జ్ఞేయపదార్థముయొక్క సూక్ష్మరూపము ననుసరించియే యుండును. మా యీపర్యవసానము సరియైనచో, మానవుని యనుభవములు ఆయాజ్ఞేయపదార్థములకంటె భిన్నమైనవనిచెప్పుటకు వీలులేదని అంగీకరించవలయును. నిజమునకు మానవుని యనుభవజ్ఞానమనగా, జీవాత్మమీద వివిధతరగతులచైతన్యముచే గలుగజేయబడినఛాయలు, లేక సంస్కారములే. అందుచే, కారణముయొక్క ముద్ర (అనగా, సంస్కారముగలిగించుటకు కారణమైనజ్ఞేయపదార్థముయొక్కముద్ర) యెల్లపుడును కార్యముమీద (అనగా సంస్కారములో) పడుచునేయుండును గావున కార్యకారణములు ఒకేవస్తువుయొక్క రెండుభిన్నావస్థలగుచున్నవి. కారణమునుపట్టియున్న పరిస్థితులును, కార్యముననుసరించి యుండెడి పరిస్థితులును పరస్పరసంబంధముగలవై యుండి, ఈరెండును ఒకేవస్తువుయొక్క రెండు భిన్నదశలుగా ఉండుచుండును. అయినను, ఈరెండుపరిస్థితులును (కారణవస్తువునుపట్టియున్న పరిస్థితులును, కార్యముయొక్కపరిస్థితులును) సామాన్యముగ బాహ్యరూపములో భిన్నముగాఉన్నట్లు కనబడుచుండుటచే, నారెండింటిమధ్య గల నైజసంబంధమును గుర్తుపట్టుటకష్టసాధ్యముగనుండును. ఉదాహరణార్థము సూర్యకిరణమును తీసికొనివిమర్శించుము. సూర్యకిరణము నిజమునకు, సూర్యుని నుండి ప్రకటమైన యొకధారయైయున్నది. తిర్గిఅదే సూర్యునిబహిర్వ్యాపకశక్తి యొక్క కార్యముగూడ నైయున్నది. ఆకిరణమునుపరిశీలించినచో, దానిలోదాని భండారమగు సూర్యునియొక్కరూపమునుఅంశలును సూక్ష్మరూపముననున్నట్లు బోధపడగలదు. అనగా, కార్యరూపమైనకిరణములో దానికారణమైన సూర్యుని ధర్మములున్నట్లు స్పష్టముగ కన్పట్టుచున్నది. ఈసృష్టియంతయు, శిఖరస్థానము

మొదలుకొని, న్యూనాంగధృవములోని అట్టడుగు స్థానమువఱకును. ఈసిద్ధాంతము ననుసరించియే వ్రకటమైనదని తెలిసికొనదగును.

## 124, సృష్టిజేయుటలోని ఉత్తమ దయాభరితమహోద్దేశ్యము,

ఏప్రభువుని ప్రేమానందములకు హద్దులులేవో, ఏప్రభువుని పరమజ్ఞానమునుండి యేవిషయమును గుప్తమైయుండనేరదో ఏప్రభువుని పరమసత్తనుండి యే ప్రతిపదార్థము శక్తిసామర్థ్యములనుసంపాదించుకొనుచున్నదో ఏప్రభువుని పరమప్రకాశముయొక్క తైక్ష్ణ్యము వర్ణనాతీతమో, అట్టియపారచైతన్యసింధువే పరమపురుషుడు. ఆపరమపురుషుడు అపారానంతస్వరూపుడై యెల్లప్పుడు నిట్టి పరమానందావస్థలో నిర్వికారుడైయుండును. ఈఅపారచైతన్యభండారముయొక్క కళ్యాణప్రదలక్షణములప్రభావముచే, నందుతో సంబంధమేర్పడిన ప్రతిపదార్థమునకు శ్రేయోలాభము సేకూరుట తప్పనిసరికావున, విశేషాంగముగాక తదితరఘట్టములు సృష్టికిపూర్వమీభండారముతో సంబంధముకలవై ఈ భండారముయొక్క వశములోనుండుటలో, వానివిషయములో నొకగొప్ప దయాగర్భితమైనయుద్దేశ్య ముండియుండవలెను. యుక్తసమయమాసన్నమై యీసంబంధము దృఢముకాగా,పరమపురుషుని నిజతత్త్వముయొక్క సమర్థధార దిగివచ్చినపుడు క్రిందిఘట్టములత్యంతశోభాయమానరచనారూపమున ప్రఫుల్లములయ్యెను. తక్కినసమస్తసృష్టికన్న నెన్నియోరెట్లధికవైశాల్యము గల్గినట్టి పరమపురుషుని కత్యంతసన్నిహితమైన క్రిందిఘట్టములభాగము వెంటనేఅమరమును అవినాశియునైపోయి ఆదేశమంతయు సంపూర్ణరూపములో చైతన్యాత్మకమైపోవునంతగా చైతన్యభరితమై నిజభండారముతో కలిసి ఏకమైపోయెను. ఆదేశనివాసులుకూడ (వారిసంఖ్య తక్కినసృష్టిభాగములోనున్న జీవులందఱి సంఖ్యకన్న నూహింపశక్యముకానన్ని రెట్లధికముగనుండును) గాఢనిద్రావస్థలోనుండిమేల్కొని, శాశ్వతముగ నిర్వికారపరమానందమయమైనట్టియు, దుఃఖస్వరూపముయొక్కసూక్ష్మాతిసూక్ష్మఛాయకూడ లేనట్టియు అవినాశిజీవితమును పొందిరి. ఈమహానుగ్రహమువలన, నిజభండారముక్రిందనున్నదేశములో నధికాధికభాగము వర్ణనాతీతమైన మహాభాగ్యమునొంది కృతార్థమైపోయెను. ఈదేశములో సృష్టిజరిపించుటలో నంతర్గర్భితమైన మహాదయ మానవునిమనోబుద్ధులకూహింపశక్యముగాదని వేఱుగవ్రాయనవసరమే లేదు. పరమానందస్వరూపుడైన నిజపరమసర్వేశ్వరుడొక్కడే ఇట్టి మహా

దయానుగ్రహములను తలపెట్టగలదు. మిగతభాగములను సృష్టిచేయుటలో నంతర్గర్భితమైనదయకూడ నింతకన్న నెవ్విధమునను తక్కువకాదు. కాని, వానిలోనున్న ఆదిచైతన్యలోపముమూలమున నాభాగములు ఆదయయొక్క పరిపూర్ణలాభము నొందలేకపోయెను. ఇట్టిలోప మూభాగములలోనున్నను,ఆ మహాదయ తనయుద్దిష్టకార్యమును సాధ్యమైనంతవఱకుపూర్తిగనే నెఱవేర్చుకొనెను. ఈభాగములయొక్క చైతన్యలోపమువలనగల్గినట్టిదోషములు చాలమట్టుకు హ్రస్వముగావింపబడి, ఆనిమ్నతరచైతన్యభాగములను సృష్టిక్రమములో నేస్థానమునసుంచినచో, ఆలోపములే చివఱకు వానిజీవితానందముయొక్క అభివృద్ధికియెల్లపుడు సహకారముగనుండునో, అట్టిస్థానమే ఆభాగములకు ఏర్పాటు చేయబడెను. ఈచైతన్యలోపము రచనాద్వితీయభాగమైన బ్రహ్మాండములో నామమాత్రముగనేయుండి, దానిపరిభావము ప్రకటమగుసమయమువచ్చుసరికి మహాప్రళయముసంభవించునుకావున నాప్రభావము వ్యాపించనేరదు. అందువలన నీసృష్టిభాగమును అనగా విశ్వసృష్టిలో రెండవమహాఖండమగు బ్రహ్మాండదేశమును సృష్టిచేయుటలోగూడ— నిర్మలచైతన్యదేశముగాక తక్కినసృష్టిభాగములో బ్రహ్మాండదేశము అధికాధికభాగము నాక్రమించి యున్నది— నిర్మలచైతన్యదేశముతో కొంతసమానమని చెప్పదగిన శాశ్వతమైన యానందసౌఖ్యములను చేకూర్చుమహాదయాభరితోద్దేశ్యమే గర్భితమైయున్నది. తృతీయమహాఖండమైన పిండదేశముయొక్క చేతనత నిమ్నతమతరగతికి చెందినదగుటచే, మలినవాసనలు, దుఃఖక్లేశములును, ఈదేశనివాసులనెక్కువగాబాధించుచుండును. అయినను, మొదటిమూడుయుగములలో నీయాపత్తులంతప్రబలముగా లేవు.అందుచే ఆమూడుయుగములలోను పిండదేశజీవితమును ఆజీవితసుఖములును, సృష్టికి పూర్వమున్న అప్రబుద్ధావస్థతోపోల్చగా, మహావరప్రసాదములుగనే యెంచతగియుండెను. పిండదేశముయొక్క ఆయుఃప్రమాణములో నించుమించు ఎనిమిదవభాగములోమాత్రమే, ఆదేశనివాసులు మాయికమలినవాసనలకు వశమైపోయి అనేకవిధములైన కష్టములు, రోగములు, భయములను సహించవలసియుండుచున్నది. అయిన నీదుఃఖదాయకపరిస్థితులిచ్చట నొకవిధమైన జన్మమరణపరంపర నేర్పాటుచేయుటచే, జీవుల మాయికకోశములునశించుచున్నవి. కొద్దికాలముమాత్రమే వారు ఈఅవస్థలననుభవించినపిమ్మట సంతుమహాత్ములిచ్చట అవతరించినపుడు ప్రకటమగునట్టిమహాదయను పొందుటకుపాత్రులగుచున్నారు. మహాప్రళయకాలమ్ము

ఆసన్నమైనచో నపుడు స్వయముగ నాపరమదయాళుడైన సత్యసృష్టికర్త నుండియే, యీమహాదయ ప్రవహించును. లేనిచో నీమహాదయ బ్రహ్మాండము నుండి యుపరోహించును. మొదటిపరిస్థితిలో పిండదేశవాసులకు అనంతపారమార్థికలాభము (అనగా చైతన్యలాభము) చేకూరి, బహుసంఖ్యాకులైనజీవులు పరిథమమహాఖండముయొక్క అవినాశిమండలములలో శాశ్వతనివాసమును పొందుట కధికారులు గావింపబడుదురు. కావున, పిండదేశవాసులకు పిండదేశములో జీవితానందమననుభవించునిమిత్తమై యేర్పఱచిన అఖండదీర్ఘకాలముతో, వారలకునిర్మలత్వముకలుగజేయుటకై వారలిచ్ఛాటదుఃఖబాధలననుభవించుటకేర్పర్చబడిన (అదీర్ఘకాలముతోపోల్చిచూడగా) బహుస్వల్పకాలమును పోల్చిచూచినయెడల నీయుత్కృష్టగుదేశమైన పిండదేశమునురచించుటలో గూడ మహాదయ అంతర్గతమైయున్నట్లు స్పష్టముగబోధపడి, ఆపరమపురుషునిచే జరిగించబడినయేర్పాట్లన్నిటిలో మహాత్మ్యమజ్ఞానసంపన్నత ఇమిడియున్నట్లు విశదపడగలదు. అభ్యాసిఆత్మయొక్కనైజశక్తులు కొంతమేల్కాంచినపుడు తానునుభవించెడి సుఖదుఃఖములులాభనష్టముల పరిస్థితులన్నిటివలనను, ఈసృష్టినిరచించుటలోనంతర్గతమైన చిద్విలాసమహోద్దేశ్యము లతనికి బహుస్పష్టముగ గోచరమగుచుండును. ఆదయాభరితమహోద్దేశ్యముయొక్క తృణికస్ఫురణమాత్రమునసే అభ్యాసి ఆనందపరవశుడై ప్రేమతన్మయత్వముతో పరమపురుషునిగుణగానము చేయుచుండును. అప్పుడప్పుడా ప్రేమావేశ మెక్కువ ప్రబలమైనపుడు, అతడు మాటలేకుండా నిస్పృహుడై పోయి, ఆతన్మయావస్థలో నుండగా పరమపురుషునియొడిలోనున్నట్లుగా మహానందమననుభవించును. సృష్టిని రూపవంతముచేయుటలో నాపరమపురుషుని చిద్విలాసము దయాభరిత మహోద్దేశ్యమును, స్వానుభవమూలమునసే సంపూర్ణముగ గోచరము కావలయును కాని యథార్థమునుమఱుగుపఱచెడి సందేహాస్పదతర్కవాదముల వలన నెన్నటికిని వాని అనుభవజ్ఞానము కలుగనేరదు. జీవన క్రియాత్మకఅనుభవాత్మక జ్ఞానము నొసంగగల ఆధ్యాత్మికవిద్యాలయము ఒకమహాశుభప్రదసంస్థయని చెప్పవలయును. అట్టిపారమార్థిక విద్యాలయము ముఖ్యముగా ఆపరమపురుషుని అధ్యక్షతక్రిందనే నడిపించబడగలదు. కేవలము మానసిక శిక్షయు, మానసిక జ్ఞానసంపన్నతయు, నెంతయుత్తమోత్తమపరిమాణములోనున్నను, సృష్టిలోనంతర్గతమైనచిద్విలాసను మహోద్దేశ్యమును అనుభవాత్మకముగా అవగాహన చేసికొనుటకై యెంతమాత్రము పనికిరావు. కావున సృష్టియొక్కదయామయ

మహోద్దేశ్యము నవగాహనచేసికొనుటకై ప్రయత్నించువారి విషయమును జ్ఞప్తియందుంచుకొనవలెను. మానవుని జ్ఞానమంతయు ఈజగత్తుయొక్క పరిమాణత్రయమునకు (Three dimensions) సంబంధించినయనుభవములనుమించి లేదు. కాని సృష్టిలో క్రియలు జరుగుచున్నఘట్టములును, ఆక్రియలప్రభావము ప్రకటితమగుచున్న ఘట్టములును ఈ మూడుఘట్టములు మాత్రమే కావు. ఇవిగాక సృష్టినిర్మాణక్రమములో మహాకార్యములను సాగించుచున్నఘట్టములింకననంతముగా గలవు. కాని, వానినిగురించి తెలిసికొనుటకు సూక్ష్మజ్ఞానేంద్రియములమూలమునగలుగు ననుభవరూపమైనజ్ఞానమే పనికివచ్చును, కాని చర్మేంద్రియములెందుకుపనికి రావు. మానవులకు అప్పుడప్పు డీయున్నతఘట్టములపైన జరుగుచుండెడిక్రియలనుగురించి సూచనలు లభించుచుండును. కాని అట్టియనుభవములు చాలకొద్దిగను, అరుదుగను గల్గుచుండుటచే, వీనిమూలముగా, కార్యమునుబట్టి కారణమునూహించుపద్ధతి నవలంబించి (అనగా, అనుమాన ప్రమాణముచే) ఆయున్నతఘట్టములనుగురించిన యథార్థజ్ఞానములభించనేరదు కాబట్టి మేము శ్రద్ధాళువైనజిజ్ఞాసువులకు మూడుకొలతలకుమించిన పైఘట్టములపరిస్థితి నవగాహనచేసికొనునిమిత్తమై, విహితసాధనల నభ్యాసముచేసి తమ సూక్ష్మేంద్రియములను మేల్కొల్పుకొనుట యుక్తముకాని, యీమూడు ఘట్టముల యనుభవములే తప్ప మఱొకజ్ఞానమేయుండనేరదని పట్టుపట్టరాదని సలహా యిచ్చుట యసమంజసముకా నేరదు.

# చతుర్థభాగము

## మానవులుచేయు కర్మలనుగురించియు, ఆకర్మలమూలమున మానవులపైగలిగెడి ప్రభావమునుగురించియు వర్ణనము.

### 125. సృష్టిలోనిదండననియమములు, వానిలాభములును.

రచననుగురించి గతభాగములో మేము చెప్పినవిషయములనుబట్టి
యీసృష్టిలో క్రియాత్మకముగనున్న సకలనియమములును మహాదయాభరితో
ద్దేశ్యముతో నేర్పాటుచేయబడినవని విశదమగుచున్నది. దండన ననుభవించిన
జీవులు దండనానంతరము, వారున్న మహాఖండములో కొంత నిర్ణీతపరిమాణము
వఱకు నాధ్యాత్మికాభివృద్ధిసంపాదించుకొనుట కధికారులగుచున్నారు. కావున
దండననియమములవలనగూడ చిట్టచివఱకు కొంత మేలేగల్గునట్టి పరిస్థితి
యేర్పడుచున్నది. ఈయేర్పాటు అంతయు పిండదేశములోనైతే పరిపూర్ణము
గనే యున్నది. కాని నిర్మలచైతన్యదేశముక్రిందనున్న మహాసున్నలోక
ములోని యర్థచేతనాత్మకరచనలోను, బ్రహ్మాండదేశముక్రిందనున్న చిదాకా
శములోని యర్థచేతనాత్మకరచనలోనుకూడ నీయేర్పాటుయొక్క జాడలు
కన్పట్టును దండననియమములు అందఱకు నొకేరీతిగనే వర్తించునుకాని, బహు
మానములను సంపాదించెడి నియమములవలన లాభమునొందలేని జీవులకే అవి
ముఖ్యముగా ఉద్దేశింపబడినవి. మానవునిలో నేవాసనలు, కృత్యములు, మంద
కొడియు నుండుటచే నతడాదోషములను నిర్మూలించుకొని అంత్యమునకు
చైతన్యలాభము సంపాదించుకొనుటకై పాటుపడుచు నీసృష్టియనెడి కారాగృ
హములోనుండవలసివచ్చుచున్నదో, ఆవాసనలు, కృత్యములు, మందకొడియును
సిగ్గుపడవలసిన అవివేకచిహ్నములని అంతగాచెప్ప నవసరములేదు. కాని కేవలము
అసమర్థులైనజీవులే అట్టిలక్షణములలో పరివర్తించుదురు. తగినంత సుమతియు
దూరదృష్టియు గలమానవులు ఆనియమములను తెలిసికొని శిక్షపడకుండా
తప్పించుకొని బహుమానములను సంపాదించుకొనుటకై పాటుపడుచుందురు.
అదియునుగాక,దండననియమముల ప్రభావముచే, జీవునకు దుష్ప్రవృత్తులు కొంత
వఱకు తగ్గి తననివాసస్థానమైన మహాఖండములోమాత్రమే అతడు చైతన్యాభి
వృద్ధి నొందగలడుకాని, అంతకన్నపైనున్న మహాఖండములో నివాసముపొంద
నేరడు. పైమహాఖండములోని కారోహింపవలెనన్నచో ఆ మహాఖండ

ముయొక్క చైతన్యధారాపరిభావములోనికి జీవుడువచ్చి ఆయున్నత మహాఖండమునకుచెందిన సిద్ధపురుషుడగు సమకాలికసద్గురువుని సహాయము పొందుట యవసరము. ఉన్నతమహాఖండపుచైతన్యధార యాకర్షణపరిభావము తనపై వడుటకు అంతర్యసాధనతప్ప మఱొకయుపాయములేదు. అభ్యాసము జయప్రదముగ సాగుటకు పిండబ్రహ్మాండ దేశములలో ప్రబలముగనున్న నీచవాసనలను చక్కగగుర్తుపట్టి వానినణచివైచుట ముఖ్యావసరము. పైనచెప్పిన అంతర్యాభ్యాసము మానవశరీరములోనే జయప్రదముగ సాగునుకాబట్టి (111వ ప్రసంగము చూడుడు) మానవునిమీద నతనిపరిసర విషయములకును, కర్మలకును ఎట్టిపరిభావముగల్గునో ఇపుడువర్ణించబోయెదము.

## 126. జీవునిమీద సంస్కారము లేవిధముగా పడును, ఏవిధముగా స్థిరపడిపోవును.

ఎన్నివిధములైనకర్మలుగలవు,వీనియమములప్రకారము భావికాలములో వాని ఫలితములననుభవించవలసియుండును, అనువిషయములను వివరించుటకు ముందు జీవునిమీద పరిసరవిషయములెవ్విధముగా ప్రభావము గలుగజేయును, జీవునిలో నవి సంస్కారరూపముగ నెట్లు ప్రవేశించి స్థాయిగ నుండిపోవును, జీవునిలో నాసంస్కారములమూలముగను ఇతరకారణములవలనను కోరికలువాసనలు నెట్లుద్భవించును, అనెడి విషయములను మొదట విమర్శించెదము. చుట్టుప్రక్కలవిషయములు జ్ఞానేంద్రియములపైన తమ ప్రభావమును కలుగచేయగా,జ్ఞానేంద్రియములపైన వానిఛాయలు పడి వెంటనే జీవునకు ఆఛాయలజ్ఞానముగల్గును. కాని, అంతటితోనే విషయమంతయు ముగించిపోదు. ఈఛాయలన్నియు మనలోలోపల నొకచోట సురక్షితముగ నుంచబడును. వీనిలో నత్యంతనీరసతమములు,అస్పష్టతమములునైన ఛాయలు గూడ మనయాంతర్యఫలకముమీద ముద్రితమైపోవును. అబర్‌క్రాంబీ (Abercrombie) యనునతడు మానసికశక్తులనుగురించివ్రాసిన గ్రంథములో నతడుదహరించిన సంఘటనలనుబట్టి, పైనచెప్పినవిషయము సమర్థించబడు చున్నది. ఆగ్రంథకర్త తనగ్రంథములో స్త్రీపురుషులెందఱో తామెప్పుడో యాదృచ్ఛికముగవినియుండిన యన్యభాషాపద్యములను కొంతకాలమైనపిదప తప్పులేమియులేకుండ ఒప్పజెప్పిన అనేకదృష్టాంతముల నుదహరించెను. వారికి ఆ పద్యములయర్థజ్ఞానము లేకపోవుటచే పద్యశ్రవణముచేయునపుడు అందు విషయమై శ్రద్ధ చాలతక్కువగనే యుండియుండును. కావున ఆపద్యసంస్కార ములుకూడ వారిలో చాలనీరసముగనే పడియుండవలెను, కాని, సన్నిపాతము

మూలమునగలిగిన యుద్రేకస్థితిలో, నాసంస్కారములు వారిశ్రద్ధ కభిముఖము కాగా, వారికి ఆపద్యములు వెంటనే జ్ఞప్తికివచ్చి, అదివరలోపడిన సంస్కారములసహాయముతో వారావద్యములనుఒప్పజెప్పిరి. జ్ఞానేంద్రియములద్వారాను మానసిక క్రియల మూలమునను గల్గునట్టి యీఛాయలు, లేక సంస్కారములు ముద్రితమైనట్టి మధ్యమపదార్థము (Medium) లేక తెర ఆకాశము.

## 127. మనో ఆకాశము.

జీవునిలో నీ ఛాయలు ఏఆకాశతత్త్వముమీద ముద్రితమైయుండుచున్నవో దానిని మనోఆకాశమందురు. ఈమనోఆకాశమునకు బాహ్యాకాశతత్త్వములోనున్న స్థితిస్థాపకత్వధర్మము (elasticity) వంటి ధర్మమే, అంతకన్న నెన్నిరెట్లో అధికతీవ్రరూపములో గలదు.ఈస్థితి స్థాపకత్వధర్మముమూలముననే, మనో ఆకాశముమీదపడినట్టిగాని, బాహ్యాకాశముమీదపడినట్టిగాని ఛాయలు తమనిర్ణీతస్థానములకు జేర్చబడుచున్నవి. బాహ్యాకాశతత్త్వముద్వారా ఛాయలుకొంపోబడునట్టిస్థానమునకు (అనగా దర్శనేంద్రియము అనియర్థము) ప్రతిబింబములనుప్రసరింపజేయులక్షణము (ప్రతిబింబప్రసారకధర్మము) గలదు. మనోఆకాశపుఛాయల గమ్యస్థానమునకుగూడ నీలక్షణమున్నదికాని యది యాంతరంగికము అనగా, మానసికముగ నున్నది. మనస్సుమీద ఛాయలు లేక సంస్కారములు పడినపుడు, మనస్సునకును, దాని చతుర్విధాంగములకును(అనగా మనన,చింతన,బోధనాహంకారములకు) ఆఛాయల జ్ఞానము వెంటనే గల్గుచుండును కాని,వానిపైనుండి శ్రద్ధమఱలి ఇతరఛాయలమీదికిని, ఇతరదిక్కులకును,పోవుచుండుటచే పూర్వపుఛాయలజ్ఞానము మందగిలిపోవుచు చివఱకు ఆఛాయల స్మృతియే పూర్తిగా నశించిపోవును. వానిస్మృతినశించినను ఆఛాయలుమాత్రము నశించవు. ఆఛాయలు మనోఆకాశకార్యాలయములో పత్రదస్త్రములవలె నతిజాగరూకతతో సురక్షితముగదాచబడి, మరెప్పుడైనను ప్రయత్నపూర్వకముగగాని అప్రయత్నముగగాని,తిరిగివానిపైకి మనశ్శ్రద్ధ పూర్తిగామఱలినపుడు, అవి వెంటనే పైనచెప్పినవిధమున తిరిగిప్రకటమై జ్ఞప్తికివచ్చును.

## 128. సంస్కారములు రెండవసారిప్రకటమగువిధము.

అబర్క్రాంబీ (Abercrombie) వివరించిన పైనుదహరించబడినట్టి ఘటనలవలన రెండుసిద్ధాంతములు స్పష్టముగ సిద్ధించుచున్నవి. అందులో

మొదటిదేమనగ, నెవనిశ్రిద్ధకైనను తనలోముద్రితమైయుండినఛాయలతో - ఆఛాయ లెంతదుర్బలమైననుసరే, వానియర్థ మతనికిభోధపడినను, బోధవడక పోయినను సరే - పరిపూర్ణవిధమున సంబంధముగల్గినవుడు, అతడాఛాయల ననుసరించియే ప్రవర్తింపదొడంగును. రెండవదేమనగా, జీవుడు ఆఛాయల ప్రభావమువలనచేయునట్టి క్రియలకు తిరిగి అతనిమనోఆకాశముమీద ప్రభావము గల్గి, తగినసమయమువచ్చినవుడు, అవగా తనశ్రద్ధకు వానితో పరిపూర్ణసంబంధ మేర్పడినవు డాఛాయలు జీవునిచే మఱికొన్నిక్రొత్తక్రియలను చేయించు చుండును.

---

# అనుబంధము

## ప్రార్థన

॥ దోహా ॥

బార్ బార్ కర జోర్ కర్, సవినయ కరూఁ పుకార్
సాధుసంగ మోహిఁ దేవ నిత, పరమగురూ దాతార్. (1)

కృపాసింధు సమరథపురుష, ఆది అనాది అపార్,
రాధాస్వామీ పరమపితు, మై తుమ సదా అధార్. (2)

అర్థము :- ఓపరమగురో, సకలశ్రేయోదాతా, నేను తిరిగి తిరిగిచేతులు మోడ్చి వినయపూర్వకముగ ప్రార్థించుచుంటిని. నాకు నిరంతరము సాధువులసాంగత్యము లభించుచుండునట్లుచేయుడు(ఇచ్చట సాధువులనగా మామూలుగసన్యాసాశ్రమము స్వీకారముచేసినవారని యర్థముకాదు, మనస్సునుసాధించి యాంతర్యమున అధమము సున్నలోకమున కాత్మ నారోహింపజేసినవారని యర్థము) (1)

ఓకృపాసముద్రమా, సర్వసమర్థపురుషా, ఆద్యంతములులేని ఆదిపురుషా, ఓపరమపితా, రాధాస్వామీ, నాకు నిరంతరము దిక్కునీవే. (2)

॥ సోరఠా ॥

బార్ బార్ బలి జాఊఁ, తన మన వారూఁ చరనపర్,
క్యా ముఖ లే మై గాఊఁ, మేహర కరీ జస కృపా కర్ (3)
ధన్య ధన్య గురుదేవ్, దయాసింధు పూరన్ ధనీ,
నిత్త కరూఁ తుమ సేవ్, అచల భక్తి మోహిఁ దేవ ప్రభు (4)
దీన అధీన అనాథ, హాథ్ గహో తుమ ఆన కర్,
అబ్ రాఖో నిత సాథ్, దీన దయాల్ కృపా నిధి (5)
కామ క్రోధ మద లోభ్. సబ బిధి అవగున హార మైఁ
ప్రభు రాఖో మెరీ లాజ్, తుమ ద్వారే అబ్ మైఁ పడా. (6)
రాధాస్వామీ గురు సమరథ, తుమ బిన ఔర న దూసరా,
అబ్ కరో దయా పరతక్ష, తుమ దర ఏతీ విలంబ క్యోఁ (7)

అర్థము:-నేను మాటిమాటికి తమచరణములకుబలిహారై పోవుచున్నాను. నాశరీర మనస్సులను తమచరణములపై నర్పించుచున్నాను. తమరు నామీాద నెట్టిదయాకటాక్షములను జేసిరో నాఅల్పముఖముతో నేల జెప్పగలను!

ఓదయాసముద్రమా, సర్వసమర్థపురుషా, సద్గురో, తమకనేకధన్య వాదములు. ఓప్రభో నేను నిరంతరము తమసేవజేయుచుండునట్లనుగ్రహించి నిశ్చలభక్తిదానము నాకొసంగుడు. (4)

ఓదీనదయాళో, కృపాసముద్రమా, నీవే స్వయముగవచ్చి, యీదిక్కులేని దురవస్థపాలైయున్న దీనుని హస్తమును చేపట్టిరికదా. కావున నోప్రభో ఇఁకనివ్వాడు నన్ను వదలిపెట్టక నిరంతరము నాకు తోడుగనుండుడు. (5)

నేను కామక్రోధ మద లోభాదిసమస్తదుర్గుణములతో నిండియున్నాను. అయినను, ఓప్రభో నేనిపుడు తమగుమ్మమువద్దకు వచ్చిపడి మొఱపెట్టుకొనుచున్నాను కావున నా మానమును కాపాడుడు. (6)

ఓరాధాస్వామిా సర్వసమర్థసద్గురో, మిారుతప్ప నాకు మఱొక దిక్కు లేదు. నామిాద ప్రత్యక్షముగ మహాదయచేయుడు. ఓస్వామిా, తమగుమ్మమువద్దకూడ నింతయాలస్యమేల ? (7)

॥ దో హా ॥

దయా కరో మేరే సా ఇయాఁ దేవ ప్రేమ కీ దాత్;
దుఖ సుఖ కఛు వ్యాపే నహీ, ఛూ టే సబ్ ఉత్పాత్ (8)

ఓనాస్వామిా! నాయందు దయచూపుడు. నాకు తమప్రేమదానము నొసంగుడు ప్రాపంచికసుఖదుఃఖములప్రభావము నాపైన నెంతమాత్రము కలుగకుండునట్లును, నాకు సమస్తకష్టములు తొలగిపోవునట్లును అనుగ్రహింపుడు.

# సా ధు మ హి మ

## । చౌ పా ఈ ।

నిజ గున భాట జగత బహుతేరే,
పర గున గ్రాహక పర స ఘనేరే। (1)

జే ఛిన ఛిన నిజ గున ఉచ్చరహీం
సమయ పరే పర కఛు నహీం కరహీం (2)

మమతా త్యాగి కరే జో కరనీ,
సపనే అహంగ చిత్త నహీం ధరనీ (3)

పరగున జిన రవి ఉదయ సమానా,
నిజ ఆచరన ఖద్యోత నిమానా (4)

సత్య సాధు కరనీ తినకేరీ,
జ్ఞాన మూర మయ సుఖద ఘనేరీ (5)

శశి సమ శీతల బైన సుబైనూ,
శ్రవన పరత ఉర పావత చైనూ (6)

బడే భాగ అస సాధు సుసంగూ
కలి మల హారన మోహా మద భంగూ (7)

అవిరల భక్తి ప్రేమ మన లావన,
గురు చరనన చిత ఉమంగ బఢావన (8)

అర్థము:- నిజగుణస్తోత్రపాఠము చేసికొనువారు పెక్కుమందేయుందురు కాని, ఇతరులనుగుణములనుగ్రహించువారు అరుదుగా కానవత్తురు. (1)

నిరంతరము తమనుగుణములనే లెక్కించుకొనువారు అవసరమువచ్చి నపుడేమియు సేయలేరు, (1)

అహంకారమమకారములనువిడిచి, యాధ్యాత్మికసాధనల నభ్యాసముచేయువారికి స్వప్నములోకూడ గర్వముండనేరదు. (3)

ఆట్టివారికి తమనుగుణములు కేవలము మిణుగురుపురుగులంత కనీసముగను యితరులగుణములు ఉదయభానువంత పెద్దవిగను కన్పట్టుచుండును, (4)

అట్టివారలప్రివర్తన మెల్లపుడు సత్యాప్రిధానముగను, ఉత్తమజ్ఞాన సంపన్నముగను ఉండి అందఱకును సుఖప్రిదముగనుండును. (5)

వారి మధురసంభాషణ మెల్లపుడు చంద్రునివలె శాంతిని, చల్లదనమును ఇచ్చును. వారిమాటలు చెవినిపడినంతనే, వినువారిహృదయము శాంతిసుఖపూరిత మైపోవును. (6)

అట్టిసాధుసాంగత్యము, అద్భుతమహాభాగ్యముమేల్కాంచినపుడే లభించును. ఆసాంగత్యమువలన కాలునిమాలిన్యమంతయు నశించి, ప్రాపంచిక మోహాహంకారములు భగ్నమైపోవును. (7)

అట్టియుత్తమసాంగత్యమువలన మనమున గాఢమైన భగవద్భక్తిప్రేమలు పెంపొంది, సద్గురుచరణములసాంగత్యముకొఱకై యమితోత్సాహ ముదయించును, (8)

## ఇ త ర శ బ్ద ము లు

### దో హా

వాచక జ్ఞానీ కీ సభా,
జన ఖద్యోత సమాజ ।
క్రోధ లోభ అహంకార మద,
నింద్యా నిశ కీ సాజ॥ (1)

పక్షపాత ఘన నీర కణ,
కరత సదా ఆహార్ ।
పర పరకాశ కుశల నిత,
స్వాయం ఘోర అంధకార్ ॥ (2)

### సో ర ఠా

సత్య జ్ఞాన రవి తేజ,
ఉదయ హోతఽ హాంగ రహిత సో।
కృమివత్ తుచ్ఛ అతేజ,
కుటిల కుమతి కుత్సిత గయే॥ (3)

అర్థము : వాచకజ్ఞానులసభ మిణుగురుపురుగులగుంపు వంటిది. వారు క్రోధ, లోభ, మదాహంకారములు పరదూషణయనెడి అంధకారములో రాత్రి వేళ మిణుగురుపురుగులవలెనే మెఱయుచుందురు. (1)

అట్టిఅజ్ఞానులు పక్షపాత మేఘములనుండి పడునట్టి నీటిబిందువులనే నిరతము నాహారముగ తీసికొనుచు స్వయముగ తాము అంధకారములోనే పడియుండియు, నితరులకు ప్రకాశమివ్వగలసామర్థ్యము తమకే యున్నట్లు చెప్పుకొనుచుందురు. (2)

సూర్యకాంతివలె ప్రకాశమానమైన సత్యజ్ఞానముదయించినపుడు అది పూర్తిగా అహంకారరహితమైయుండును. వాచకజ్ఞానులు తుచ్ఛములు, కాంతిరహితములునైన మిణుగురుపురుగులవలెనే, కుత్సిత కుటిల కుమతిపూరితులై తిరుగుచుందురు. (3)

సమాప్తము.

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 8 | 15 | బవాత్కార | బలాత్కార |
| 16 | 29 | మండలములకు | మండలమునకు |
| 20 | 16 | మరణావస్ధ | మరణావస్థ |
| 21 | 7 | స్ధూల | స్థూల |
| 24 | 1 | సారంభించ | ప్రారంభించ |
| 25 | 1 | నీ సూల | నీ స్థూల |
| 26 | 15 | హృదయచకము | హృదయచక్రము |
| 29 | 8 | బ్రహ్మాండి | బ్రహ్మాండీ |
| 35 | 5 | నామమా | నామమాత్ర |
| 36 | 10 | optie | optic |
| | 12 | ద్రష్టకు | ద్రిష్టకు |
| 46 | 31 | ఆశకి | ఆశక్తి |
| 49 | 17 | లక్షముల | లక్షణముల |
| 53 | 15 | ప్రసితిద్ధ | ప్రతిసిద్ధ |
| | 24 | జిరిగించి | జరిగించి |
| 54 | 11 | భక్తులను | భక్తుల |
| | 27 | బుద్ధిమత్తతో | బుద్ధిమత్తతలో |
| 56 | 16 | యుతన్న | యున్నత |
| 58 | 2 | పర్యనసానము | పర్యవసానము |
| 59 | 13 | మేమననగా | మేమనగా |
| 60 | 29 | ఆంత్యములో | ఆంతర్యములో |
| 62 | 27 | అంతర్యాభివృద్ధి | ఆంతర్యాభివృద్ధి |
| 68 | 19 | నోకే | నాకే |
| 76 | 16 | సిద్ధాంమును | సిద్ధాంతమును |
| 79 | 8 | త్రికమకలు | తికమకలు |
| 80 | 28 | మండములలో | మండలములలో |
| 82 | 5 | యునవ్ని | యున్నవి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 83 | 4 | ధ్వనాత్మక | ధ్వన్యాత్మక |
| 86 | 28 | రధాల | ధారల |
| | 29 | ధవళి | ధవళ |
| | 30 | ధవళి | ధవళ |
| 87 | 5 | పురుష్యుని | పురుషుని |
| | 8 | మండలాధివ | మండలాధి |
| | 19 | రంచిన | రచించిన |
| 88 | 25 | వీన్న | వీలున్న |
| | ,, | ప్రశ్నలు | ప్రశ్న |
| 90 | 5 | వల్లెరము | పళ్ళెరము |
| | 8 | నమిత్తము | నిమిత్తము |
| 91 | 29 | నమూనాలు | నమూనాలు |
| 93 | 23 | జిహ్మా | జిహ్వా |
| 94 | 4 | "రాధా" | "ధారా" |
| 94 | 20 | అటవ | ఆటవ |
| 95 | 7 | నామమునవే | నామమునే |
| 99 | 2 | ధిక | నాధిక |
| 101 | 17 | దృగ్గోగరమైన | దృగ్గోచరమైన |
| 102 | 28 | నిరాక్షేవణీయ | నిరాక్షేవణీయ |
| 103 | 18 | సాంత్మానందరతుడై | స్వాత్మానందరతుడై |
| 108 | 15 | ఆనాదినిద్ర | అనాదినిద్ర |
| 111 | 11 | యుక్క | యొక్క |
| | 20 | సూక్ష్త్రము | సూక్ష్మము |
| 112 | 5 | మధ్మ | మధ్య |
| 112 | 6 | అడ్డగట్టు | అడ్డుగట్టుగ |
| 114 | 11 | బ్రహ్మడము | బ్రహ్మాండము |
| 114 | 27 | కార్యమము | కార్యము |
| 118 | 17 | రకయుల | రకముల |
| 119 | 14 | మేర్పరఅచు | మేర్పఅచు |
| 120 | 14 | అకాశ | ఆకాశ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 120 | 16 | అకాశ | ఆకాశ |
| 126 | 29 | అత్థము | అర్థము |
| 128 | 1 | లాని | లోని |
| | 4 | లాని | లోని |
| | 7 | లాని | లోని |
| | 9 | లాకములు | లోకములు |
| | 10 | లాకము | లోకము |
| 128 | 11 | లాకములు | లోకములు |
| 134 | 18 | లాకము | లోకము |
| | 19 | ఆనగా | అనగా |
| 136 | 17 | శకిని | శక్తిని |
| 140 | 3 | సృష్టికి | సృష్టి |
| 143 | 24 | యన్నాడు | యున్నాడు |
| 144 | 23 | నెఱవేర్పు | నెఱవేర్చు |
| 145 | 27 | ముల్లాక | ముల్లోక |
| 146 | 11 | నొందురు | నొందుదురు |
| | 18 | చైతన్యక | చైతన్య |
| 147 | 11 | పాధనల | సాధనల |
| 148 | 25 | యాననారంభము | యావనారంభము |
| 149 | 6 | జీనితము | జీవితము |
| 151 | 7 | ప్రవుల్ల | ప్రఫుల్ల |
| 153 | 25 | అద్ఘుత | అద్భుత |
| 155 | 3 | క్రొత్త | క్రొత్తగ |
| 156 | 20 | యనుభలము | యనుభవము |
| | 23 | జీవున | జీవుని |
| | 30 | పరపురుషుని | పరమపురుషుని |
| 167 | 1 | బలిహార్రై | బలిహారమై |
| 168 | 22 | (1) | (2) |

# రాధాస్వామీ సత్సంగసభవారిచే ప్రచురించబడిన గ్రంథముల పట్టిక.

| గ్రంథము పేరు | | వెల |
|---|---|---|
| **పరమగురు స్వామీజీ మహారాజ్ వారిచే రచియింపబడినవి** | | |
| సార్ బచన్ (శబ్దములు) | హిందీ | 6-50 |
| ,, (వచనము) | ,, | 3-25 |
| **పరమగురు హుజూర్ మహారాజ్ వారిచే రచియింపబడినవి** | | |
| రాధాస్వామీ మతప్రకాశ్ | ఆంగ్లము | 1-00 |
| పిల్గ్రిమ్స్‌పాత్ | ,, | 1-00* |
| రాధాస్వామీమతసందేశ్ | హిందీ | (అచ్చులో నున్నది) |
| రాధాస్వామీమతఉపదేశ్ | ,, | ,, |
| నిజఉపదేశ్ | ,, | 1-25 |
| ప్రేమ్‌ఉపదేశ్ | ,, | (అచ్చులో నున్నది) |
| సారఉపదేశ్ | ,, | ,, |
| ప్రశ్నోత్తర్ | ,, | 1-00* |
| జుగత్ ప్రకాశ్ | ,, | 1-50 |
| ప్రేమ్‌బానీ (1వ భాగము) | ,, | (అచ్చులో నున్నది) |
| ,, (2వ ,, ) | ,, | 4-50* |
| ,, (3వ ,, ) | ,, | (అచ్చులో నున్నది) |
| ,, (4వ ,, ) | ,, | ,, |
| ప్రేమ్‌పత్ర (1వ భాగము) | ,, | 4-75 |
| ,, (2వ ,, ) | ,, | (అచ్చులో నున్నది) |
| **పరమగురు మహారాజ్ సాహబ్ వారిచే రచియింపబడినవి** | | |
| డిస్కోర్సెస్ ఆన్ రాధాస్వామీ ఫేత్ | ఆంగ్లము | 4-25 |
| **పరమగురు సర్కార్ సాహబ్ వారిచే రచియింపబడినవి** | | |
| ప్రేమ్‌సమాచార్ | హిందీ | 1-25 |
| **పరమగురు సాహబ్జీమహారాజ్ వారిచే రచియింపబడినవి** | | |
| ప్రేమ్‌బిలాస్ | హిందీ | 3-00* |
| ,, | గురుముఖీ | 1-00* |
| రాధాస్వామీవాణీ | | |
| సంగ్రహ్ (1వ భాగము) | హిందీ | 1-50* |
| ,, (2వ ,, ) | ,, | 2-00* |

| | గ్రంథము పేరు | | వెల |
|---|---|---|---|
| 24 | ముక్తావళి | ,, | (అచ్చులో నున్నది) |
| 25 | ,, | తెలుగు | 1-00 |
| 26 | టేబుల్ టాక్ | ఆంగ్లము | (అచ్చులో నున్నది) |
| 27 | అమృత్ బచన్ (పరమ్‌గురు మహారాజ్‌సాహబ్ వారి "డిస్కోర్సెస్ ఆన్ రాధాస్వామీ ఫేత్" కు అనువాదము) | హిందీ | ,, |
| 28 | అమృత్ బచన్ | ఉర్దూ | 2-00* |
| 29 | రాధాస్వామీమతదర్శన్ | హిందీ | (అచ్చులో నున్నది) |
| 30 | ,, ,, | ఉర్దూ | 0-50 |
| 31 | ,, ,, | తెలుగు | 0-75 |
| 32 | ,, ,, | తమిళము | 0-30 |
| 33 | ,, ,, | బెంగాలీ | (అచ్చులో నున్నది) |
| 34 | జిజ్ఞాస | హిందీ | ,, |
| 35 | ,, | ఉర్దూ | 0-50 |
| 36 | ,, | తెలుగు | 0-75 |
| 37 | ,, | తమిళము | 0-50* |
| 38 | ,, | బెంగాలీ | 0-25 |
| 39 | సత్సంగ్ కే ఉపదేశ్ (1వ భాగము) | హిందీ | (అచ్చులో నున్నది) |
| 40 | ,, (1వ భాగము) | ఉర్దూ | 1-50 |
| 41 | ,, (2వ ,, ) | హిందీ | (అచ్చులో నున్నది) |
| 42 | ,, (3వ ,, ) | ,, | ,, |
| 43 | మిశ్రిత్ బచన్ | తెలుగు | 1-00 |
| 44 | జతన్ ప్రకాశ్ | హిందీ | (అచ్చులో నున్నది) |
| 45 | భగవద్గీతా కే ఉపదేశ్ | ,, | ,, |
| 46 | ,, ,, | ఉర్దూ | 1-00 |
| 47 | యథార్థప్రకాశ్ (1,2 భాగములు) | హిందీ | (అచ్చులో నున్నవి) |
| 48 | ,, ,, | ఉర్దూ | 1-50 |
| 49 | ,, (3వ భాగము) | హిందీ | 2-00 |
| 50 | ,, ,, | ఉర్దూ | 2-00 |
| 51 | ,, (3 భాగములు) | ,, | 3-50 |
| 52 | డయిరీ (18-9-1930 ల॥ 31-12-1930 వరకు) | హిందీ | 0-65 |
| 53 | ,, ,, | ఉర్దూ | 0-65 |

| | గ్రంథము పేరు | | వెల |
|---|---|---|---|
| 54 | సరణాశ్రమ్‌కాసపూత్ | హిందీ | (అచ్చులో నున్నది) |
| 55 | స్వరాజ్య | ,, | ,, |
| 56 | దీన్‌వదునియా | ,, | ,, |
| 57 | ,, | ఉర్దూ | 0-25 |
| 58 | సంసార్ చక్ర | హిందీ | (అచ్చులో నున్నది) |
| 59 | ,, | ఉర్దూ | 0-25 |
| 60 | ప్రేమ్‌సందేశ్ | హిందీ | 0-25* |

రాధాస్వామీ సత్సంగసభవారి యాధ్వర్యమున అనువదింపబడిన గ్రంథములు

పరమగురుస్వామీజీ మహారాజ్‌వారు రచించినది

| | | | |
|---|---|---|---|
| 61 | సారబచన్ (గద్యము) | ఆంగ్లము | 3-25 |

పరమగురుహుజూర్ మహారాజ్‌వారు రచించినవి

| | | | |
|---|---|---|---|
| 62 | రాధాస్వామీ మతప్రకాశ్ | బెంగాలీ | 1-50 |
| 63 | ,, ,, | తెలుగు | 1-00* |
| 64 | ప్రేమ్‌పత్ర (1వ భాగము) | ఆంగ్లము | 5-75 |
| 65 | ,, (2వ ,, ) | ,, | 5-75 |
| 66 | ,, (3వ ,, ) | ,, | 5-75 |
| 67 | ,, (4వ ,, ) | ,, | 5-75 |
| 68 | ,, (5వ ,, ) | ,, | 5-75 |
| 69 | ,, (6వ ,, ) | ,, | 1-75 |
| 70 | రాధాస్వామీమతఉపదేశ్ | ,, | 1-25 |
| 71 | రాధాస్వామీమతసందేశ్ | ,, | 1-25 |
| 72 | ప్రేమ్‌ఉపదేశ్ | ,, | 1-25 |

పరమగురుమహారాజ్‌సాహబ్‌వారు రచించినది

| | | | |
|---|---|---|---|
| 73 | అమృతబచన్ | బెంగాలీ | 2-75 |
| 74 | ,, | తెలుగు | 3-50 |

పరమగురుసాహబ్జీ మహారాజ్‌వారు రచించినవి

| | | | |
|---|---|---|---|
| 75 | యథార్థప్రకాశ్ (1వ భాగము మేలుప్రతి) | ఆంగ్లము | 4-00* |
| 76 | ,, (సాధారణ ప్రతి) | ,, | 3-25 |
| 77 | ,, (2వ భాగము) | ,, | 5-25 |
| 78 | ,, (3వ భాగము) (1వ వాల్యూము) | ,, | 5-25 |
| 79 | ,, (3వ భాగము) (2వ వాల్యూము) | ,, | 3-75 |

| | గ్రంథము పేరు | | వెల |
|---|---|---|---|
| 80 | జిజ్ఞాస | ,, | 1-25 |
| 81 | రాధాస్వామీ మతదర్శన్ | ,, | 1-25 |
| 82 | ప్రేమ్‌సందేశ్ | ,, | 1-25 |
| 83 | డిస్కోర్సెస్ (సత్సంగకే ఉపదేశ్) 1వ భా॥ | ,, | (అచ్చులో నున్నది) |
| 84 | ,, ,, 2వ భా॥ | ,, | 3-75 |
| 85 | ,, ,, 3వ భా॥ | ,, | 3-25 |
| 86 | జతన్ ప్రకాశ్ | ,, | 1-25 |
| 87 | సెలెక్షన్స్ ఫ్రమ్ ప్రేమ్‌సందేశ్ | ,, | 1-25 |

రాధాస్వామీ సత్సంగసభవారి యాధ్వర్యమున వ్రాయబడినవి లేక సంపాదింపబడినవి.

| | | | |
|---|---|---|---|
| 88 | ఫోర్ లెటర్స్ (హుజూర్ సర్కార్ సాహబ్) | ఆంగ్లము | 0-75 |
| 89 | శబ్దసంగ్రహ (1వ భాగము) | హిందీ | (అచ్చులో నున్నది) |
| 90 | ,, (2వ భాగము) | ,, | ,, |
| 91 | సంత్‌బాణీ సంగ్రహ (1వ భాగము) | ,, | ,, |
| 92 | ,, ,, (2వ భాగము) | ,, | 1-50 |
| 93 | రత్నావళి | ,, | 1-25 |
| 94 | దయాల్బాగ్ పాంప్లెట్ (క్రొత్తకూర్పు) | ఆంగ్లము | 0-50* |
| 95 | సోవెనీర్ | ,, | 5-50* |
| 96 | ,, | తెలుగు | 5-50* |
| 97 | జడ్జిమెంట్ (దయాల్బాగ్‌నకును స్వామీబాగ్‌నకును జరిగిన దావాలో) | ఆంగ్లము | 1-75 |
| 98 | హుజూర్ సాహబ్జీమహరాజ్ ఏజ్ అదర్స్ సాహిమ్ | ఆంగ్లము | 3-75 |
| 99 | మహరాజ్ సాహబ్, సర్కార్ సాహబ్ మరియు సాహబ్జీ మహరాజ్‌వారి వచనములు 1వ భాగము | హిందీ | 4-00* |
| 100 | ,, 2వ భాగము | ,, | 4-75 |

గమనిక : 1. *గుర్తుపెట్టిన పుస్తకములు ప్రస్తుతము స్టాకులోలేవు.

2. పైధరలు నికరము. అవసరము వెంబడిని ముందు తెలియపరచకుండగనే మార్పుచేయబడగలవు.

3 తపాలాఖర్చులును, ప్యాకింగును అదనము.